శ్రీరస్తు.

# ప్రబంధరత్నావళి

వేటూరి - ప్రభాకరశాస్త్రిగారిచే

సంపాదింపఁబడినది.

---

తిరువల్లిక్కేణి

కాజా - వెంకటశేషయ్యగారిచేఁ

బ్రచురింపఁబడినది.



వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

చెన్నపురి.

సదానందనిలయముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

---

1918.

శ్రీ గురుభ్యోనమః.

# పీఠిక.

---

ప్రాచీనకావ్యాలంకారము లిప్పుడు కొన్ని బయల్పడుచుండుట మనయాంధ్రభాషాపథూటి యదృష్టవిశేష మనవచ్చును. చెల్లాచెదరులై లోకమునం జేరుచున్నయట్టి సుకవితాలంకారములు కాలక్రమమున వంకలుదీరి భాషాసౌభాగ్యమును బరిపుష్టిపఱుపఁగలవు. క్రొంగ్రొత్తకవనములఁ గూర్చుటతోఁ బ్రౌఢకవనముల బయల్పఱుచుటయు భాషాసౌందర్యమునకుఁ బోషకమేగదా! గ్రంథములను గైకొనకయు, లోకమునఁ జేరుచున్న యాంధ్రకవితావాఙ్మయము మహాపారముగా నున్నది. అందుఁ గొంత భాషాయోగ్యతఁ బ్రౌఢప్రాయ మనఁదగినదికూడను; నా కట్టివాఙ్మయమును సేకరించుటయందుఁ గోరిక కొంచెంత. ప్రాచీనకవిశ్వరరచితము లగుచాటుధారలను బెక్కింటి సమకూర్చి చాటుపద్యమణిమంజరి యనుపేర నింతకుముందు సంతరించితిని. మాధుర్యము, సరసము, చవి, చక్కన కలిగి యాంధ్రభాషాభాసనలఁ బరిమళించుచున్నకవితలఁ బెక్కింటి సేకరించి వేఱొక గ్రంథమును సిద్ధపఱచుచున్నాఁడను. ప్రాచీనకవిశ్వరకృతము లై యీనాఁడు దొరకకున్నప్రబంధములనుండి ప్రాచీనులే సేకరించి యుంచిన పద్యసముదాయమును "ప్రబంధరత్నావళి" యనుపేర నిప్పుడు ప్రచురించితిని.

ఇంతవఱకు పద్యములను సంకలనము చేసినవారు గలరు. మొదట పెద్దపాటి జగన్నాథకవి: నారాయణస్తుతి, శంకరస్తుతి, త్రిపురవిజయము, అర్ధనారీశ్వరము నని మొదలుపెట్టి యిట్టితెఱఁగునఁ బెక్కువర్ణనాంశముల నేర్పఱుచుకొని యేడాశ్వాసములుగాఁ "ప్రబంధరత్నాకర" మనుపేర నితఁడు గ్రంథము సంధానించెను. పై గ్రంథమున మొదటిమూఁడాశ్వాసములుమాత్రమే తంజా

పురపు సరస్వతీపుస్తకభాండాగారమం దున్నది. కడమగ్రంథ మెక్కడను గానరాలేదు. వేఱొక్కనిపేరు తెలియరాదు. అతనిసంధాన మాంధ్రసాహిత్యపరిషద్భాండాగారమునం గున్నది. ఆసంధానమునకుఁ బేరు లేదు. మొదలు లేదు. తుద లేదు. పరిషత్తువా "రుదాహరణపద్యము"లని పేర్కొన్నారు.* ఈ యిర్వురకూర్పులందలి పద్యములను గుచ్చియెత్తి నే నీప్రబంధరత్నావళిని గ్రొత్త వెలయించితిని. పైయిరువుర సంధానములందుండినను నిప్పటికి ముద్రితము లై సుప్రసిద్ధము లై దొరకుచున్ననన్నయాదుల భారతాదులలోనిపద్యముల నిందుఁ జేర్పలేదు. కవులనుగావ్యములందలి పద్యములను గూడ నకారాద్యక్షరక్రమమునకుఁ దార్చితిని. భాషాకవిచరిత్రాన్వేషకుల కీచేఁత మిక్కిలిసాహాయ్యక మగునని చక్కఁ జర్చించియే సల్పితిని. ఇర్వురసంధానములు వేర్వేఱు తెఱఁగులవి. ఆరెంటిని జేర్చుటలో విషయానుక్రమణికిఁ జిక్కు కలదు. పూర్వోత్తరసందర్భరాహిత్య మిప్పుడే కాక యప్పుడు నున్నది. ఆకూర్పులుకూడఁ గథాఘటితములు కావు. కావున నీకూర్పుచేఁత కొంత చిక్కును దీర్చుటయే.

ప్రయోగరత్నాకరము† రంగరాట్ఛందము మొదలగుకొన్నిలక్షణగ్రంథములందుఁ బ్రాచీనకవికృతములుగాఁ గొన్నిప్రబంధములపేళ్లతోఁ బద్యములుదాహరింపఁబడియున్నవి. ఆ పద్యములనుగూడ నీ కూర్పునందుఁ జేర్పఁ జూచితిని గాని యాలోచింపఁగా నం దసత్యతాసంశయము సంఘటిల్లెను. గణపవరపు వేంకటకవిప్రభృతులు కొందఱు తమకుసమ్మతము లగుకొన్ని ప్రయోగములను నిల్వరించుకొనుటకయి తమలక్షణగ్రంథములందు లక్షణకల్పనముచేసి లక్ష్యముగాఁ బ్రాచీనకవీశ్వరకృతు లైన ప్లేవో గ్రంథనామములను, పద్యములను సృష్టించియుందు రనితోఁచెను. నన్నయఇంద్రవిజయములోని దట యీపద్యము !

---

*ఇది నాపా శ్రీ. కే. వి లక్ష్మణరావుపంతులుగారి మూలమున వచ్చినది.

†ఇది గణపవరపు వేంకటకవిది. తంజాపురిపుస్తకశాలలో నున్నది.

"క. అంగజుఁ డనుమాసటి చ
క్కంగను రాయంచయేనుఁగును నూఁకుచుఁ జే
చెంగలువ నేజచేఁ జెలి
చంగవనడుచక్కిఁ గ్రుమ్మి సరగున నార్చెన్."

విశ్వాస్య మగునా? ఇట్లే భాస్కరునిసునందోపాఖ్యానము, సోముని హరవిలాసము, భీముని నృసింహపురాణము మొదలగునవి. కావున లక్షణ గ్రంథములందలిపద్యముల నిందుఁ బొందింప మానితిని. అవియెల్ల వేఱొక చోట స్పష్టముగా వెల్లడించెదను.

పెద్దపాటిజగన్నాథకవి కృష్ణామండలమందలి యేలూరునకుఁ జేరువ నున్న పెదపాడునం దున్నవాఁడు. తన గ్రంథము నతఁడు నీలాచలమందు నెలకొన్న జగన్నాథస్వామి కంకితము సేసినాఁడు. ఆతనివంశస్థితి మొదలగునది యీ గ్రంథము ననుబంధమును జూచి యెఱుంగునది.

ఇర్వురుసంఘాతలును గొంచె మించుమించుగా సమకాలమువారనియే తెలియవచ్చును. మన మెఱిఁగినంతలో జగన్నాథకవి యుదాహరించినవారిలో మాదయగారిమల్లయ్య, తెనాలి రామలింగయ యును, రెండవసంఘాత యుదాహరించిన వారిలో నల్లసాని పెద్దనార్యుఁడును నర్వాచీనులు. జగన్నాథకవికంటె నిర్వదేండ్లు రెండవసంఘాత ప్రాచీనుఁడయినట్టుఁ గావచ్చును.

గ్రంథమున నకారాద్యక్షరక్రమమున నుదాహరింపఁబడిన యథర్వణాదు లగుకవులను గూర్చియుఁ దత్కృతులనుగూర్చియు దెలుపఁదగిననూత్నవిషయముల నిఁక నిందుఁ గొండొక వివరించుచున్నాఁడను. ఇందు నేను జేర్కొనని వారిం గూర్చి భావికాలపరిశీలనములవలనఁ గాని, నేఁడే యింతకంటె హెచ్చు పరిశీలించి యుండిన ప్రాజ్ఞలోకము మూలమునఁ గాని విశేషవిషయములు బయల్పడవలయును.

అథర్వణాచార్యుఁడు.—ఈతని భారతము లాక్షణికు లుదాహరించెదరు. 'తృష్ణాకంతు' అన్నపద్యము లక్షణగ్రంథములందలిదే. ఈతనియాంధ్ర

చ్ఛందస్సు నాకు లభింపలేదు. వికృతివివేక మనియు, త్రిలింగశబ్దానుశాసన మనియు సంస్కృతమున రెండాంధ్రవ్యాకరణగ్రంథము లీతని పేరఁ గానవచ్చుచున్నవి. ఈ రెండును నథర్వణుని పేర నితరులచేఁ గల్పింపఁబడినవే యని యూహ. "శ్లేషే సఖండపనిర్బంధో" ఇత్యాదిలక్షణము లుండుటను బట్టి యాయూహ యుక్తముగాఁ దోఁచుచున్నది. ఆయినఁగా, సంస్కృతమున నున్న యాంధ్రవ్యాకరణము లన్నియుఁ గొంతయసత్యకల్పనములతోఁ గూడినవిగనే కన్పట్టును. రా. బ. కందుకూరు వీరేశలింగము పంతులుగారు:—

*"ప్రమాణ మకలంకస్య పూజ్యపాదస్య లక్షణమ్" అని వికృతివివేకమున చేర్కొనఁబడిన యకలంకుఁడు కర్ణాటకవ్యాకరణమును రచించిన యకలంకుఁడనియు, నాతఁడు క్రీ. శ. 1604-లో నుండెనుగావున నది యహోబలపండితుని కాలముననే సృష్టింపబడియె ననియుఁ గ్రొత్తవెల్వరించిన కవులచరిత్రమున విశేషవిషయము చేర్చినారు. ఇది సిద్ధాంతము కానేరదు. అకలంకుఁడు ప్రాచీనుఁ డున్నాఁడు. ప్రాకృతవ్యాకరణకర్తలలోఁ బూజ్యపాదుఁడు ప్రాచీనతముఁడు; ప్రసిద్ధుడు; క్రీ 1490 ప్రాంతమున †'ఔదార్యచింతామణి' యను ప్రాకృతవ్యాకరణము రచించిన శ్రుతసాగరుఁడు వీరిని చేర్కొన్నాఁడు. వికృతివివేకమునఁ జేర్కొనఁబడినవారు వీరే కారాదా? ఆశ్లోకము లివి:—

"సమంతభద్రై రపి పూజ్యపాదైః కలంకముక్తై రకలంకదేవైః
యదుక్త మప్రాకృత మర్థసారం త త్ప్రాకృతం చ శ్రుతసాగరేణ
శ్రీపూజ్యపాదసూరి ర్విద్యానందీ సమంతభద్రగురుః ।
శ్రీమదకలంకదేవో జినదేవో మంగళం దిశతు.

---

*జైనులకు:- శ్లో॥ ప్రమాణకలంకస్య పూజ్యపాదస్యశాసనమ్ । ద్విసంధానకవేః కావ్యం రత్నత్రయమిదంస్మృతమ్.

†ఇది విశాఖపట్టణమున శ్రీ పరవస్తువారియార్ష పుస్తకశాలలో నున్నది.

శ్రీపూజ్యపాదనకలంకసమంతభద్ర
శ్రీకుందకుందజినచంద్రవిశాఖసంజ్ఞాః
శ్రీమాఘనందిశివకోటిశివాయనాఖ్యాః
విద్యాధనందిగురవశ్చ మమీ దిశంతు."

సమయసంకోచముచే నీవిషయ మింతటి విడిచెదను. బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు,

"క. సగణమ్ముగ దియ్యరగణము
వగవక కృతిమొదటనిలుపు వానికిమరణం
బగునిక్కమంద్రుమడియఁడె
యగునని యుడితొల్లి పెంక ణాదిత్యుఁడనిన్."

అను పద్య మధర్వణాచార్యుని ఛందమందలిదని కుమారసంభవ పీఠికలోఁ జేర్చినారు. వారు దీని నేదేని లక్షణగ్రంథమును జూచి కైకొనిరో యధర్వణఛందమును జూచియే కైకొనిరో చెప్పలేదు. ఇది యధర్వణుని దగునాఁ డాతఁడు నన్నెచోడునికంటెఁ దర్వాతివాఁడగును. మఱియు వారే క్రీడాభిరామమును ముద్రించుచు దానికి నాందిగా "అంబరసీమఁ దారలు" అనుపద్యము నుదాహరించి యది 'యధర్వణుని భారత విరాటపర్వమున మొదటి యాశ్వాసమునుండి' యెత్తఁబడినట్లు వ్రాసినారు. వారదాని నధర్వణభారతవిరాటపర్వప్రథమాశ్వాసమునఁ జూచిరేమోగాని, యిందు 'దానరాజు సోమయభరత' మందలిదిగాఁ గూర్పఁబడియున్నది. ఏది సత్యమో?

అన్నయయ్యంగారు, తాళ్లపాక.—ఈతఁడు రా. బ. కం. వీరేశలింగము పంతులుగారి కవులచరిత్ర ప్రథమభాగమునఁ జేరవలసినవాఁడు. పదునాల్గవశతాబ్దిలో నించుమించుగా శ్రీనాథునికాలమున నున్నవాఁడు. తిరుపతితామ్రశాసనమునుండి యీ విషయ మెఱుఁగఁబడును.

అప్పన.—ఈతఁడు భోజమహారాజుచే సంస్కృతమున రచియింపఁబడిన చారుచర్యను దెలుఁగుసేసినవాఁడు. ఏనాఁటివాఁడో తెలియదు. రచనమును బట్టి ప్రాచీనుఁ డని యూహించితిని. గ్రంథారంభ మిట్లున్నది.*

క. ప్రత్యూహబహుళతిమిరా
దిత్యుఁడు శ్రీకీర్తిభారతీసంతతసం
పత్త్యన్వితుండు శ్రీహరి
నిత్యుఁడు నాగాంబయప్పనికిఁ బ్రియ మొసఁగున్

సీ. విద్వన్నుతుండు భారద్వాజగోత్రుఁ డా
పస్తంబసూత్రుండు పరమపుణ్య
విమలోజ్జ్వలాంగి గోవిందార్యునకుఁ గుల
ద్వయశిరోభూషణధర్మచరిత
నాగమాంబకుఁ గూర్మినందనుఁ డప్పయ
మణిమాళి సింగనామాత్యమేన
యల్లుఁడు ధార్మికుఁ డనఘుండు శ్రీవల్ల
భాచార్యతమ్ముండు హరిపదాంబు

గీ. జాతషట్పదుఁ డుభయభాషాకవిత్వ
మానవైదగ్ధ్యుఁ డప్పనమంత్రివిభుఁడు
సంస్కృతంబున నొప్పారు చారుచర్యఁ
దెనుఁగు సేసెఁ దా నెంతయుఁ దేటపడఁగ.

ఉ. రాజహితంబుగాం బెను సుకరంబుగ వైద్యసునీతిధర్మని
ర్వ్యాజపథానుసారమధురంబుగ నిర్జరభాషఁ దొల్లి యా

---

*ఇది శ్రీముక్త్యాలప్రభువు లగు శ్రీరాజావాసిరెడ్డి చంద్రమౌళీశ్వరప్రసాదబహద్దరుగారి పుస్తకశాలలో నున్నది. తంజావూరు పుస్తకశాలలో గ్రంథారంభము కొంచె మున్నది.

భోజునిచేతఁ జెప్పఁబడి పొల్పగు నీకృతి నూత్నసత్కథా
భోజుఁడు మంత్రియప్పన ప్రబుద్ధుఁడు చేసెఁ దెనుంగు బాసఁగన్.

ఎఱ్ఱయ, కూచిరాజు.—*సకలకథానిధాన మని, కోకోక మని యీతనికృతులు రెండున్నవి. కోకోకము సర్వత్ర దొరకునదియే. ఇందలి సకలపురాణసారము మూఁడవది. ఇది యింతవఱకు లభింపలేదు. సకలకథానిధానపుఁబీఠికలో నిది పేర్కొనఁబడినది. చూఁడుఁడు.

"సీ. శ్రీవత్సగోత్రవారిధిపూర్ణశీతాంశుఁ
డగుకూచమంత్రికి నాత్మజుఁడవు,
వివిధాష్టభాషాకవిత్వవాచాప్రౌఢిఁ
బూర్వకవీంద్రులఁ బోలినాఁడ,
వఖిలపురాణేతిహాసకావ్యస్మృతి
చయము రచించినచారుమతివి,
మాపినతండ్రి యెఱ్ఱమల్లమంత్రికిని గో
కోకంబు సెప్పినకోవిదుఁడవు,
గీ. రసికు లభినుతిసేయఁ బురాణసార
మనుపమంబుగ నాకిచ్చినట్టిప్రోడ
వట్లు గావున నొకటి నిన్నడుగఁదలఁచి
యిచ్చటికిఁ బిల్వఁబంచితి నెఱ్ఱనార్య!"

కేతనప్రసంగము.— ప్రయోగరత్నాకరమందు "భాస్కరుని కేతన కాదంబరి" అని కలదు. దశకుమారచరిత్రకర్త మ్రానయకేతన కావున నాతఁడు వేఱగును. తిక్కనసోమయాజి పిత్రువ్యుఁడొకకేతన కలఁడు. ఆతని తండ్రి భాస్కరుఁడే. దశకుమారచరిత్రమం దీవిషయము గానవచ్చుచున్నది. అందలి వర్ణనమునుబట్టిచూడఁగా నాభాస్కరునికేతనయుఁ గవిగా నెఱుఁగఁబడుచున్నాఁడు

---

*ఇది ప్రాచ్యలిఖితపుస్తకశాలలో గ్రంథపాతములతో నున్నది. ముద్రింపఁదగినయుత్తమకావ్యము. ప్రత్యంతరము దొరకలేదు.

కర్ణాటభారతమందుమాత్ర మున్నది. ఆంధ్రమున వేఱుగ నున్నయీకృతి యత్కర్తృకమో నాకెఱుఁగరాలేదు. గంగరాజుకృతి యని మీ రెట్లువ్రాయఁగల్గితి రని శ్రీ వీరేశలింగముపంతులవారికి వ్రాసి కనుఁగొంటిని. శ్రీ రామకృష్ణకవిగా రపూర్వవాఙ్మయపరిశోధన మనుపేరఁ బ్రచురించిన యుపన్యాసమునఁ జూచి వ్రాసితి మని బదులు వ్రాసిరి. *కవిగా రెట్లుపన్యసించిరో నాధార మేమో? తెలియవలసియున్నది.

చిక్కయ, చందలూరి.—నాచికేతూపాఖ్యానము నిద్దరు తెల్గున రచియించినారు. ఈతఁడును, శ్రీనాథుని బావమఱఁది దగ్గుఁబల్లిదుగ్గనయును; ఈతఁ డేనాఁటివాఁడో! దుగ్గన నాసికేత (నాసికా+ఇత) పదమును బ్రాసమున 'స' వచ్చునట్లు సవ్యుత్పత్తికముగాఁ జేర్కొనుటచే నట్లే ముద్రించితిని. ఉపనిషత్తులయందు నాచికేతుపదమే కన్పట్టును. దుగ్గనకృతి శివకాంచీమాహాత్మ్యము దొరకలేదు. †నాసికేతోపాఖ్యానమున్నది.

చౌడయ, గంగరాజు.—కసువామాత్యున కంకితముగా నొకసాముద్రికమున్నది. అది యీతని దగునో? ఈతఁ డేనాఁటివాఁడో? నంద (న) చరిత్రము దొరకలేదు.

తిక్కన.—విజయసేనమునందలి దని యిందు వైశ్యవర్ణనము (156-వ పద్య) మున్నది. ప్రబంధమణిభూషణమున నిక్రిందిపద్యము తిక్కన విజయసేనములోని దని శ్రీకవిగారు వ్రాసినారు.

"సీ. అమ్మిడ సనినఁ బద్మాక్షుకౌస్తుభ మైన
వెఱవక కొనియెదు వెరవు గలిగి,

---

* శ్రీ వీరేశలింగముపంతులుగారు స్వకీయములగు విషయము లనేకములు స్వకపోలకల్పితములుగ కవులచరిత్రమునఁ జేర్చినారు. ఆయా విషయముల కాకరము తెలుపకుండుట భావిపరిశీలకులకుఁ జిక్కుఁగల్గించును.

† ప్రాచ్యలిఖితపుస్తకశాలలో.

విలువ యిచ్చెద మని వేఁడినఁ బాలిజాన్నఁ

గమ్మపసిండియు నమ్మఁ గలిగి,

యేవస్తు వెంతప్రాప్తింపఁజు చనుదెంచి

యెంతటి కడిగిన నెదురఁ గలిగి,

తమయింట లేనియర్థము లర్థపతియింట

నైన వెదకిన లే వనుట గలిగి,

గీ. తనుపలాచారవర్తన [?] ము కొలఁదిని

నంగడులయొప్పనపును బేహారపు మాట

గాని లాభమునకు నాటు గాసనంగ

వఱలుదురు పురవరమున వైశ్యవరులు.''

ఇది సువైశ్యవర్ణనమే. రెండుపద్యములును విజయు నేసరుంచినవే యగునా?

తిమ్మయ్య, కుంటముక్కల.— *ఈతని శైవాచార సంగ్రహము దొరకియున్నది.

త్రిపురాంతకుఁడు. రావిపాటి.—ఈతనికృతులలో †త్రిపురాంతకోదాహరణముమాత్రమే సమగ్రముగా దొరకియున్నది. తారావళి, అంబికాశతకము, ప్రేమాభిరామము దొరకలేదు. క్రీడాభిరామమునకు సంస్కృతమైన ప్రేమాభిరామమును రచియించుటచేతనే యేమో యీతనిఁ గూచిరాజు—ఎఱ్ఱన యిట్లు తనకొక్కోకమునఁ బేర్కొన్నాఁడు

''సీ-గీ. ముని సనత్కుమారు ధనపతనూభవు

నాశ్వినుల జయంతు నభినుతించి

---

*ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో;

†తంజావూరుపుస్తకశాలలో నున్నది. శ్రీరామకృష్ణకవిగారు ముద్రించినారు.

పృథివి రావిపాటి త్రిపురాంతకాదిశృం
గారకవుల నెల్ల గారవించి.''

ప్రేమాభిరామము శృంగారకావ్యమే యగును గదా! రామకృష్ణకవి గారు త్రిపురాంతకుఁడు మదనవిజయ మను కామశాస్త్ర గ్రంథమును (వాత్స్యాయన సూత్రములకుఁ దెలుఁగఁట.) రచియించె నని వ్రాసినారు.* దొరకినంతవఱకుఁ బరికింపఁగా నితని యాంధ్రకవిత యతిప్రశస్తముగా నున్నది. ఈ క్రింది రెండు పద్యములు కూడ నంబికాశతక మందలివి.†

''చ. బెడఁగు సురత్నదర్పణముఁ జేరన వెన్నెల బోసి నిచ్చలుం
దుడువక పాలసంద్రమునఁ దోఁచి సుధాకరు మేనికందుఁ బోఁ
గడుగక నేరరేటు సితకంజము ముంపక నైజకాంతి తోఁ
దొడరినఁ దల్లి! నీ మొగముతోఁ సరిపోల్పఁగఁ జాలు నంబికా!

ఉ. అప్పులబోరుఁదల్పు లిసిజెంతలు నా అడుచూపుఁ గుంచియుం
ద్రిప్పి తళుక్కునం దెఱచి తిన్నని మోమునఁ గాయు వెన్నెలల్
ముప్పిరిగొన్న వేడుకలు మూఁగిన సిగ్గసియాడఁ బ్రీతి నీ
వప్పరమేశుఁ జూచి తనువర్ధముఁ గొంటి పొసంగ నంబికా!''

నరసింహభట్టు, అనుమూరి.—ఈతని షోడశకుమారచరిత్రము దొరకలేదు; కాని, వేఱొక కవి, వెన్నెలకంటి సూరనకుమారుఁడు, డన్నయామాత్యుఁడు రచియించిన షోడశరాజచరిత్ర మొకటి దొరకినది.‡ శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులుగారు శబ్దరత్నాకరమున షోడశకుమారచరిత్ర మొకటి

---

* క్రీడాభిరామపీఠికాదులు చూడుఁడు.

† ప్రయోగరత్నాకరమునం దున్నవి. మా. రా. కవిగారు ఉదాహరణ పీఠికలోఁ గూడ నుదాహరించినారు. మొదటి పద్యము సర్వ మసందర్భముగా నున్నది. తుడువఁగ, కడుగఁగ, ముంపఁగ, తొడరిన తల్లి, అని యుండఁగూడును.

‡ ఇది నాదగ్గఱ నున్నది. గ్రంథపాతములతో నిండి యందుకులుగా నించుక మాత్ర మున్నది.

యెల్లనకృతముగా నుదాహరించినారు. వారుపరికించిన యాప్రతి యెక్కడ నున్నదో?

నాగనాథుఁడు, పశుపతి.—ఈతఁడు వెన్నెలకంటిసూరనకంటెఁ బ్రాచీనుఁడే కావలెను. శ్రీవీరేశలింగముపంతులుగారు వెన్నెలకంటిసూరన (విష్ణుపురాణకర్త) కాలము క్రీ. 1480-90 ప్రాంత మని యసమర్థసాధనములతో సిద్ధాంతపఱిచినారు. కాని తత్కృతిపతి యగు *బసవయ రాఘవుఁడు క్రీ. 1526-29 ప్రాంతమున నున్నవాఁ డగుటచే నాతఁడంతకుఁ గొంత తర్వాతివాఁడగును.

నన్నిచోడఁడు.— ఈకవికాలనిర్ణయాదికమును గూర్చి పెక్కురు చర్చించియున్నారు. అన్నిచర్చలపర్యవసానము నింతే. ఈకాలమువాఁడని నిర్ధారించుటకుఁ దగినసాధనములు లేవు. శ్రీచిలుకూరి వీరభద్రరావుగా రాంధ్రులచరిత్రమున నిట్లు వ్రాసినారు. "క్రీ. 925-40 సం. ప్రాంతమున నున్నయీసత్యాశ్రయుని నన్నెచోడమహాకవి తనకుమారసంభవకావ్యమున నీక్రిందిపద్యములోఁ జేర్కొని యున్నాఁడు.

"క. మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గు నిలిపి రంధ్రవిషయమునఁ
జన సత్యాశ్రయునిఁ దొట్టి చాళుక్యనృపుల్."

దీనింబట్టి నన్నయభట్టారకునకు నూఱేండ్లకుఁ బూర్వమే యాంధ్రకవితాశక్తి వర్ధిల్లుచున్న దని స్పష్టమగుచున్నది."

శ్రీవీరభద్రరావుగారుగాని మఱియెవరుగాని, నన్నిచోడఁడు నన్నయకంటెఁ బ్రాచీనుఁడని చెప్పఁజూచుటకును, గావచ్చు నని లోకము విశ్వసించుటకును నీపద్యమే ప్రధానాధారముగా నున్నది. శ్రీరామకృష్ణకవిగారు

*బసవయరాఘవుని శాసనము. (బట్టర్వర్తుగారి శిలాశాసనముల, వాల్యుము 2 లో, నెల్లూరు జిల్లా, కనిగిరితాలూకా శాసనములలోఁ జూడుఁడు.)

ప్రచురించిన కుమారసంభవపుముద్రితప్రతిలో నీపద్య మిట్లున్నది. 1909లో దీనిని ముద్రించినారు. అప్పు డీపద్యమునకు వారు పాఠాంతరమును జూపలేదు. వారి యచ్చునకు మాతృక యెక్కడిదో చెప్పను లేదు. కాని తంజాపురి సరస్వతీపుస్తకభాండాగారమునఁ దాటియాకులపై వ్రాయఁబడిన కుమారసంభవపుఁబ్రతి యున్నది. అక్కడఁ దక్క నింతవఱకుఁ బ్రత్యంతర మెక్కడను మనకుఁ గనరాదు. వినరాదు. ఆపుస్తకములోఁ బైపద్యమిట్లున్నది.

"క. మునుమార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గున నిలిపె నంధ్రవిషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్."

కవిగారి "చన సత్యాశ్రయునిఁ దొట్టి చాళుక్యనృపుల్" అన్నపాఠ మెక్కడనుండి వచ్చినదో! వారింకనెక్కడి ప్రతిసంపాదించినారో! ప్రథమభాగమును ముద్రించునప్పటికి వారికి తంజావూరుప్రతి నెఱుఁగనే యుండఁగరు గావలయును. ఎఱుఁగియుండిరేని యీసర్గము నాగుపాఠమును జూపకుండుట కేమికారణము? తంజావూరుపుస్తకశాలలో నన్నిచోడనికుమారసంభవమున్నదని యెల్లరు నెఱిఁగిన తర్వాత క్రీ. 19..-లో వీరు ప్రచురించిన కుమారసంభవపు రెండవభాగమున "చాళుక్యరాజుమొదలుగఁ బలువుర్" అను పాఠాంతర మున్నట్లు తెలిపిరి. కాని యిప్పటికైనను తంజాపురిఁ బుస్తకమును వీరు చూచినట్లు వ్రాయలేదు. కావున నీపాఠము మఱియొక ప్రతిలోఁ జూచినారేమో! అట్టిప్రతి యెందులకు? తంజావూరుపుస్తకపాఠము మాత్రమే మానకప్పుడు గ్రాహ్యము: శ్రీకవిగారిపాఠము గలమాతృక బయల్పడువఱకును, అట్టిప్రత్యంతరము బయల్పడెనా యది పాఠాంతరముగాఁ గూర్చుకొందము. ఇఁకఁ "జాళుక్యరాజుమొదలుగ" నన్నప్పుడు రాజరాజనరేంద్రుఁడే యేల కారాదు? చోడఁడు నన్నయకంటెఁ బ్రాచీనుఁ డనుట కాధారములు తగినవి లేవు. శ్రీవీరేశలింగముపంతులుగారు నన్నిచోడనిభాషాప్రయోగములను

కూర్చి చేసినయాక్షేపములు నిలువఁజాలనివి.* వానినెల్ల నిర్వచించుట కిక్కడ స్థలము చాలదు. పాల్కురికిసోమనాథుఁడు 1180 ప్రాంతముల నున్నవాఁ డనుపంతులవారిసిద్ధాంతము పోలును. నన్నిచోడఁ డంతకు ముందటివాఁడో వెనుకటివాఁడో సిద్ధాంత మేర్పడలేదుగదా! ఈయిర్వురిలో నొకనిపుస్తకము నింకొకఁడు చక్కఁగా సంగ్రహించుకొన్నాఁడు. ఇది చదివిచూడుఁడు!

"ద్వి. నెట్టన నేలకు నింగికి సూత్ర,
పట్టి మోఁకాళ్లకు బట్టతలలకు
ముడివెట్టఁ దనసడ గడవంగఁ బాఱ,
వడి నెండమావులకడగళ్లు కట్టి;
పాయక రెండుగాఁ బారెడునీరు,
త్రేయఁ బుల్లున్న గోరో యని యమ్మ;
కానార యొలువఁ జట్రాతిపైఁ గ్రుంక,
నేనుంగుపురు డోమ నిసుము త్రాఁడ్పేన;
లిగొంచెనలు తాళములు వాయింపఁ,
జెలఁగుచు రోఁకటఁ జిగురులు గోయ;
కలి వెన్న పుచ్చఁ గొండలు దాఁటిఁ జెప్ప,
నిల మంచుఁ గుంచానఁ గొలువ రేఁబవలు
సేయ నాకసమునఁ జిత్రరూపములు,
వ్రాయ వాయువుఁ బట్టి వడగళ్లుగుళ్లు
గట్టి వెన్నెలగుంపుగాఁ జేయవచ్చి
పుట్టినప్పుడె నేర్చు బుద్ధులప్రోఁకె."

"సీ. నేలయు నింగియుఁ దాళముల్ వాయింప
నెండమావులఁ బట్టి బంధితలయు,

---

* ఆంధ్రకవుల చరిత్రము I భాగము.

మ్రాఁకాకు ముడివెట్ట రోఁకటఁ జిగుళులు
గోయఁ జట్రాతిపైఁ గ్రుంగ నిడువు,
లేక చిత్రము వ్రాయ నాకాశమునఁ దాఁప
రము నిడ నుంచుఁ గుంచములఁ గొలువ,
నేనుంగుపురు డోసు ఊనార గొన గాలి
గం టిడ నిసుమున గట్టు దాల్ప,
గీ. సిరినడుము దెంప నేలఁ దెన్నుండి చే
వెల్పఁ గలియుఁ ద్రచ్చి వెన్న గొనఁగఁ
గడవ నేర్పు గలిగి కందువు మానెఁ దై
కత్తిగంటు లయిన యత్తగంతు." కుమా. భా. 2-135.

ఇట్లీయిర్వురగ్రంథములనుండియు వలసినన్నిసంవాదములు చూపవచ్చును. సులువుగా ద్విపదలో సోమనాథుఁడు కూర్చఁగా నన్నెచోడఁడిట్లు సీసపద్యమునఁ జేర్చుకొన్నాఁడేమో! సుసూక్ష్మముగా నీయిర్వురకృతులను బరిశీలించినచో నీవిషయము బయల్పడఁగలదు. భాషావ్యుత్పత్తిలోఁ జోడఁడును సోమనాథుఁడునుగూడ సమాధికులేయని యాయాగ్రంథములఁ జక్కఁగఁ జదివి యెఱిఁగినవారు భావింతు రని నా నమ్మకము.

పెద్దిరాజు, పొన్నాడ.—ప్రబంధమణిభూషణపుఁ బీఠికలో శ్రీరామకృష్ణకవిగారిట్లు వ్రాసిరి. "విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణియుఁ* బ్రద్యుమ్నచరితయు రచియించెను. రెండవకృతిచాలఁ బ్రౌఢమయినది. దానిలోనుండి 113-వ పద్యము మాత్రమే గ్రహింపఁబడినది." కావ్యాలంకారచూడామణి కర్తయింటిపేరు విన్నకోట గదా! ప్రద్యుమ్నచరిత్రకర్తయింటిపేరు పొన్నాడ యని యిందున్నది. కవిగారిట్లు వ్రాయుటకేమి యాధారమో? ప్రద్యుమ్నచరిత్రము వారికడ సమగ్రముగానుండెను

*కావ్యాలంకార చూడామణి 7. ఉల్లాసములు మాత్రము ముద్రింపఁబడెను. ఇంకను మఱికొంత గ్రంథము ముద్రింపఁబడవలసియున్నది.

గాఁబోలును. లేనిచో నదిచాలఁ బ్రౌఢుఁడయినవానికిని నస్వాతంత్ర్యమేఁబదికిఁ బైపడిన పద్యములు యుక్తార్థకములో, యేకాంతములోనివో తనకెఱుఁగ రాకపోయిన యీ ప్రబంధమణిభూషణమున, 118-వ పద్యమొకటిమాత్రమే ప్రద్యుమ్నచరిత్రమునుండి గ్రహింపఁబడినదనియు నెట్లు చెప్పఁగల్గుదురు? కవిగారు ప్రబంధమణిభూషణ నామపేరుతోఁ బ్రచురించిన సంధానమునకుఁ బ్రతులు నాల్గయిదు తంజాపురపుఁ బుస్తకశాలలోనున్నవి. కాని వానియందు లేనిపద్యముల నేకములు వీరి ముద్రణమునఁ జేరినవి. ఏ యే ప్రతులను బట్టి యీ గ్రంథమును ముద్రింపఁగల్గినారో తెలియదు.

పోతరాజు.—ఇతఁడొక బేతాళపంచవింశతి రచియించెనట! శ్రీ రామకృష్ణకవిగారు తమకు దొరకిన కవిభల్లటుని విక్రమార్కచరిత్ర, బేతాళ పంచవింశతి యందలి వని యుదాహరించిన పద్యములు కూచిరాజు ఎఱ్ఱయ రచించిన సకల కథానిధానమందలి బేతాళపంచవింశతి కథలలోనివే. ఇటీవల నొక బేతాళపంచవింశతి భాగము దొరకినది.* అది యెత్కృతియో?

మల్లయ, నంది.—ఇతఁడును ఘంటసింగయయును గలసి జంటకవు లుగదా! అఘోరశివాచార్య దక్షిణామూర్తిశివాచార్యులకు వీరు శిష్యులు. విద్యానగరమున 'శివాచార్య' పీఠమొకటి యాకాలముననుండెను. అందు వైరాగ్యశివాచార్య ఘోరశివాచార్య దక్షిణామూర్తిశివాచార్యాదు లధిష్ఠాతలు. అఘోరశివాచార్యాదుల కృతులు శైవాగమగ్రంథములు శైవతత్త్వాన్వితాదులు పెక్కులున్నవి. విద్యావ్యాఖ్యాపకుఁడట యఘోర శివుఁడు. మా. రా. కవిగారు క్రీడాభిరామపీఠికలో "......అవిరుచ్యములు గావని నందిసింగన యుఘంట మల్లయయు - (ఇంటిపేర్లఁ బేర్లను దార్మారు.) గలసి యార్వీటి తిమ్మ రాజున కంకితముగా షష్ఠస్కంధమును శృంగార షష్ఠమను పేరుతో రచించిరి" అని వ్రాసినారు. నందిమల్లయ ఘంటసింగయలు ప్రసిద్ధులు. వారుగాక వీరు వ్రాసిన విధముగాఁగూడ నిర్వురున్నారా? ఏమో? లక్షణగ్రంథకర్తలు

* ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో నున్నది.

ాచమల్లువారి శృంగారషష్ఠమని యుదాహరింతురు. ఇదియెట్లో? ప్రయోగ త్నాకరమున శృంగారషష్ఠమందలిదిగా నీపద్య ముదాహృతము.

“ఉ. చండాంశు ప్రభవీక్షు తిమ్మయతనూజా! తిమ్మ! విధ్వస్తపా
షండంబైన త్రిలింగభాగవత షష్ఠస్కంధభాగంబు నీ
కుండక్కెం జతురాననత్వగుణయుక్త శ్రీల వాణీమనో
భండారోద్ధతి చూఱకారబిరుద ప్రఖ్యాతి సార్థంబుగన్.”

కాసంధానమున మలయమారుతము స్వీయ షష్ఠస్కంధ ముదాహరింపఁబడినది.

**రామయ్య, ఆంధ్రకవి.**—వాసిరాజు రామయ్యయు నీతఁడు నొక్కఁడో? వేఱో? ఈతఁడు ప్రాచీనకవులను మాత్రమే స్తుతియించినాఁడు. అందు, “ఛందోనిబంధనచాతురీఝాఁకేయ వార్ధామువేములవాడభీము” నను చున్నాఁడు - లాక్షణికులుగూడఁ బెక్కురు కవిజనాశ్రయము వేములవాడ భీమకవి రచితమని యుదాహరించెదరు.

“క. చను నుత్తమగండాఖ్య, ర్వణహనుమదనంతనకవిరాక్షసజయదే
వనుతశ్రీధరగోక, ర్ణనీలకంఠాది భీమనచ్ఛందంబుల్”

అనఁగా “దశవిధచ్ఛందములు.” రంగరాట్ఛందస్సు.

ఈ విషయము మిక్కిలి సందిగ్ధముగానేయున్నది. భీమకవియే రచియించి కోమటియగు మల్లియరేచనిపేరఁ బ్రకటించెనని నానుడి! ఆకోమటి మిక్కిలిగా నందుఁ బ్రశంసించుకొనఁబడినాఁడు. వేములవాడ భీమకవియో కోమట్లను బడఁదిట్టినవాఁడు; వినుఁడు.

ఉ. “కోమటి కొక్కటిచ్చి పదిగొన్నను దోసములేద, యింటికిన్
సేమమెఱింగి చిచ్చిడినఁ జెందద పాపము; వానినెప్పుడే
నేమఱుపాటున న్మఱియు నేనియొనర్చిన లేద దోస; మా
భీమునిలింగమాన! కవిభీమునిపల్కులు నమ్మియుండుఁడీ.

చ. గొనకొని మర్త్యలోకమునఁ గోమటి పుట్టఁగఁ బుట్టెఁ దోన బొం
కును గపటంబు లాలనయుఁ గుత్సితబుద్ధియు రిత్తభక్తియున్

ననువరిమాటలున్ బరధనంబును గ్రక్కున మెక్కఁజూచుటల్
కొనుటలు నమ్ముటల్ మఱియు గొంటుదనంబును మూర్ఖవాద్యమున్.
లేములవాడభీమన యిట్లుసెప్పఁగా వేఱొకకవి దానినిట్లు ప్రశంసించినాఁడు.

*ఉ॥ లేములవాడభీమ! భళిరే! కవిశేఖరసార్వభౌమ! నీ
వేమని యానతిచ్చితివి యిమ్ములఁ గోమటి పక్షపాతివై
కోమటి కొక్కటిచ్చి పదిగొన్నను దోసము లేద యంటివా
కోమటి కొక్కటీక పదిగొన్నను ధర్మమె ధర్మపద్ధతిన్''

కోమటి సొమ్ముఁదిని కృతినమ్ముకొని యాతని నెంతో పెద్దగాఁ బ్రకటించినకవినోరే యాకోమటి కొలము వారినిట్టు తిట్టునా? ఏమో? కృతిచెప్పించుకొని వెల్లడించుకొని తుదకుఁ గోమటి ద్రోహముచేయఁగాఁ దిట్టినాఁడేమో! ఏమో లెందులకు? ''ఘనుఁడన్ వేములవాఁడవంశజుఁడ'' నిత్యాదిచాటు పద్యములకుఁ బ్రసక్తుఁ డగు భీమకవి కవిజనాశ్రయకర్త కానేరఁ డనియే నాతలంపు. ఆతఁడు శివభక్తిపరాయణుఁడు. ఐతిహ్యములు, చాటుపద్యములు, నితరకవికృతస్తుతులు, నీవిషయమును రాద్ధాంతపఱుచుచున్నవి. పార్వతీపరమేశ్వరులే తమకుఁ దల్లితండ్రులనుట శైవులసంప్రదాయము. ''ధర నుమా మాతా పితా రుద్ర యనెడు । వగపురాణోక్తి నీశ్వరకులజుండ ... బసవనిపుత్త్రుండ బసవగోత్రుండ'' †పాల్కురికి సోమనాథుఁడు.

''ఇట్లే భీమకవియుఁ దాక్షారామభీమేశనందనుఁడ''నని చెప్పికొన్నాఁడు. ఇఁకఁ గవిజనాశ్రయకర్తగా గ్రంథమున నెఱుఁగఁబడు రేచన

*ఈ పద్యమున లేములవాడయనియె కలదు. తక్కిన భీమకవి చాటువు లన్నిటిలోఁగూడ లేములవాడ, యను పాఠమున్నది. ఇది ప్రయోగరత్నాకరమున నుదాహరింపఁబడినది.

†కం. వీ. కవులచరిత్రమున, ''దీనినిబట్టి సోమనాథుఁడు లింగార్యుని ఛాత్త్రుఁడయినట్టును బసవేశుని పుత్త్రుఁ డయినట్టును గనంబడుచున్నాఁడు'' అని యుండుట సరికాదు.

జైనుఁడు. శైవులకును జైనులకును బ్రచండవిద్వేషము. వీరికి వారికినాలు చాళ్లపెట్టు. మతమున విశ్వాసము, పట్టుదల, నెట్టుకొని యున్న యా కాలమున మాఱుమతమువానిపేరఁ గృతినివెల్లడించుటయేకాక యందుఁ, దనకు మిక్కిలివిద్వేషింపఁదగిన యామాఱుమతపుదేవరను బ్రశంసించుటయు 'భీమేశనందనుఁడ'నని చెప్పుకొను స్వమతాభిమానికి భీమకవివంటివానికి సంభవింపదు. కవిజనాశ్రయమున జినదేవతాప్రశంసయే కాక స్తోత్రముకూడ నున్నది. *శ్రీ జయంతిరామయ్యాపంతులుగారు దక్షిణదేశమునదొరకిన యొక్క ప్రతిలో మాత్ర మున్నవని యేడుపద్యము లవతారిక యనుపేర గవిజనాశ్రయమునఁ బ్రకటించినారు. ఇంచుమించుగ నుప్పదినలుపది కవిజనాశ్రయపుఁ దాళపత్రప్రతు లాంధ్రదేశమునను దక్షిణదేశమునను బరిశీలించితినిగాని యా పద్యములు నాకెందును గానరాలేదు. పంతులుగా రాపద్యములనుగూర్చి యిట్లు వ్రాసినారు. "ఈ యవతారిక యొక్క ప్రతిలోమాత్ర ముండుటచేఁ బ్రక్షిప్తమని తోఁపవచ్చును గాని, కవితావైఖరినిబట్టి చూచిన నది ప్రక్షిప్తము కాదనియే నా నమ్మకము" పంతులుగారి యీ నమ్మక మసమర్థమని నా నమ్మకము. అనంతునిఛ్ఛందమందలి మొదటిపద్యమే యీషద్భేదముతో నీయవతారికకు మొదటి పద్యముగా నున్నది.

క. శ్రీవల్లభు యతిగణసం, సేవితపాదారవిందుఁ జింతితఫలదున్
భావజగురు నలఘుచ్ఛం, దోవినుతు మురారి భక్తితో వినుతింతున్.

లేకపోయినను భీమేశనందనుఁ డగుభీమకవి యిట్లు 'మురారి' నిష్టదైవముగా స్తుతియించు నని నమ్మరాదు. కాన యిది యాతనిది కానేరదు. ఇంక

---

*కవిజనాశ్రయము శ్రీరామయ్యాపంతులుగారిచేఁ బ్రకటింపఁబడినది. అందు రెండవపద్యమున "పరహితచరితుండు నాంధ్రపదభక్తి మెయిన్" అనుపాఠ మున్నది. ఒకప్రతిలో 'జితేంద్ర' యని యున్నదనియు, నది కవిసమ్మత మైనచో 'జినేంద్ర' యని యుండవలె ననియు వారు వ్రాసిరి. అనేక తాళపత్రప్రతులలో 'జినేంద్ర' యన్నపాఠ మున్నది.

రెండవపద్యము: "క. శ్రీకరముగ రేచనపై
లోకంబున సుకవివరులు లోలతఁ బొగడన్
బ్రాకటముగ నీఛందము
లోకం బొ నసఁగఁ దెలుఁగులో నొనరింతున్.

ఇందుఁ బ్రాసమునకై 'శ్రీకరముగ' 'లోకంబున' 'ప్రాకటముగ' 'లోకంబొనసఁగఁ' నని నాల్గు పడిఱాల్లు పడినవి. యతికై 'లోలత' వచ్చినది. కవిజనాశ్రయమందలి శైలికి నీపద్యముల శైలికిని బోలికయే లేదు. ఈఛందము తెల్గులో నొనరింతునని రచింపఁబోవువాఁ డెట్లు చెప్పఁగూడును? రచింపఁబోవుదశలో 'నీఛంద' మనుటకుఁ బొసఁగుఁబా టెట్లు? కవిజనాశ్రయమును బఠించిన కవితాలుబ్ధుఁ డెవఁడో దాక్షిణాత్యుఁ డిటీవల నీ యవతారిక నైతిహ్యమును బట్టి కూర్చిన ట్టీపద్యమే చెప్పక చెప్పుచున్నది. ఇట్టికవితావైఖరినిబట్టి చూచి యట రామయ్యపంతులుగా రిది ప్రక్షిప్తముకాదని నమ్ముచున్నారు. 5, 6, 7, పద్యములుగూడ నస్వారస మగు కూర్పుతో నున్నవి. మఱియుఁ బంతులుగారు;

క. పరఁగిన విమలయశోభా,
సురచరితుఁడు భీమనాగ్రసుతుఁ డఖిలకళా
పరిణతుఁ డయ్యెను భూసుర
వరప్రసాదోది తర్ధువశ్రీయుతుఁ డై"

క. అసమానదానరవితన
యసమానోన్నతుఁడు వాచకాభరణుఁడు ప్రా
ణసమానమిత్రుఁ డీకృతి
కిసహాయుఁడు గా నుదాత్తకీర్తిప్రీతిన్.

అని గ్రంథమం దుండవలసినపద్యములను సాధుపాఠములుగల సముచితప్రతులతోడ్పాటు లేమిచేఁ గావలయు, "విమలయశోభాసురనిరతుఁడు"

"భూసురవరుఁడు ప్రసాదోదితధ్రువశ్రీయుతుఁడై" 'యాచకాభరణుఁడు' ననునపపాఠములతో గ్రహించి "ఈ పద్యము లనన్వయముగా నుండుటచేత నందుఁ జేర్కొనఁబడిన భీమునకును గ్రంథమునకును గల సంబంధ మిట్టిదని నిర్ణయింప వలను గాకున్న" దని పీఠికలో వ్రాసి ప్రక్షిప్తములట్లు గ్రంథమునఁ జేర్పక క్రిందఁ గూర్చినారు. పైపద్యము లనన్వితములుగావు గ్రంథమునఁ గూర్చుకొని చూచినచోఁ దేటపడఁగలదు. పాఠము తప్పుగా నున్నప్పుడు సమన్వయ మెట్లేర్పడును?

మఱియు, రామకృష్ణకవిగారు భీమకవిదేశము నైజాంరాష్ట్రమందలి లేములవాడయగునో యని నీతిశాస్త్రముక్తావళిపీఠికలోఁ దెలిపినతలఁపును రామయ్యపంతులుగారు కొన్ని యుపపత్తులతోఁ బొందించి బలపఱచినారు. వాస్తవము కావచ్చును. నైజాంరాష్ట్రమందలి లేములవాడలో వెలసిన యీశ్వరునకు రాజేశ్వరుఁ డని సుప్రసిద్ధనామ మయ్యెను. మనభీమకవి తఱచుగాఁ దనయిష్టదైవమును 'భీమేశ్వర' 'భీమలింగ' నామములతోనే పేర్కొన్నవాఁడయ్యెను. రాజేశ్వరునకుఁగూడ భీమేశ్వరుఁడని సుప్రతీతి కలదా? అక్కడ సుప్రసిద్ధమయిన రాజేశ్వరనామమును విడచి స్థలాంతరమున సుప్రసిద్ధమగు భీమేశ్వరనామమును పేర్కొనుట భీమకవి గోలకొండ రాష్ట్రవాస్తవ్యత్వమునకుఁ గొంత బాధకము. పద్యములలోనున్న లేములవాడ యన్నపేరు గోదావరీమండలమందలి వేములవాడకుఁ గుదురక పోవుట తత్రత్యత్వమునకు బాధకము. కవినిఁ గూర్చియుఁ గవికావ్యములను గూర్చియు నిద మిత్థ మనినిర్ధారణ మేర్పడనియప్పు డీస్థలమును గూర్చి యింతచర్చ యెందులకు?

మఱియు, రామయ్యపంతులుగారు 'ఘనుఁడన్ వేములవాడ' అన్నపద్యమున శ్రీరామమూర్తిగారుఁ గల్పించిన 'వెలుంగాధీశ' యన్నపాఠమునకు బదులుగా వీరేశలింగముపంతులుగారు 'తెలుంగాధీశ' యన్నపాఠమును 'జెప్పి' రనియుఁ 'దెలుంగ్వధీశ' యని కాని 'తెలుంగధీశ' యని కాని యుండవలయునే కాని 'తెలుంగాధీశ' యనుట వ్యాకరణదుష్ట మనియు నట్లు భీమకవి ప్రయోగింపఁ

డనియు గర్హించి 'కళింగాధీశ' యని చేర్చుకొని "కళింగాధీశ యనుపాఠ మీ ప్రతీతి కనుగుణము, సర్వవిధముల నిర్దుష్టము; ఇదియే కవిప్రయుక్తపాఠమై యుండవలయును" అని వ్రాసిరి. కాని యీపాఠము వీరి కెట్లువచ్చినదో చెప్పనొల్లకపోయినారు. కావుననే వీరేశలింగముపంతులుగారు "తెలుంగాధీశ యన్నపాఠము వ్యాకరణదుష్ట మగుటచే నది కళింగాధీశ యని యుండవలె నని యొక రనుచున్నారు" అని యది రామయ్యపంతులుగారు సంస్కరించినపాఠ మయిన ట్లభిప్రాయపడినారు. 'తెలుంగాధీశ' యనుట వ్యాకరణదుష్ట మనెడు వాదము గ్రాహ్యము కాదు. తద్భవ, దేశి, నామములకు డుప్రత్యయము పరమగుచో నకారాదేశము వచ్చును. రంగఁడు, లింగఁడు, మారఁడు, సూరఁడు, గురువఁడు, తిప్పడు, మొ. ఇట్లే తెలుఁగఁడు కూడను. తెలుఁగఁడే తెలఁగఁ డని కూడ మాఱును 'తెలుఁగుఁడు' అని యుండదు. 'తెలుఁగు' అన్నట్లుకూడఁ గానరాదు. సంస్కృతసమాసఘటిత మగునప్పు డా యుకారాంతరూపమే ప్రాతిపదిక మగును. కళింగగంగు, సాళ్వమంగు అనురూపము లున్నను గంగ్వధీశుఁడు, మంగ్వధీశుఁడు నని యుండదు. పంతులు గారు 'తెలుంగాధీశ' యనుట వ్యాకరణదుష్ట మనునప్పుడు, శ్రీనాథకవిసార్వభౌముని 'యక్షయ్యంబగు' పద్యమును మరచిపోయినారు. వీరేశలింగము పంతులుగారిపాఠము యుక్తమే. "సుచరిత్రాఢ్యుని వత్సవాయతెలుఁగుక్షోణీశచూడామణిన్" అని కం. వీ. గారు ప్రచురించిరి గాని యదికూడ "వత్సవాయతెలు (ల) గక్షోణీశచూడామణిన్" అనియే యగునని నానమ్మకము.

ఇఁక నా 'కళింగాధీశ' యన్నపాఠమును రామయ్యపంతులుగారు నా చాటుపద్యమణిమంజరినుండి గ్రహించియుండవచ్చును. ప్రాచ్యలిఖితపుస్తకశాలలోని యొకతాళపత్రప్రతిలోఁ జూచి దానిని చాటుపద్యమణిమంజరిలో 'తెలుంగాధీశ' యనుటకుఁ బాఠాంతరముగా ముద్రించితిని. లోకమువాకులందుఁ దెలుంగాధీశ యన్న పాఠమే పాదుకొనియుండుటనుబట్టియు శ్రీనాథునకుఁ గస్తూరికాభిక్షాదానము సల్పినతెలుంగురాయనిపేరే భీమకవికూడఁ గస్తూ-

రికాభిక్షమే యాచించినవానిపేరుగా నుండుటలో సందర్భవిశేష ముండఁ దగియుండుటనుబట్టియుఁ ద్రోసిపుచ్చుటకు సాహసింపక ప్రధానపాఠముగా దీనినే యుంచితిని. ఈ పాఠము పరిత్యాజ్య మనుటకు వ్యాకరణదుష్ట మనెడుకారణము తగనిది. ఇతరవిధములఁ 'గళింగాధీశ' యన్నపాఠము పరిగ్రాహ్యతరము కావచ్చును.

మఱియు వీరేశలింగముపంతులుగారు "సోమగురువాక్యములు పెట్టి భీమసుకవి, గరిమ బసవపురాణంబు గణనచేసె" నని పిడుపర్తిబసవన బసవపురాణపద్యమును గొని వ్యాఖ్యానచాతుర్యముచే 'గణనచేసె' ననుటకుఁ గర్ణాటీకరించుటగా నర్థముఁ గూర్చి, పాల్కురికిసోమనాథుని యాంధ్రబసవపురాణమునుబట్టి కర్ణాటభాషలో భీమకవిచే రచియింపఁబడిన బసవపురాణము నుదాహరించి యా యర్థమును స్పష్టపఱిచిరి. పిడుపర్తిబసవన బసవపురాణపుఁదాళపత్రప్రతులలో "గరిమబసవపురాణంబు కన్నడించె" నని యున్నది గావున వ్యాఖ్యానశ్రమ మక్కఱలేకయే యయ్యది కంఠోక్త మగుచున్నది. కాని యా భీమకవియే వేములవాడభీమకవి యని పంతులవారు పల్కుటకుఁ బ్రమాణమేమి! లేదు. వేములవాడభీమకవి చాటుపద్యములలోఁ గూడ దాక్షారామభీమేశ్వరుని స్మరించియున్నాఁడు. కర్ణాటకబసవపురాణకర్త యాతఁడే యగునాఁ డందలియెన్మిదాశ్వాసములలో నెక్కడనేని భీమేశ్వరుని స్మరింపకుండునా? తెలుఁగుఁగవీశ్వరులచే స్తుతింపఁబడుట కాతఁ డేనేని తెలుఁగుఁగబ్బములను గూర్చియే యుండవలెనుగదా! ఏవో యవి చేయఁబడవలసియే యున్నవి. ప్రయోగరత్నాకరమున వేములవాడభీమకవి నృసింహపురాణమందలివని కొన్నిపద్యము లుదాహరింపఁబడినవి. ఎంతనిజమో! వీరేశలింగముపంతులుగా రీతఁ డారాధ్యబ్రాహ్మణుఁడనిరి. కొలనిగోపరాజు నన్నయభట్టును భీమకవిని జేఱుగా స్తుతియించి, తిక్కనాదులను 'మత్కులచంద్రు' లని తర్వాతఁ జెప్పుకొన్నాఁడు. మీఁది చర్చవలన వేములవాడభీమకవి విషయము సర్వమును సందిగ్ధమే యగుచున్నది.

రామలింగయ్య, తెనాలి.—రామకృష్ణుఁడు వేఱు, రామలింగఁడు వేఱుగా మా. రా. కవిగారు వ్రాసినారు.* సత్యము కావచ్చును.†

*ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచిక.

† ఉ. గ్రాంథికసన్నుత ప్రతిభఁ గాంచి రసజ్ఞత మించి యాదిమ
గ్రంథము లుగ్గడించి ఫణిరాట్పరికల్పితశాస్త్రవీథికిన్
బంధువు లైనసత్కవులఁ బ్రార్థన చేసెద సుప్రబంధసం
బంధనుహాంగకావఖరభానుగ భీరవచోమచర్చికన్.

సీ. మహితమూలస్థానమల్లి కార్జునశిరస్స్థలచంద్రచంద్రికాధవళితంబు
చెవలునాటీపురశ్రీరఘూద్వహభుజాస్తంభరక్షణావిధాసంభృతంబు,
వేదంపసుఖితటాకోదితపద్మ సౌగంధికగంధపాణింధమంబు,
రాజబింబాననారాజిత గాంధర్వమాధురీసాధురతీధరంబు,
గీ. కరటికటనిర్గళద్ధ్వానవిరవధికస మగ్రనూతనవృష్టిజంబాలితాఖి
లావనీపాలమందిరప్రాంగణంబు గురుసమృద్ధులసైదోడు కొండవీడు.

మ. పరగన్ వారిధివేష్టితాఖిలమహీభాగంబునన్ రెడ్డిభూ
వరసింహాసన మై శుభాయతన మై వర్ధిల్లెఁ దత్పట్టణం
బురుబాహాబలసంపదం బెనుచుభద్రోద్యోగి నాదెండ్లగో
పరసాక్షేశుఁ డశేషబంధుకుముదప్రాలేయధామాకృతిన్.

గద్యము. ఇది శ్రీమదేలేశ్వరగురువరేణ్య చరణారవిందషట్చరణ సకలకళాభరణ రామనామాత్యసుపుత్ర సుకవిజనమిత్ర కుమారభారవిబిరుదాభిరామ రామలింగయ ప్రణీతం బైన యుద్భటారాధ్యచరిత్రంబునం. ... ... ...
మన్మిత్రులు చల్లా. సూర్యనారాయణరావుపంతులుగారు దీనిని బంపినారు. పాండురంగమాహాత్మ్యకర్తయు, నేతత్కృతికర్తయు నొక్కఁడే యని గాని వేఱుగాని నిర్ధారింపఁ దేలకున్నది. ఆతఁడు నీతఁడును రామయ పుత్రులే "శైవవైష్ణవపురాణావళీనానార్థరచనాపటిమైకరమ్యమతివి" కా

వల్లభరాయఁడు.—శ్రీ మా. రా. కవిగారు వల్లభరాయఁడు రచించిన ట్లున్న *క్రీడాభిరామ మను వీథినాటకమే శ్రీనాథునివీథినాటకము కావచ్చు ననిరి. శ్రీ కం.నీ.పంతులుగారది 'యతిసాహస' మనిరి. నానిశ్చయము తప్పక యది శ్రీనాథునికృతియే యగు నని; కారణసామగ్రి పుష్కలముగా నున్నది. ముద్రింపఁబడునా "శృంగారశ్రీనాథ" మనుగ్రంథమునఁనీచర్చ కలదు.

శేషనాథుఁడు.—ఈతనిపర్వతపురాణము ముద్రితము.

శ్రీనాథుఁడు.—వల్లభాభ్యుదయ మనుశ్రీనాథకృతి యొక్కటియున్నట్టిందలియొక్కపద్య మెఱింగించు చున్నది. వల్లభాభ్యుదయమునుగూర్చి శ్రీ మా. రా. కవిగారిట్లు వ్రాసినారు.* "వల్లభాభ్యుదయములోఁ గృష్ణాతీరమున నుండుశ్రీకాకుళస్వామితిరునాళ్లలో జరుగు నసభ్యములు దీనికంటెఁ బచ్చిగా నున్నవి. మఱియు నాంధ్రవల్లభుని తిరునాళ్లలోని విధవాదుర్వర్తనములు శ్రీనాథుఁడు విశదముగా వర్ణించియున్నాఁడు......శ్రీనాథుఁడు శ్రీకాకుళాధీశ్వరుఁ డగుతెలుఁగురాయని వర్ణించి యతని కంకితముగా వల్లభాభ్యుదయమును జెప్పెను గదా! అప్పుడు "అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ "అని శ్రీనాథుఁడు చెప్పెను" ఈ వ్రాఁత శ్రీకవిగారు వల్లభాభ్యుదయమును జక్కఁగాఁ జదివి యెఱింగినవా రనిచెప్పుచున్నది గదా! ఆ గ్రంథము శ్రీకాకుళాధీశ్వరుఁ డగుతెలుంగురాయని కంకిత మఁట! ఆతఁడే యఁట సాంపరాయని తెలుంగురాయఁడు! సాంపరాయని తెలుంగురాయఁడు

---

వున నాతఁడుకూడ నిశ్శైనకథ రచియించియుండఁ దగును. అక్కడరామకృష్ణుఁ డని యిక్కడ రామలింగఁ డని యున్నది. ఇక్కడఁ దెనాలి ప్రశంస కానరాలేదు. ఈయుద్భటారాధ్యచరిత్రముకూడ బయల్పడినఁగాని యథార్థము తేలదు ఇం దుదాహరింపఁబడినపద్యమందు నాదెండ్లగోపమంత్రి పేర్కొఁబడినాఁడు. ఈరామలింగనికిఁ గుమారభారతియని బిరుదు.

*క్రీడాభిరామపీఠిక చూడుఁడు.

కృష్ణాతీరమందలి శ్రీకాకుళము నేలినాఁ డనుట కట్టుకత. ఆధారము లేవియును లేవు. ఈ విషయమునఁ గల సందర్భములు పూర్ణముగా నా "శృంగార శ్రీనాథము"న వెల్లడింపఁబడినవి. ఇప్పటికి నలువదియేండ్లకుఁ బూర్వ మొకకవి శ్రీకాకుళక్షేత్రమాహాత్మ్యమును వల్లభాభ్యుదయ మనుపేరఁ దెల్గించినాఁడు, అది యున్నది. శ్రీనాథుని వల్లభాభ్యుదయమును గూర్చి యిందలి పద్య మొకటి తక్క మన కింక నేమియుఁ దెలియదు. శ్రీకవిగారు గ్రంథమును జదివినట్లు వ్రాయుచున్నారు. వారు దానిని వెల్లడింపవలసియున్నారు.*

హరిభట్టు.—ఈతఁడు బహుగ్రంథకర్తగా నున్నాఁడు. ఈతని మాత్స్యవారాహపురాణములు దొరకియున్నవి. ఉత్తరనృసింహపురాణము దొరకలేదు. విష్ణుభాగవతము నేకాదశద్వాదశస్కంధములుగూడ నీతఁడు తెలిఁగించినాఁడు. ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తకభాండాగారమున 'హరికభట్టు' రచించినట్టు పై రెండుస్కంధములు నున్నవి. హరిభట్టనుటకు హరికభట్టనుట వ్రాఁతగాని దోషమే.

నీతిసారము పంచతంత్రి †కామందకము మొదలగు కొన్ని గ్రంథ

---

*మా. రా. కవిగారు, క్రీడాభిరామపుఁబీఠికలోనే యిట్లు వ్రాసినారు. "చంద్రశేఖరుఁ డనునియోగిపుంగవుఁడు నరసింగరాయలమంత్రి యని సాళ్వాభ్యుదయమున నున్నది. కావున "చంద్రశేఖరుక్రియాశక్తి రాయలయొద్దఁ బాదుకొల్పితి సార్వభౌమబిరుదు" అనునది స్పష్టముగా నర్థమగుచున్నది." సాళ్వాభ్యుదయము ప్రాచ్యలిఖితపుస్తకశాలలో నున్నది. అందెక్కడను నరసింగరాయలకుఁ జంద్రశేఖరుఁ డనునియోగిపుంగవుఁడు మంత్రిగా నున్నట్టు కానరాదు. వారు మఱెక్కడి ప్రతిలో నట్టు చూచినారో! ఆచరణమున కట్టి యర్థము లేదు. శృంగార శ్రీనాథమందలి "కనకాభిషేకము" చూ.

†తంజావూరు పుస్తకశాలలో వేంకటరాజప్రణీత మగు కామందకము పద్యకావ్య మున్నది. అది యిది కానట్టున్నది.

సులకుం గర్త లెవరో యెఱుఁగ రాదు. మఱికొన్నిపద్యము లేగ్రంథము లందలివో కూడ నెఱుఁగరాక యున్నవి. ఇందుఁ బేర్కొనఁబడిన కవీశ్వరులు పెక్కురు ప్రాయికముగా కం. వీ. కవులచరిత్రము ప్రథమభాగమునఁ జేరఁ దగినవా రగుదురు. ఇంతవఱకు నాంధ్రభాషలోఁ గవిజనాశ్రయముతక్క జైనప్రసక్త మగుకబ్బము కానరాలేదు. ద్రవిడకర్ణాటభాషలలో జైనకృతులు పెక్కులున్నవి. ఇందు జినేంద్రపురాణ మనియు నాదిపురాణ మనియు రెండు జైనప్రబంధము లుదాహరింపఁబడినవి. కాని వానియందలిపద్యము లెక్కువ గాఁ జేకొనఁబడవయ్యెను. ఉన్నపద్యములం జూడఁగాఁ బ్రాచీన తర రచనముగాఁ దోఁపకున్నది.

సంస్కృత వాఙ్మయమున శార్ఙ్గధరుని పద్ధతి, జల్హణుని సూక్తిముక్తావళి, వల్లభదేవుని సుభాషితావళి మొదలగు సంధానగ్రంథములమూలమున నిప్పు డనుపలభ్యమానము లగు కావ్యములయుఁ గవులయు వృత్తాంతము లెన్నో గుర్తింపఁబడుచున్నవి. అట్లే యీసంధానములుగూడ నెందఱనో యపూర్వకవులను, నెన్నింటినో యపూర్వకావ్యములను బయల్పఱిచినవి. ఇందుఁ గొన్ని యేని మనభావిపరిశీలనమూలమున బయల్పడఁగల వని విశ్వసింతము. మఱియు నెఱ్ఱాప్రెగ్గడరామాయణము మొదలగు ప్రాచీనప్రబంధము లిందుఁగూడ ననుదాహృతములు పెక్కులు మనకు దొరకవలసియున్నవి. పేరుకూడలేకుండఁ గాలప్రవాహమింక నెన్ని మంచికావ్యములను ముంచివైచినదో కదా!

ఈ సంధాతలు ప్రాచీనులే యగుటచే వారి కాయా కవీశ్వరులకావ్యములు దొరకియేయుండు ననియు వారు వానిని బఠించియే పద్యములను సంగ్రహించి రనియు విశ్వసింపఁగూడును. అయినను బ్రతివిలేఖకాదులమూలమున నిప్పుడు దొరకిన ప్రతులందుఁ గొన్నికావ్యములపేళ్లును గవులపేళ్లును దార్మారయియుండవచ్చును. కొన్నిపద్యముల విషయమున నీ రెండుసంధానములకును ద్వైవిధ్య మేర్పడెను. ఈపద్య మీకావ్యమందలి దగును గాదని నిర్ధారింప నా

కావ్యములు దొరకినంగాని కుదురదుగదా! ఈసంధానములకుఁ బ్రత్యంతరము లేని లభింపవయ్యె.

ఈ గ్రంథము చెన్నపురిలో ముద్రింపఁబడుచుండుటయు నే నక్కడ నుండరాక యవిరతప్రయాణములతో దేశాటనము సల్పవలసియుండుటయు సంఘటిల్లుటచే నచ్చుపని చూడ నేకాక పీఠికవ్రాయను వలసిన గ్రంథపరికరము పరికింపను గూడఁ గుదురుపడయ్యెను. అయినను నా రెండుప్రాచీన సంధానములను జతకూర్చుట మొదలుగా నిట్లు ముద్రితమై వెల్వడుదాఁకఁ జెన్నపురిలో మన్మిత్రులు బ్రహ్మశ్రీ గన్నవరపు-సుబ్బరామయ్యగారు సల్పినతోడ్పాటు, పరిశ్రమము, మిక్కిలి పెక్కువ. వారితోడ్పాటు లేనిచో నే నిప్పు డీగ్రంథ మిట్లు ముద్రింపఁజాలను. మాముద్రణావసరమునఁగూడఁ గొన్ని పొరఁబాట్లు పొసఁగియుండవచ్చును. సందిగ్ధము లగుపద్యభాగము లట్లే నిల్పితిమి. ప్రయత్నపూర్వక మగు విపర్యయ మిందేదియు నుండదు. ప్రమాదములు సరిపఱచుకొనఁ బ్రాజ్ఞులకు నమస్కారము.

వేటూరి-ప్రభాకరశాస్త్రి.

9—1—18.

శ్రీరస్తు.

# ప్రబంధరత్నావళి.

## అథర్వణాచార్యులు—(భారతము.)

తృష్ణాతంతునిబద్ధబుద్ధు లగురాధేయాదులం గూడి శ్రీ
కృష్ణుం గేవలమర్త్యుఁగాఁ దలఁచి మర్దింపంగ నుత్సాహవ
ర్ధిష్ణుం డయ్యె సుయోధనుం డకట ధాత్రీనాథ! యూహింపుమా
యుష్ణీషంబుగఁ గట్టవచ్చునె మదవ్యాఘ్రోగ్ర శుండాలముల్. 1

మ. నతనానావనినాథయూథమకుటన్యస్తాబ్జరాగోజ్జ్వల
ద్యుతివిభ్రాజితపాదపీఠు లలనాదోశ్చామరోద్ధూతమా
రుతలోలాళివినీలకుంతలుఁ బ్రభారుద్ధాముఁ గేయూరశో
భితబాహాపరిఘుల్ సువర్ణధరణీభృద్ధైర్యు దుర్యోధనుల్. 2

మ. ప్రణతాశేషవసుంధరాధిపశిరస్స్రగ్గంధలుబ్ధభ్రమ
*త్క్వాణదభ్రభ్రమకృద్ద్విరేఫగణ ఝుంకారప్రదాబద్ధసం
[?] ప్రణవత్యుత్ప్రథితప్రవర్ధితసమస్తక్షత్రసూయాధ్వర
క్షణసింహాసనభాసితుల్ దృఢధనుశ్శ్లాఘానుజుల్ ధర్మజుల్. 3

సీ. రాజమండలపూర్ణరాజమండలవీథి
రత్నగర్భామలరత్నగర్భ,
గంధర్వగంధర్వగంధర్వనగరంబు
నాగపున్నాగపున్నాగవనము,

---

* 2, 3 చరణముల యర్థము కుదురలేదు. మేము మార్పలేదు.

మార్గణమార్గణమార్గణపీత ము
త్తుంగభుజంగభుజంగభూమి,
కాంతకాంతారాతి కాంతకుంతస్థలి
వీరకుమారకుమారసరసి,
గీ. యనఁ బొగడ్త కెక్కునలకాపురంబు దే
వేంద్రపురము దానవేంద్రపురముఁ
గ్రేణిసేయు లలితశోణాంశుమణిబద్ధ
గోపురంబు హస్తినాపురంబు. 4

## అన్నమరాజు—కానుకొలను. (అమరుకము.)

చ. చులుకనఁ జాపముం దిగుచుచోఁ గటకాముఖపాణిమీఁదఁ బె
ల్లొలయు నఖాంశులం గదిసి యొప్పెడు కెంజిగురాకుగుత్తిచే
నలవడి కర్ణపూరమున నంటిన తుమ్మెదపోనిపార్వతీ
లలన కటాక్షదృష్టి మనలం జరితార్థులఁ జేయుఁ గావుతన్. 5
సీ. తివిరి రాశికి నెక్కి తిరుగు చక్రంబులు
మెట్టుఁ బదిల మై మెఱయు తేరు,
బహుముఖంబుల నేర్పు పచరించుసారథి
వ్రాసి చూపఁగరానివారువములు,
గట్టి యై పేఁక నక్కుఱఁ దీర్చువిలుగమ్మి
శ్రుతిహితంబుగ మ్రోఁత చూపునారి,
విజయానుకూల మై విలసిల్లుబాణంబు
సరిలేనికోటులసంఖ్యబలము,
గీ. దనకు నబ్బుటయునుఁ బురత్రయము గెలిచి
పృథులవిఖ్యాతిఁ గైకొన్నరథికవరుఁడు
జయముఁ దేజంబు భూతియుఁ బ్రియ మెలర్ప
మనలఁ గరుణావిధేయుఁ డై మనుచుఁ గాత. 6

## అన్నమయ్య — తాళ్లపాక. (తిరువేంకటేశ్వర శతకము.)

చ. అరిసెలు నూనెబూరెలును నౌఁగులుఁ జక్కెరమండెఁగల్ వడల్
బురుడలు వాలమండెఁగ లపూపము లయ్యలమేలుమంగ నీ
కరుదుగ విందువెట్టెఁ బరమాన్నశతంబుల సూపకోట్లతో
నిరతవినిర్మలాన్నముల నేతులసోనల వేంకటేశ్వరా! 7

## అప్పన్న — (చారుచర్య.)

సీ. కఠిన మై దొడ్డచిక్కణము నై వత్సరా
ర్థ ప్రమాణము ప్రాఁతఁదనము గలిగి
యుజ్జ్వలచ్ఛాయ మై యొత్తినతరవాయి
శశమాంసఖండంబుచంద మగుచు
నొగరించుకయు లేక మిగులంగఁ దీపైన
క్రముకంబు; నొఱ్ఱనై కమ్మవలచి
దళ మెక్కి పండినతాంబూలదళములు;
కాలోపలంబులు గాల్చి వడియ
గీ. నూని కట్టిచ్చి చూర్ణంబుగా నొనర్చి
భుక్తి గొనకముందట నాల్గు భోజనోత్త
రమున రెండును నటుమీఁద రాత్రి యాఱు
మార్లు తమ్ముల మొప్పారు మంత్రియప్ప! 8
సీ. లఘుకారి క్రిమిదోషవిఘటనసంధాయి
దీపననిర్దోషదీప్తికరము,
పాషాణచూర్ణంబు; పైత్యవాతఘ్నంబు
శంఖచూర్ణము పైత్యశైత్యాపహము;
చిప్పలసున్నంబు శ్లేష్మంబు నడఁగించు
గుల్లసున్నము వాతగుణముఁ జెఱచు,

తనివిచ్చుఁ జాల ముత్యంపుఁజూర్ణము చూర్ణ
పర్ణ మాయువునకు బాధకంబు,
గీ. పత్త్రమూలంబునను రోగ పటల ముండు
నగ్ర మది పాపముల కెల్ల నాలయంబు
నడిమియీనియ బుద్ధివినాశకరము
వీని వర్జించి తగఁ జేయు వీడియంబు. 9
చ. వదనవికాససౌరభవివర్ధనకారి లసన్ముదావహం
బుదరవిశేషసౌఖ్యకర ముద్గతదోషబలప్రహారి స
మ్మదజనకంబు తమ్ములము మానవతీపరిభోగవేళలన్
మదనపునర్భవీకరణమంత్రము తుల్యమె దీని కెద్దియున్. 10

## అమరేశ్వరుఁడు—చిమ్మపూఁడి. (విక్రమసేనము.)

మ. అదె కైలాసము దృగ్విలాసము విహాయశ్చారిణీసమ్మద
ప్రదవిన్యాస ముదగ్రభాసము మరుద్భామాసదాధ్యాస మ
భ్యుదయన్యాస మసన్నిరాసము మయూరోదారనిధ్వానబి
భ్యదహివ్రాతకృతప్రవాసము త్రినేత్రావాస ముర్వీశ్వరా! 11
సీ. అరుణపుష్పావలి యగ్నిగా సంధించి
యళులనుల్కలుగాఁగ నావహించి,
దండడి వీతెంచుదక్షిణపవనంబు
భస్త్రానిలంబుగాఁ బగఘవించి,
చిలుకలు పికములు చేదోడు సేయంగ
మాధవుం డనుకనుమరి గడంగి,
యంగజుం డనుపతియానతిఁ బనిపూని
మొగడ లన్ములుకుల మొనలు చఱచు
గీ. కొలిమియొక్కొ యనఁగఁ గురియు పరాగంబు
విస్ఫులింగములుగ విరహు లులుక

నేచి పూచియున్న యీయశోకమహీరు
హంబుఁ గంటి మాళవాధినాథ! 12

చ. అలకలు తేఁటిదాఁటులును, హస్తతలంబులు పల్లవంబులుం,
బలుకులు గీరపోతములభాషలు, మేనులు బువ్వుఁదీగెలున్,
లలిఁ దమలోఁ దడంబడ విలాసవతుల్ మదనాధిరాజ్యల
క్ష్ములగతి నెల్లచో విరులు గోయుట చె న్నెసలారెఁ దోఁటలన్. 13

చ. అలరులపాన్పులం దలిరుటాకులసెజ్జల హర్మ్యవేదికా
తలములఁ దీవయిండ్ల సికతాశయనంబుల ము న్వియుక్తి మై
నలఁదురి వందుకందువుల నప్పటి కప్పటి కింపుఁ బెంపఁ గో
ర్కులు తనివారి వేడ్కపడఁ గూడిరి వేడుకతోడ దంపతుల్. 14

గీ. అలికలితపంకజము నొక్కయతివ దెచ్చి
చుట్ట మగునట్టి వనితకుఁ జూపుటయును
తనకురులు మోము నెదుట నద్దంబులేక
తోఁచె ననుచు నమ్ముగ్ధ యద్భుతముఁ బొందె. 15

చ. ఇఱియుకుచంబులం దొకటి యించుక వీడ్వడ నొక్కకేల లేఁ
బోఁడఁ గబళించి నిక్కుచును బూవున కెత్తినచేతిచంకఁ గ్రొ
మ్మెఱుఁగులు హస్తముం గడచి మీఁదికిఁ బ్రాఁకఁగ మున్న గన్నయా
గుఱుతులు డాసి కోసెఁ దుదిఁ గొమ్మల పూవులు కొమ్మ నెమ్మితోన్.

గీ. ఇత్తి పాపయి ల్కొందేలు మత్తి యనుచు
జనులు కనుకని పలికెడుచందమామ
నడిమిమచ్చకు నెఱిఁగి పే రిడఁగ నేర్తు
రప్పురమున మేడలపయి నాడుసతులు. 17

సీ. ఏపునఁ జెలరేఁగి యేయుమనోజన్ము
చెఱకువిల్ రెండుగా విఱిచినైతుఁ,
బలువ లై పలుకుచిల్కలనాలుకల ముల్లు
విఱిచి యీరములలో నెడల నడఁతు,

మదమున మ్రోయుచు మ్మైదలఁ జంపకలతాం
తములలో మునుఁగంగ నిమురింతుఁ [?],
దగులమై వీతెంచుదక్షిణాశాగంధ
వహుఁ మహేంద్రు నివాతఁ ద్రోతు,
గీ. నేటి కులికెదు నాయట్టిబోటి కలుగ
వెలఁది! నీమదిలోపల వెఱవ కుండు
మమ్మ! ధైర్యంబు వదలకు మమ్మ! యెందుఁ
గత్తలము గల్గుమేనికిఁ గలదె బాధ? 18
చ. కటి వడఁకాడ నీల్గ నసికౌను కరంబున నక్కలించి పి
న్నటతరళంబుతోడ నయనద్యుతి భ్రూలతలం దెలర్ప నుం
గుటములు మోపి నిక్కుచును గ్రొవ్విరిచన్నులచాయ మోముచ
క్కటి కెసఁగంగఁ జొచ్చె నొకకామిని తోయజషండ మిమ్ములన్. 19
గీ. కమలినీకాంత యెంతయుఁ గంది వంద
వారుణీసక్తుఁ డై వసువ్యయము చేసి
యరిగినట్లు సరాగి యై యంబరంబుఁ
దొఱఁగి పశ్చిమజలధిలో నుఱికెఁ దరణి. 20
సీ. కలయంగ నలఁదినకస్తూరి పెల్లున
జలముల నెల్లను గలఁగఁజేసి,
కుచమండలంబులకుంకుమచర్చల
నీరెల్ల జేవురునీరుచేసి,
తనులిప్తసురభిచందన కర్దమంబున
వారినెల్లఁ బులకవండు [?] సేసి,
మూలల నవపుష్పమాలికావితతుల
వన మెల్లఁ దెట్టువ గొనఁగఁ జేసి,
గీ. యలక లలికవీథి నంటఁ గన్నవలఁ గెం
పెలయఁ గామచిహ్న లెల్లఁ బెలయ

నలరువాతు లనుర జలకేలి సాలించి
కొలనువెడలి రింతు లలసగతుల. 21

మ. కులశైలంబులలోఁ సువర్ణగిరి దిక్కుంభీంద్రవర్గంబులో
బలభిన్నాగము లోకపాలకులలోఁ బర్జన్యుఁ డుగ్రోరగం
బులలోఁ శేషుఁడు పెంపుఁ గన్నకరణిం బూజ్యాధిపశ్రేణిలోఁ
వెలసెన్ విక్రమసేనభూవిభుఁడు దోర్వీర్యప్రతాపంబునన్. 22

సీ. కేలిదెప్పము సేసి గ్రాలి లీలావతి
నీఁదించుచును నొక్కయింతి డాసి,
చే యిచ్చి యిందు విచ్చేయు మంచును దన్వి
నడిపించుచును నొక్కపడఁతి నూఁది,
ముదితచేకూడను ముత్తలాడుచు నొక్క
తరుణికి నిమ్ములఁ దమ్మ యొసఁగి,
రమణిపాపటఁ బుష్పరజముఁ బోయుచు నిదె
మిగిలెఁ గొమ్మని యొక్కమగువ కిచ్చి,

గీ. కదలఁ బడినట్టు లొక్కతెఁ గౌఁగిలించి
ముంపు మునిఁగిన ట్లొక్కతె మోవి యాని
లలితనాయకకేళీవిలాస మమర
లీల జలకేలి సలిపె భూపాలసుతుఁడు. 23

చ. కొలఁదికి మీఱఁ బెద్ద యగుకోటతనర్పుస వస్తుసంతతో
జ్జ్వలతరసత్ప్రభాతరవిచంద్రరుచుల్ సొరనేర కున్న సం
ధ్యలు దివసత్రియామములు దత్పురిపౌరజనం బెఱుంగుఁ ద
మ్ములముచవిన్ విహంగగతిఁ బూవులతావి రతిప్రసంగతిన్. 24

గీ. క్రాలుఁగన్నులు ముద్దుమొగములు దమకు
నసదృశప్రభావమునఁ జెల్వగుటఁ జేసి
మునిఁగి మీలను దలలెత్తి వనరుహములఁ
దూలపఱచిరి వనకేళివేళ సతులు. 25

చ. గొనయము తమ్మినూల్ చెఱకుఁగోల ధనుర్లత పూవు లమ్ము లే
టును నొకమాటు లా నతనుఁడుఙ మును నగ్రు జయించి జీవరా
శి నొడుచు టేమి చెప్ప నని చేయునుతుల్ తగు మోహనప్రవ
ర్తన గలకాముఁ డీవుత ముదంబున మీ కిలఁ గామసౌఖ్యముల్. 26

చ. చనవున రెండు వక్త్రములు చన్నులపా ల్గుడువంగ నొక్కమో
ము నగఁగ నొక్కయాననము ముద్దు నటింపఁగ నొక్కయాస్యము
న్గనఁగ నిదేమి పల్కు దని యాలపనంబునఁ బెక్కులించు[?] ను
బ్బున నగుషణ్ముఖుం డెలమిఁ బొంది త్రిశక్తులు మాకు నీవుతఙ. 27

సీ. చూపులకట్టు[?] పూఁదూపులఁ జేపట్టు
నబలలచూడ్కుల యాయుధములు,
తాయంబునకు గండుఁగోయిలఁ గూయించు
బాలలపలుకుల మూలమంత్ర,
మెదిరికిఁ దేఁటుల నెపయాట లాడించు
నబలలయలకల యాప్తబలము,
నవరణమం జంద్రుఁ జాలించుమగువల
మొగముల సేనకుఁ దగినమొగము

గీ. భావభవునకు; నటుగాక బలమె బలము
గాఁగఁ దరిగానె వీనిచేఁ గాసిఁబడఁడె?
యనఁగ సౌందర్యసంపద లభినవముగ
వఱలుదురు వత్పురంబున వారసతులు. 28

క. తరుణవయస్కుల యౌవన
పరిపాకుల వృద్ధజనుల భటులను నిజసో
దరులను గురులనుగాఁ జూ
తురు పురము పతివ్రతాసతులు పుణ్యవతుల్. 29

క. తరుణుం డగుశీతలకరు
మరగి వియల్లక్ష్మి తన్ను మాని మురుకఁడుఙ

ఖరకరుఁడును నని ద్రొబ్బిన
కరణిఁ రవి పశ్చిమాద్రికడఁ గ్రుంకె నృపా! 30

క. తరులు వడి యుత్తరాయణదక్షిణాయ
నముల రవితేర విడిసినసరవ లట్లు
మెఱయుఁ గనుఁగొనఁ గొమ్మలు మింటి కిడిన
కుదురువిధమునఁ దనరారుకోటమీఁద. 31

సీ. దక్షిణపవనంబు తనుగంధమున నూని
మలయాచలముమీఁదిమరులు మానఁ,
దివిచి పట్టినలేఁతచివుళులచాయకుఁ
గరతలంబులకాంతి వరము లొసఁగఁ,
గుసుమముల్ గోయుచో గోళ్లమెఱుంగులు
తనిమొగ్గలకు గవుసెనియ లొసఁగఁ,
బలువగఁ జెలఁగెడుపలుకులు రాజకీ
రములకు నొజ్జతనములు సేయఁ,
గీ. గురులు నలులపిండు బెరయఁగ వనమయూ
రములగతులు వేఁడ గమనలీల
నసఁగి పెనఁగి ప్రీతి వనకేలి సలిపిరి
వనజముఖులు వేడ్కఁ బనుపు సేయ. 32

సీ. దళమైనచీఁకటి గుళియలు సేసి ప
ద్మాసనుం డాయువు పోసె ననఁగఁ,
దొలుకారుమెఱుఁగులు కొలఁదికి నఱకి వి
రించి వాల్గనుల నూరించె ననఁగఁ,
చంద్రికాసార మబ్జజుఁడు గట్టిగఁ బద
నిడి యాణిపాణియుఁ బడసె [!] ననఁగఁ,
బాటించి విధి రాగపరమాణువునఁ బల్ల
వితమూర్తి గాఁగ నిర్మించె ననఁగఁ,

గీ. బాలుచమనలులను మదనునమ్ములను ముత్తి
యముల విద్రుమవల్లిక నపహసించుఁ
దరుణి యలకలుఁ జూడ్కులు దశనములును
నధరమును బ్రస్తుతింప నాయలవి యెట్లు? 33

శా. దానానేకపబృంహితస్వనము గంధర్వావలీహేషిత
ధ్వానంబుల్ మృదువేదనాదమును గాంతానూపురారావముల్
గానానూనరవంబుఁ దూర్యబహుశంఖస్ఫారరావంబుఁ బె
ల్లై నీరాకరఘోషమో యనఁగ నిత్యంబుం జెలంగుం బురిన్. 34

సీ. ధర వియోగులనెల్లఁ బరిమార్పఁ బూని హృ
ద్భవుఁడు గట్టినవీరపట్ట మనఁగ,
విరహులపై దండు వెడలుచో మనసున
కెత్తినకెంజివురెల్లి యనఁగఁ,
దోయధి వెడఁ గ్రుంకఁ దోఁచుపురందర
కుంభిసిందూరితకుంభ మనఁగఁ,
కులిశాయుధునిపెద్దకొలువునఁ జెన్నొంద
దీపించుమాణిక్యదీప మనఁగఁ,

గీ. కుముదినీరాగరససిద్ధఘుటిక యనఁగఁ
గామునినిరంజనౌషధికబళ మనఁగఁ
బొడుపుఁగెంపున బింబంబు పొలుపు మిగులఁ
జంద్రుఁ డుదయించెఁ గాంతినిస్తంద్రుఁ డగుచు. 35

సీ. ధమ్మిల్లభారముల్ కమ్మపూవులతోడఁ
బొదిగొని వెన్నెలఁ బొలసి ప్రేల,
నలికతలంబులఁ బొలుచుకుంతలములు
ఘర్మజలంబులఁ గలసి యంటఁ,
గహ్లారదళములకాంతి మిన్నక కొన్న
చెన్నునఁ గనుఁగవ జేగురింప,

సోలెడువల్లులఁ బోలెడుమేనులఁ
బయ్యెఁట గాలిచేఁ బ్రస్ఫురింప,
గీ. ఘనపయోధరములఁ గాశ్మీరచర్చలు
గలఁగ నలసగతులు చెలువ మొందఁ
బువ్వుఁబోఁడు లంతఁ బుష్పాపచయకేలి
సోలి వచ్చి రాన్నృపాలుకడకు. 36

సీ. ధరణీశ! లవణాబ్ధిపరివేష్టితక్షితి
వలిలిన నేరెడుగలితికోలఁది
నొక్కొక్కదిక్కున కొక్కొక్కలక్షయో
జనములు ధన్యధ్యమున సువర్ణ
సార మైయున్నది చతురుత్తరాశీతి
సాహస్రయోజనసంఖ్య మొదలి
వలము పదాఱువే ల్గలిగి వెడల్పు ము
ప్పదిరెండువేలుగాఁ బాఁతు లోఁతు
గీ. మొదలివలమునయంత యై తుదిఁ బదాఱు
నేసివేలుగా మేరువ౯ శిఖరి యొప్పు
దానిపై బ్రహ్మపురి చతుర్దశసహస్ర
యోజనస్థితిఁ గనుఁగొనఁ దేజరిల్లు. 37

చ. నలువగురక్తి మించినమనంబున నుబ్బును లావు వుట్టి చెం
గలువవికాసవేళ మురుకంబు[?] నటింపఁగఁ బువ్వుఁబోఁడి మొ
క్కలమునఁ జేర్చి సాధనధికారముఁ గైకొని కేలి సల్పె న
చ్చలమున సిగ్గు చాలమిఁయుఁ జన్గవహారము లోలిఁ జెప్పఁగ౯. 38

గీ. నీర నగ్ని యునికి యారయ విస్మయం
బనుచు బాడబాగ్ని కదలి యప్పు
రంబుఁ జొచ్చెనొక్క రత్నాకరముఁ వణు
లనఁగఁ జెలువ కుమరు నాపఁ॰ములు. 39

గీ. నూఱుక్రతువులు సేయని పాఱు టిల్లు
కోటిపడగలు లేని కిరాటగృహము
జాతిరత్నంబు గానిపాషాణకులము
వెదకి చూపిన వీటఁ బన్నిదము గలదు. 40

సీ. నెఱవుగా విరియక నెగడునెత్తావి తు
మ్మెదలచే మునుమును మీఁదు వోక,
యకరువు నెఱయక మకరంద మొలుకక
నెఱిదప్ప నొరగక కఱకు లేక,
బింకంబు లొక్కింత ప్రిదులక జిగిసొంపు
చెదరక రేకులు చిక్కువడక,
పొరటతో రాయక పొలుపుసొం పెడలక
సుడియుక్రీగాలిచే సూఁగిలక,
కరము శోభిల్లురుచిరమంజరులు గోసి
వనిత యొక్కర్తు తనదులావణ్యరసము
నెలమి నుద్యాన మొక క్రొత్తచెలువు దాల్ప
లతలలో నాడు జంగమ లతికవోలె. 41

మ. పరపైఁ దొప్పెసలారుమానికపుసోపానంబులం బ్రజ్వల
ద్వరవజ్రోపలసైకతంబులను సౌవర్ణారవిందంబులన్
హరినీలాసితవారిజంబులను జక్రాంగాదివాఃపక్షివి
స్ఫురణం గల్గుసరోవరంబుఁ గనియెన్ భూవల్లభుం డయ్యెడన్. 42

చ. పరముఁడు కంధరస్థలముపై నిడి వేడుక ముద్దు లాడఁగాఁ
గరమున మౌళిగంగయుదకంబులు మెల్పునఁ బీల్చి యూఁది శీ
కరములు భూషణేందునకు కారవ [?] తారకలీలఁ జేయుత
త్కరివదనుండు మత్కృతికిఁ దా సుముఖస్థితితోడఁ దోడగున్. 43

సీ. పరిణత ఫణిలతాపత్రంబుఁ గదిసిన
చివురునాఁ జెక్కునఁ జేయి చేర్చి,

కందర్పమదకరికరముపై జక్కవ
లెఱఁగెనాఁ దొడఁగుచ మిఱియ మోపి,
దవనంబుపొరకలఁ గవిసినమంచునాఁ
బలుచనిచెమట మైఁ గలసి మెఱయఁ,
గలువరేకులు మౌక్తికముల నీనెడి ననాఁ
గన్నుల బాష్పంపుఁగణము లురలఁ,
గీ. వేఁడి నిట్టూర్పుగాడ్పులు విరహవహ్ని
శిఖలు ప్రబలంగ వలవంతచింత నొగిలి
యేకతం బున్నదాని రాజేంద్రతనయఁ
గనిరి లతికాగృహంబులో వనజముఖులు. 44
చ. పలుచని చంద్రికారసము ప్రన్ననినున్ననితేటక్రొమ్మెఱుం
గులతుదల న్వెదిర్చునెలకొమ్ములకాంతి పసిండినిగ్గుతోఁ
గలిపి యలంతి వన్నె యిడి కాయజునిల్పిన రత్నపుత్రిక
న్నలువ సజీవిఁ జేసె నొకొ నాఁ దగు నాతివిభాతి చూడ్కికిన్. 45
సీ. పాంథులహృదయముల్ పల్లటంబులు సేయ
దర్పకుపనిచినదం డనంగ,
విరహిమృగంబుల మఱేఁగింపఁ దివిరెడు
కాయసంభవునిమొక్కల మనంగఁ,
గడు నల్గి చైత్రునాగారంబు ముద్రింప
మనసిజుపనిచినయనుఁగు లనఁగ,
సహచరుం డగుగంధవహుఁ గానఁగా మీన
కేతనుపంచినదూత లనఁగ,
నభినవాకారసౌందర్యసుభగలీల
లతిశయంబుగ మెలఁగుచు నసమబాణు
పుష్పలావికాజనములపోలె నెఱసి
కోమలాంగులు పువ్వులు గోసి రెలమి. 46

ఉ. పూవులప్రోవు లై చిలుకబోదలు కోయిలపిండు సంపద లై
తావులక్రోవు లై యళివితానము గానము తానకంబు నై
కావను బంపఁజాలుటఁ ద్రికాలముఁ గల్గ వరంబుఁ గన్నయ
ట్లై వనరాజి పొల్పగుఁ బురాంతికభూముల నెల్లఁ జూడఁగన్. 47

చ. పొడవుగ నెల్లయంగళులఁ బ్రోవులు వోసిననూత్నరత్నముల్
కడఁక ననేకవేషములు గైకొని వచ్చినయర్థికోటికిన్
బిడికెఁడు లాదిగాఁగ బలి వెట్టుచు రప్పురివైశ్యభామిను
ల్కడపక హస్తకంకణఝుళద్ధ్వను లొప్పఁగ నెల్లయప్పుడున్. 48

సీ. ప్రత్యగ్రరచనాతి భాసురప్రాసాద
నిర్జిత్వ గోత్రావనీధరంబు,
ప్రాకారశిఖరాగ్రబంధురమణిగణ
ద్విగుణితతారకావిభ్రమంబు,
పరిఖాజలాంతరప్రతిబింబితద్రుమ
స్మారితపాతాళభూరుహంబు,
వరపుష్పసౌరభావర్జితమధుపహూ
స్వీకృతాశావారణేంద్రగండ,
గీ. మప్సరస్స్పృహణీయలీలాతిశయవి
లాసినీజననేత్రవిలాసజనిత
కుసుమశరబాణవైఫల్య మసదృశార్థ
నిర్జితాలక ముజ్జయినీపురంబు. 49

సీ. ప్రాణంబు లెడల నభ్యాసంబు సేయుమా
ర్గం బన నిట్టూర్పు గాడ్పు లెసఁగ,
గవ్యశాలగ నేయి గ్రమ్మువడిఁ గాను
శిఖిఁ గ్రాఁగి మైదీగె చెమట వోడమ,
మదవనమ్ములు నీరుపదను పెట్టినక్రియ
వాలుఁగన్నులు బాష్పవారి మునుఁగఁ,

బగ లేదుటయు నెడఁబడురథాంగముచంద
మునఁ జన్నులుముఖోద్గముగ వడంక,

గీ. ప్రాణ మెడలి నెఱపువడియొడలు [?]
భూషణములతోడిపొత్తు విడిచి
లాఁతు లైరి సఖులు లలఁతులు వాయని
ప్రాఁత లైరి నిషధరాజసుతకు. 50

గీ. బలిమి రాహు సుధాంశుబింబంబు వెఱచి
పాఱఁ గడు డాసి వెనుకొనుపగిది నొక్క
యెడ సఖులు గూడి చెలరేఁగి యీఁదుచోట
నీలవేణియు మొగమును నెలఁత కొప్పె. 51

సీ. భట్టనారాయణభాషారమాదేవి
లబ్ధవర్ణుల కర్థలబ్ధిఁ జేయు,
బాణవాగ్భామినీప్రసవమంజరి విశా
రదుల కలంకారరమణఁ జేయు,
రాజశేఖరభారతీజహ్నుకన్యక
సుకవీంద్రులకు భావశుద్ధిఁ జేయు,
మాఘవాణీశీతమారుతగతి సార
మతులకు రోమోద్గమంబుఁ జేయు,

గీ. నని యెఱింగి వారియడుగులు దలఁచి న
మస్కరించి దండి మఱిమురారి
వామనుని గుణాఢ్యు క్షేమేంద్రు నిల నలం
కారవిదులఁ దలఁచి గారవమున. 52

గీ. భూమి నిండె మింటఁ బూర్ణమై కర్కట
మకరమీనరాశిమహిత మైన
హరియశస్సుధాబ్ధియందులతుంబురు
లనఁగఁ జుక్క లొప్పె నాకసమున. 53

సీ. మకరధ్వజునివిల్లు మనము వాయిని నిడి
నమ లింపుగాఁ జేయు నల్లఁ జెఱకు,
మదనుబాణావళి మనము క్రుమ్ముళ్లపైఁ
బోలుపారఁ దుటిమెడుపుష్పచయము,
మనసిజాతునియెల్లి మనము వినోదార్థ
మై వచ్చి యాడెడుమావిచిగురు,
మరుతేరిహాయములు మనయిండ్లలోఁ బంజ
రంబులఁ బోరలుకీరవ్రజంబు,
గీ. తా ననంగుఁ డట్టివానియలంచుట
యేమి? యతనికడిమి యేమి? యతని
బీర మేమి? ధరణిఁ బిచ్చుక* యలుకేమి
వాలఁగ...... నేమి వాలుఁగంటి[?] 54
సీ. మదవతీగండూషమదిరాభిషేచన
వడి నంకురించినవకుళములను,
నతివలమృదుపాద హతినూత్నకోరక
స్ఫురణఁ గైకొన్నయశోకములను,
సుదతులక్రేగంటిచూడ్కిపైఁ బాటినఁ
దిలకించి యలరినతిలకములను,
నన్నుల యవ్వీఁగుఁ జన్నుల సోఁకునఁ
గొనురొండి ననిచిన కురవకముల,
గీ. నెరగఁ జరణములను నెఱుకలు విరిసిన
మొగడలందునుండి మొఱయుతేఁటి
కొదవు లెలమిఁ బొఁది ఘూర్ణిల్ల నధికవి
భూతిఁ దనరు చూతపోతములను. 55

* పా. యులుమేమి.

చ. మరలఁగఁబోదు రిండ్లకును మా పవునంతకుఁ జేలలోపలం
దిరిగి యొకింత లేఁతవడదేరెడు మోములఁ జెన్ను నేయుచుఞ్
బిరిగొని క్రాలున్ గ్రుచులపెల్లునఁ జీఁకటి నెల్లఁ బాచినం
దెరువరు లర్థిఁ గూడఁ బఱతేరఁగఁ బామరభామినీజనుల్. 56

శా. ముత్తా కేసుజము ల్పడల్చె? మొగడ ల్మున్నె మహీజంబులం
దొత్తెం? బువ్వులు నిండఁగాఁ బెరిగె నే యుర్వీజముల్? పూఁపలఞ్
మొత్తం బై విలసిల్లె నేధరణిజంబుల్? కాయలం బండులం
జిత్తానందముఁ జేర్చె నేక్షితిజముల్ చెల్వొందఁగాఁ జెప్పుమా! 57

క. మొగములు విరిదమ్ములఁ గుచ
యుగములు గోకములఁ జూడ్కు లుత్పలముల మం
దగతులు హంసలఁ దోల న
రుగుగతిఁ జొచ్చిరి సతు ల్సరోవర మెలమిఞ్. 58

గీ. వామనానేకపము చక్రవాళకుధర
ధాతుతటము గోరాడుచోఁ దరులు విఱిగి
కూలుటయు మింటి కెగసెడుధూళివోలెఁ
బర్వె నెఱసంజ పడుమఱ పట్టుకొనుచు. 59

గీ. సతులు చల్లుఁబోరాడుచో జలకణములు
నెఱికురులమీఁద నిండి క్రిక్కిఱిసి చెలువ
మమరెఁ గనుఁగొన నింద్రనీలములతోడఁ
గలయఁ గ్రుచ్చినఁ మౌక్తికంబులునుబోలె. 60

సీ. సారథిశతవృద్ధు చక్రంబు లొనగూడి
జరగవు రథమున సంఘటించి,
యుదకంబుసోఁకున కోర్వనియరదంబు
చేతికి బిరు సైనతాటివిల్లు,
గఱితాఁకు కోర్వక గడగడ వడఁకుచు
మువ్వంకఁ బోయెడిచివ్వ నారి,

మేపు నీరును లేక మెసలాడ నోపక
　　వర్ణహీనం బైనవారువములు,
గీ. నిట్టిసాధనములు నీకు నెట్టు లొదవెఁ
త్రిపురముల నెట్లు గెలిచితి దేవదేవ!
యనుచు నగజాతచెలు లాడ నలరుశివుఁడు
చిత్త మిగురొత్త మనల రక్షించుఁ గాత. 61

సీ. సుదతులు డస్సినచో నలంతలు వోవ
　　సొబగుఁ డై చలిమిరి చూపి చూపి,
యువిదలు తిలకించి యున్నచో వేడుకఁ
　　గొలఁది మీఱఁగ నొజ్జఁ గుదిసి కుదిసి,
సుభగులపెనఁకువచోఁ దాన వలఁతి యై
　　యెఱుకువ వాసన కెక్కి యెక్కి,
వెలఁదులు ముదమున విహరించుచో సోయ
　　గంబున వీథులఁ గ్రాలి క్రాలి,
గీ. యతులితం బైనశృంగారరతుల నిజవి
భూతిపాం దాన సేసి తత్పురములోనఁ
బవలు రేయును నుడుగక తవిలి తిరుగు
మిండఁడూను బోలె మందానిలుండు లీల. 62

క. హారగిరి సురగిరి రోహణ
గిరు లీనినకొదమ లనఁగ గృహములు పురి న
చ్చెరు వగును గుడ్యరత్న
స్ఫురణను విలసిల్లి తగినపాడవులతోడన్. 63

ఎఱ్ఱయ—కూచిరాజు. (కొక్కోకము.)

సీ. ఒంటు మోహమునఁ గన్గొంట చక్షుఃప్రీతి,
　　పలుమాఱు నది దలంపంగఁ జింత,

యుడివోనికోర్కె చే నుండుట సంకల్ప,
మొగి గుణస్తుతి నిద్రయుడిగి పొగడ,
విరహతాపంబున వెగడొందుటయె కార్శ్య,
మరచి యేమిటిమీఁదియాశ లుడుగు,
కొంద ఱుండియు వారి నెఱుఁగమి నిర్లజ్జ,
గమనంబు తనయిల్లుఁ గదలి చనుట,
గీ. వలపు తల కెక్కి మది తన వశము గాక
పరవశత్వంబుచే డిల్లఁబడుట మూర్ఛ,
పొందు లేకున్నఁ బ్రాణంబు పోవు ననుట
మృతియు, నని దశావస్థలగతులు నొప్పు. 64
క. చూచుట తలఁచుట కోరుట
కాచుట కృశ మాట రుచులు గానమి సిగ్గున్
ద్రోచుట నడచుట మూర్ఛా
ప్రాచుర్యము మరణ మనఁగఁ బదియు నవస్థల్. 65
సీ. పట్టెకంకటి దూదిపఱుపు ముక్కాలిపీఁట
యగరుధూపము వెలు వైనదివ్వె,
పూలు గంధము గంపవాడి పున్గుబరణియు
జాలవల్లిక వన్నెమేలుకట్టు,
తమ్మపడిగ పాన్పు తలగడ చిటిచాఁప
సానఱా యడపంపుసంచి గిండి,
గొడుగు పావలు గాజుగుడిగి సున్నపుఁగ్రోవి
గంధపుఁజిప్ప బాగాలబరణి,
గీ. గిండిచెంబును చిరుతేరగిన్నె బోన[?]
నిలువుటద్దము వీణియ చిలుక సురఁటి
మిద్దెయిల్లును ముంజూరు మిగిలినట్టి
పంచటోవరి గలకేళిభవనమునను. 66

సీ. పర్వతతరునదీపక్షినామంబుల
నేకన్నెc బిలిచెద రింటివారు?
పొడవు కొంచెము వక్రమును బొందు నేకన్నె
...... వక్రములు తొడలు?
పెదవియు నధికంబు పింగళి పైని గుంట
కన్నులు గల్గి యేకన్నె మెలcగుc?
గలకంఠమును బాదకమలంబులును గడుc
గఠినంబులగుచు నేకన్నె కమరు?
గీ. నిదురవోవంగ నవ్వుచు నిడుదయూర్పు
లడర నేకన్నె లేడుతు రశనవేళ?
మీసములు గల్గి చనుదోయిమీcద రోమ
ములును గల్గును నేకన్నె బొసcగ దదియు. 67
సీ. పాగకంపు గలుగక మిగుల వెచ్చన గాక
తెలు పైననీటను జలకమాడి,
కరము పల్చన నున్నc గాక పిప్పియుc గాక
మృదు వైనగంధంబు మేన నలcది,
గడితంబు జిలుcగు గా కరవడునైన[?]
పంచపై వలిపదుప్పటముc గట్టి,
చెమ్మ వల్వక వన్నె చెదరక వాసనc
గులుకుపువ్వులు దోcపి కొప్పు ముడిచి,
గీ. మదనరతికోవిదులు పీఠమర్దకాది
విటులు సల్లాపములు చేసి వేడ్క సేయ
మోహనాకారుc డై మరుమూర్తి వోలెc
బల్లవుcడు కేళిమందిరాభ్యంతరమున. 68
సీ. వనరుహాసన మనోవాక్కాయకర్మల
ధవుని దైవముc గాcగc దలcపవలయుc,

ప్రత్త్యుత్తరము లీక పని యేమి చెప్పినఁ
జెవిఁ జేర్చి వేగంబె చేయవలయు,
సత్తమావలచోట నాప్తభృత్యులయెడ
మాయాప్రచారము ల్మానవలయుఁ,
ప్రతివాసరంబు శోభితవృత్తిచే నిల
యంబు గోమయముచే నలుకవలయు,
... ... ... ...
... ... ... ...
... ... ... ...
... ... ... ... 69

సీ. వలిపపయ్యెదలోన నిలువక వలిగుబ్బ
చనుదోయి మెఱుఁగులు చౌకళింపఁ,
బగడంపువాతెఱపై నొకించుక డాఁగి
మొగమునఁ జిఱునవ్వు మొలక లెత్తఁ,
గొలుకుల నునుగెంపుఁ జిలికించి క్రొవ్వాఁడి
దిట్ట చూపులు దలమట్టుఁ దిరుగ,
నునుగొప్పులోపల నునిచినపువ్వుల
తావి పైకొని తుమ్మెదలను బిలువఁ,
గీ. దొడవులకు నెల్లఁ దొడవైనతొడవుతోడ
వలపులకు నెల్లఁ దనమేను వలపుఁ దెలుపఁ
బరఁగు కామిని తనవామపార్శ్వమునను
గదియఁగా వేడ్క లెంతయుఁ గడలుకొనఁగ. 70

సీ. హేమవర్ణం బైన నిందీవరద్యుతి
యైనను దనుకాంతిఁ బూనవలయు,
జరణంబులును హస్తసరసిజంబులు గోళ్ళుఁ
గనుఁగొనలును నెఱ్ఱ గలుగవలయు,

సరసముల్ మృదువు లై చక్రాబ్జము ల్చిహ్న
కము లైనవరపాదకరయుగములు,
సమము బింకము నైన చనుదోయి, నల్ల నై
కడ లొక్కకొలఁ దైనకచభరంబు,
గీ. భోజనము నిద్రయును గొంచెమును మొగంబు
నుదరమును జాలఁ బలుచ నై మృదులతనువు
నధికశీలంబుఁ గలకన్య యర్హ్మగాఁగఁ
జాటి చెప్పిరి పరిణయశాస్త్రవిదులు. 71

ఎఱ్ఱయ—కూచిరాజు. (సకలపురాణసారము.)

ఉ. నీరజనేత్రకృష్ణమృగనేత్రనవారణనేత్రదృష్టివ[?]
న్నీరదగాత్రు వేదగుణనిర్మలసూత్రుఁ బురాణభారత
స్ఫారకథాచరిత్రు ఘనపాపనికుంజలతాలవిత్రు దు
ష్పారతపస్సమాధిజితశత్రుఁ బరాశరపుత్త్రుఁ గొల్చెదన్. 72

ఎఱ్ఱాప్రెగడ—పెదపాటి. (కుమారనైషధము.)

సీ. అడియాసలే కొల్పి యఱపిసమును నీక
యాడుచుండును చేతి కందినట్లు,
మొనసి పద్దులఁ బ్రోఁకలను[?] వెంబబెట్టుక
మమ్మరించును తనయొమ్మె లెల్లఁ,
గప్పువెట్టినపండ్లు గానరాఁ బల్కుచు
నెఱవుసొమ్ములు చూపి మురిసియు నుఱక,
యెన్ని లే వకట తా నీడేర్చినవి యిండ్లు
మాటికిఁ జెప్పుకో నేటి కన్నుచు,
గీ. రాగిపైఁ బూఁతపూసినరవణములును
* నెఱయలచ్చరిపండ్లకట్టులును చమిరి

* సరిగాలేదు.

నట్టిప్రాఁతల చుట్టలు పెట్టి పెట్టి
తగిలి వల దన్న మానక దాఁచఁబెట్టుఁ
జెప్ప రోఁతలువో పీనిసేఁత లెల్ల. 73

సీ. అలరెడుఱెప్ప లల్లార్చినయందాఁక
ననిమిషకన్యఁ గా దనఁగ వశమె?
యమృతంబు చిలుక మాటాడినయందాఁకఁ
గనకంపుఁబ్రతిమ గా దనఁగ వశమె?
నడుఁగక యడుగెత్తి నడచినయందాఁక
గొనబుపూఁదీగె గా దనఁగ వశమె?
కలికి తనూరేఖఁ గదిసి కన్గొనుదాఁక
ఘనవనలక్ష్మి గా దనఁగ వశమె?
గీ. యువిద సఖిమీఁద వెడ వ్రాలి యున్నదాఁక
నొసరు తొలుకారు మెఱుఁగు గా దనఁగ వశమె?
వెలఁదిగుణములు సఖులచే వినినదాఁక
నంగసంభవుమాయ గా దనఁగ వశమె? 74

చ. అలికుల మెల్ల వేణియును హంసములెల్లను మందయానముల్
జలజము లెల్ల నెమ్మొగము జక్కవలెల్లను చన్నుదోయి యా
పులినము లెల్లఁ బెన్పిఱుఁదు పుష్పములెల్లను మేనివాసనల్
పొలఁతుక నాక్రమించుకొనిపోయె నవన్నియు నన్నివంకలన్. 75

సీ. ఈశుచేఁ గాంచి సాహిత్యవిద్య ధరిత్రి
నిల్పినయట్టి పాణిని భజించి,
శ్లోకార్థమునఁ జంద్రజూటు మెప్పించి యి
ష్టార్థము ల్గొన్నమల్హణు నుతించి,
గద్యంబుచెప్పి శంకరునిచేఁ గరములు
ప్రతిభతోఁ బడసినబాణుఁ దలఁచి,

శతకంబుఁ జెప్పి భాస్కరుని మెప్పఁగఁ జేసి
యమర దేహుఁ డైనమయూరుఁ గొలిచి,
గీ. భవుని మెప్పించి కన్నులు బండిఁ దెచ్చి
వనిత కిచ్చినకాళిదాసునకు మ్రొక్కి
హరుని వినుతులచే బాస లాడఁజేసి
నట్టిభట్టుని నన్నయభట్టుఁ బొగడి. 76
క. ఉడురాజు కొలువు దీరిన
నుడుగణపరివారసమితి నొలుపుగ ననుపన్
వడి వచ్చుకటికవాఁ డనఁ
బొడచూపెన్ వేగుఁజుక్క పురుహూతుదెసన్. 77
చ. కలసి యొకళ్లొకళ్లు కనుగంవని వేడ్కలఁ జూచువేళ నె
ప్పలు మఱువయ్యెనే నవియ పాయుట, తత్సుఖపారవశ్యులై
పలుకకయుండుటే యలిగి పైకొనసంచుట, యంతె కాని తో
య్యలియును విభుండుఁబాయుటయు నల్గుట నాఁగ నెఱుంగ రెన్నఁడున్. 
క. కురువిందవజ్రమయ గో
పురకాంతులవలనఁ బ్రొద్దు పొకలురాకల్
పరికింప నరిది యయ్యెను
సరసిజకైరవవికాససంపద దెలియన్. 79
సీ. కొమరువెన్నెలమోసు నవలి ప్రాణేశ్వరు
కొసఁగి యిం పొనరించు నొకచకోరి,
పరపువెన్నెల గుజ్జు బంతెనగూళ్లాడు
నోలి నెచ్చెలులతో నొకచకోరి,
పొ లైనవెన్నెలతేటకేళాకూళి
నోలలాడుచు నుండు నొకచకోరి,
గట్టివెన్నెల చల్దిగాఁ గట్టి వల్లభు
నుడురాజుకడ కంపు నొకచకోరి,

గీ. చేగవెన్నెలక్రొవ్వు భంజించి విందు
లారగఁ జేయును జుట్టాల కొకచకోరి,
పండువెన్నెలపేస మేర్పరచి పతికి
నుబ్బుగా నిచ్చు వేసవ నొకచకోరి. 80

సీ. తంగేడు జెముడుకుఁ దామ రుమ్మెత్తకు
గన్నేరువేళ్లకుఁ గరకకాయ,
ముసిఁడికి శుంఠియుఁ బసుపు సున్నమునకుఁ
దెఱఁగొప్పఁ బాగడకుఁ దెల్లయుప్పు,
వట్టివేళ్లకుఁ బత్తి వావిలి కొడిసెకు
నేయి పాలకును వేసీళ్లు దలఁప
జీడికి సెనఁగ మించినవసనాభికి
జిత్తివేళ్లును నల్ల జీలకఱ్ఱ,

గీ. తైలశకలకు జిల్లేడుపూలసీళ్లు
పనసపంటికి నూనె యావడపు ముస్తి
మిరియ మరఁటికిఁ దగడకు నరయఁ దుమ్మ
లడరువెలితుమ్మ నేలతంగేడుకు వైరి. 81

సీ. తొలివొలి గోసినతోరంపుఁ గ్రొవ్విరు
లించు విల్తునకు మీఁ దెత్తి మ్రొక్కి,
పద్మపరాగంబుభసితంబు మంత్రించి
పువ్వారుఁబోఁడికిఁ బొట్టు వెట్టి,
సంపంగిరేకుల సర్వంబు లిఖియించి
రాజాస్యకరమున రక్ష గట్టి,
నెఱిఁ బచ్చనివి యెఱ్ఱనివి యైన వొనగూర్చి
[?]బడసిపుష్పంబుల బడిమి పోసి,

గీ. మదచకోరంపుమఱక నేమఱక ద్రిప్పి
పడఁతికిన్ని దమ్మికప్పెర వెడలఁ జేసి

చెలఁగి పూఁదేనియలఁ దేఁటిసిద్ధులకును
వెలఁది యెదుటను జూఱ గావించె నపుడు. 82

సీ. పులుసోర చేఁదు నుప్పును దీపు నొగరును
గణుతింపఁ బానాధికములు గాక,
చిముడంగఁబాఱక చిక్కనై యిగురక
కాటువోవక మఱి కలఁత వడక,
యుడికియు నుడుకక యుండిని క్కమ్మక[?]
పసరువేయక పరిపాటిచెడక,
సంబారములతోడిసంబంధ మెడలక
పొగపువాసన విరిపోటుగాక,

గీ. వింత లై జిహ్వకును రుచు ల్విస్తరిల్లఁ
దగుపదార్థంబు లెడనెడఁ దాము తామ
భోక్తలకు భోజనాసక్తిఁ బొడమఁ జేయ
నిందువేడుకఁ గూరలు వండ నేర్తు. 83

సీ. మన్మథదివ్యాగమమున కోంకారంబు
భూతేశునొదల పువ్వుదండ,
యల్పశృంగారరేఖార్గళకుంచిక
యధికతమోదంతి కంకుశంబు,
విరహిణీజనమర్మవిచ్ఛేదకర్తరి
యంబర క్రోడదంష్ట్రాంకురంబు,
తారకామౌక్తికతతికి నంచితశుక్తి
దగునంబునిధికి ముత్యాలజోగు,

గీ. మారుపట్టాభిషేకాఖ్యవారికుంభి
చిత్తజుని కోటలగ్గదంచెనపుగుండు
నాఁగ నానాఁటి కభివృద్ధి నారుకొనిన
చంద్రుఁ డుదయించెఁ గాంతినిస్తంద్రుఁ డగుచు. 84

సీ. లావణ్యరేఖావిలాసలీలాకళా
శాసితసూనశరాసనుండు,
కుంభినీవహనవిజృంభదోస్స్తంభసం
భావితాశాంతదంతావళుండు,
* దారాత్త దానాంబుధౌతయాచక జాల
దుర్దమదుర్విధకర్దముండు,
నీహారసురవాహినీహారనారద
శారదనీరదస్వచ్ఛయశుఁడు,
గీ. వినుతిసేయంగఁ దనుజదిగ్విజయలటహ
పటహానిర్గుణనిర్ఘాతపటలచటుల
ఘోరనిర్ఘోషవినమితకుమతవిమత
కులకరన్యస్తవిస్తృతనలుఁడు నలుఁడు. ౮౫

సీ. విరిదమ్మిసుఁటుల విసరకే యెలనాఁగ!
యుష్ణాంశుచెలు లవి యుడుకుచల్లు,
వెలఁదిముక్తాహారములు వైవకే సఖి!
యౌర్వాగ్నితోఁబుట్టు లవి యలంచు,
... ... ... ...
గీ. చెలఁగి పన్నీరు చల్లకే కలువకంటి!
రాహుదంష్ట్రలు సోఁకినరాజుమేని
కసటుచేఁ బ్రోదియగునవి కాదు మిగులఁ
గాన యవియెల్ల నబల నీగతికిఁ దెచ్చె. ౮౬

సీ. శాత్రవభుజగభుజంగమశాత్రవ
శాత్రవనృపబలసంగరముల,

---

* ధారాత్త?

రిపుపద్మవనపద్మరిపురిపుప్రళయధా
త్రీనాథపురవరత్రిపురములను,
విద్విష్టగిరిగిరివిద్విష్టవిద్విష్ట
మండలాధీశభూమండలముల,
వైరికైరవవనకైరవవనవైరి
వైరిభూపాలకాంతారములను,
గీ. బొంగ గడింపఁ ద్రుంపఁ బొగిమార్పఁ గాల్ప నౌ
ర్వానలుండు[?]వ్య పాంకబాణ
పటుతరానలుండు ప్రళయానలుఁడు ద
వానలుండు ధరణి నానలుండు. 87
సీ. శ్రీ బయల్పడకుండఁ జికురము ల్దుకప్పఁ
గుచచూచుకములకుఁ గొంత యిచ్చె,
లేమి దోఁపకయుండ లెస్సఁగా నడిమికిఁ
గుచములు తమకల్మిఁ గొంత యిచ్చెఁ,
దనువల్లి కనుదృష్టి దాఁక కుండఁగ సాధు
దంతముల్ తమకాంతిఁ గొంత యిచ్చెఁ,
[?]దరబసిరింత లై దాఁటకుండఁగఁ దమ
యలసత చూడ్కుల కంఘ్రు లిచ్చె,
గీ. నంగకము లొక్కమై నున్న సాంగములను[?]
కలిమిలేములు దనులోన సలకరించె
నరయఁ బుత్రోత్సవమున కాయత్తపడెనో
యనఁగ సతిమేన గర్భచిహ్నములు దోఁచె. 88
సీ. శ్రీసిద్ధి రస్తు శాసితవైరిమండల!
విజయోఽస్తు భువనైకవీరవర్య!
అభ్యుదయోఽస్తు సాహసబలసామగ్ర్య!
కల్యాణ మస్తు నిష్కలుషహృదయ!

శుభమస్తు కారుణ్యవిభవసముజ్జ్వల!
బ్రహ్మాయురస్తు భూపాలతిలక?
అభివృద్ధిరస్తు మహౌదార్యభూషణ!
చిరకీర్తిరస్తు భాసురగుణాఢ్య!
గీ. తుష్టిరస్తు నిజాంకనిర్ఘాతకలుష!
పుష్టిరస్తు జగత్త్రయీపూతచరిత!
భద్రమస్తు మహీభారభరణ! నీకు
నధికతేజోఽస్తు తే నిషధాధిరాజ! 89

ఎఱ్ఱాప్రెగడ—పెద్దపాటి. (మల్హణచరిత్ర.)

సీ. కువలయకమలాభినవమనోజ్ఞం బయ్యుఁ
బంకజీవనపరిప్లవము గాక,
ఘనసారపున్నాగకమనీయ మయ్యును
గితవసుమ్న_ళిత[?]సంయుతము గాక,
సాధుదాన.ప్రౌఢియాధవం బయ్యును
విశ్రుతఖరసమన్వితము గాక,
రాజితోత్తమజాతిరత్నాంకితం బయ్యు
శృంగారవిటవిభూషితము గాక,
గీ. వరసరోవరచయమును వనచయంబు
నృపచయంబును దివ్యఘంటాపథచయంబు
నెలమిఁ దనుఁ బోలె ననఁబొగడ్తలు వహించె
భువనసారంబు కల్యాణపురవరంబు. 90

చ. గము లగుపద్మరాగములఁ గ్రమ్ముమరీచులు చౌకళింపఁగా
గములవనంబు లెన్నఁడు వికాసము నొందవు వజ్రమౌక్తికా
సమరుచిచంద్రికం గుముదసంఘములం గనుగందకుండునాఁ
గొమ వగుదివ్యరత్నమయగోపురవైభవ మెన్న నేటికిఁ. 91

సీ. పగడపుఁగంబాలపచ్చటోవరియును
నపరంజికోళంజి యలరుఁబాన్పు,
బంగారుసకినెలపట్టెమంచంబును
వజ్రపునునుజాలవల్లికయును,
గుంకుమతలగడ ల్గొజ్జఁగిపూఁదెరల్
దరమైనచంద్రకాంతంపుగిండి,
చౌసీతిరతముల నవరనిమేల్కట్టు
దీపించుమాణిక్యదీపకళిక,
గీ. పొసఁగఁ గర్పూరవేది కప్పూరపుసురఁటి
నిలువుటద్దంబు రతనంపునెత్తపలుక
తళుకుదంతపు బాగాలు కలికిచిలుక
గలిగి యొప్పారుచవికెలోపలికి నెపుడు. 92

కసవరాజు—తెల్లపూఁడి. (కళావతీశతకము.)

చ. గురుకుచకుంభము ల్గదలఁ గ్రుమ్మడి వీడఁగ రాలఁ గ్రొవ్విరుల్
కరమణికంకణక్వణనకాచనగధ్వను [?] లుల్లసిల్లఁగా
భరతపుఁబిట్టకైనడిని శాదికిఁ జేరెడివెల్చెలాగునన [?]
బరిపరిరీతులం జెలఁగు భంగులు మెత్తుఁగదే కళావతీ! 93

చ. ప్రకటితలీలఁ గీ లెడలి పాపటముత్తెపుఁజేరు మోముపైఁ
దకపికలాడఁ గ్రక్కదలుదంతపుఁ గమ్మలకాంతి మొత్త మై
వికచకపోలభాగముల వెన్నెల గాయుచునుండ నీవు నన్
... ... లాగులు మెత్తుఁగదే కళావతీ! 94

కేతన—మూలఘటిక. (ఆంధ్రభాషాభూషణము.)

ఉ. మెచ్చఁడు మెచ్చవచ్చు నెడ, మెచ్చకుఁ డిచ్చకు మెచ్చు రానిచో,
మెచ్చియు మెచ్చు ల్మింగకుఁడు, మెచ్చక మెచ్చితి మంచుఁ గ్రుచ్చుతై

మెచ్చకుఁ, డిచ్చ మెచ్చుఁ గని మెచ్చుఁడు, మెచ్చొకమాన్యమైనచో
మెచ్చియు మెచ్చకుండకయు మెచ్చుఁడు, సత్కవులార! మ్రొక్కెదన్. *95

## కేతనప్రెగడ—భాస్కరుని. (కాదంబరి.)

మ. గంధర్వాత్మజ రాజుఁ జూచెఁ బతియుం గాదంబరిం జూచెఁ ద
ర్వాంధీభూతమనస్కుఁడై మరుఁడు విల్లందెన్ బ్రసూనోల్లస
ద్గంధం బొప్పఁగ నెక్కువెట్టి గుణనాదం బాని పుష్పాస్త్రముల్
సంధించెన్ దెగఁబాపి యేయఁ దొడఁగెన్ సవ్యాపసవ్యంబుగన్. 96

సీ. దీనిలోపలఁ గొన్నిదినము లుండిన నుష్ణ
కరుఁడైన నట శీతకరుఁడు గాఁడె?
దీనిలోఁ దెరిగినఁ దా నంబురాశిలోఁ
గా దని జలశాయి గాఁపురాఁడె?
దీనితీయనినీరు దివిజులు త్రావిచూ
చినఁ దమయమృతంబు చేఁదు నారె?
దీనితోయమ్ములఁ దీర్థమాడిన నెంత
పాపాత్ములును మోక్షపదవిఁ గనరె?

గీ. యనుచుఁ గొలనినీటియతిశయత్వంబునుఁ
జలువుపెంపుఁ దీపుఁ బావనతయు
మనుజనాయకుండు గొనియాడి పడివాగె
త్రాట హాయముఁ దిగిచి తటియఁ జొచ్చె. 97

## కేతన—(కువలయాశ్వచరిత్ర.)

ఉ. కోటలతనర్చు చూడ్కుల కగోచర మయ్యును దేరు మీఁదఁ బ
ల్మాటున నేఁగుచోటఁ దగులంబడమిన్ రవిమండలంబు నీ

---

* ఈపద్యము ముద్రిత మగునాంధ్రభాషాభూషణమునఁ గానరాదు. తాళపత్రప్రతులందును గానరాలేదు.

పాటిదప యక్షతలంపునకుఁ బట్టగుచున్నదిగాక దీనికిం
బాటి యనంగ గు జ్జనఁగ బట్టెవె యయ్యుదయాస్తశైలముల్. 98

## కొండయ—బొడ్డపాటి. (చాటువు.)

సీ. కడఁగి యెక్కడ నైనఁ గదలనియరదంబు
నరదంబు పై నిల్చినట్టివిల్లు,
వింటికిఁ గాఁపుగా విహరించుచక్రముల్
చక్రములను బ్రొద్దుజరపుశరము,
శరమునఁ బొడమినచక్కనిసారథి
సారథిమొగమునఁ జాఁగుహరులు,
హరులసామర్థ్యంబు నరసినశింజిని
శింజినిఁ దరిత్రాడు సేయుబలముఁ,
గీ. బొందువడఁ జేసి దైత్యులపురము లేసి
యఖిలజగములు రక్షించునట్టిజోద
వనుచుఁ గొనియాడుదురు నిన్ను ననుదినంబు
నంగభవభంగ! తిరుకాళహస్తిలింగ! 99

సీ. తొమ్మిదితునుకల నెమ్మిఁ గూర్చినతేరు
సరిజోకఁ గూడనిచక్రయుగము,
నొకముఖంబున గడ్వ నోపనిసారథి
రూపింప రానివారువపుసమితి,
బెడిదంపుదెగలకుఁ బెలు చైనవిలుకమ్మి
గాలిచేఁ బ్రొద్దులు గడపునారి,
పదివంక లై చాయఁ బాఱనిబాణంబు
పడిబత్తెములు లేనిభటగణంబుఁ,
గీ. బొందువడఁ జేసి దైత్యులపురము లేసి
యఖిలజగములు రక్షించునట్టిజోద

వనుచుఁ గొనియాడుదుర నిన్ను ననుదినంబు
నంగభవభంగ! తిరుకాళహస్తిలింగ! 100

సీ. దేహంబు మిక్కిలి తిర మైనరథము గా
ఘననేత్రయుగము చక్రములు గాఁగ,
నూర్పు లశ్వంబు లై యొప్పారుచుండఁగ
[?]దొరయుబల్లెరము సూతుండు గాఁగ,
సవ్యాంగ మతిఘోరసాయకం బది గాఁగ
సొరిదిఁ గుంతలములు జోడు గాఁగ,
దల మైనవిహారణస్థలము కార్ముకము గా
నలు వైనహారంబు నారి గాఁగ,

గీ. నన్నియును నీమహత్త్వంబ యగుటఁ జేసి
లీలఁ ద్రిపురంబు లేసి గెల్చితివి గాక
నీకు నొరులు సహాయులై నిలువఁగలరె?
యంగభవభంగ! తిరుకాళహస్తిలింగ! 101

## కొమ్మయ—నిశ్శంకుని. (వీరమాహేశ్వరము.)

సీ. ఎనిమిదిరూపంబు లేక మై కనుపట్టి
దీపించు నెవ్వానిదివ్యమూర్తి?
గణుతింపఁ దగు దేవగణములయాఁకలి
వెసఁ దీర్చు నెవ్వాని నొసలికన్ను?
రాజసంబునఁ జొరరానిచోటులు సొచ్చి
వడి మేయు నెవ్వానివాహనంబు?
నాణెమై యలువదినాల్గుపీఠములందు
రాణించు నెవ్వానిరాణివాస?

గీ. మది గనుంగొని పాటు రానట్టిమోహ
మిచ్చ నొదవించు నెవ్వాని యిల్లు విల్లు?

బెరయుఁ నెవ్వానిపలుకులు జేసి యాగుచు?
నెందు నెవ్వాని సేవింతు రెల్లసురులు? 102

సీ. కడిఁదియుద్ధంబులఁ గదిసి యాఁకలిదీర
మింమఁజూపుల నారగించువాఁడు,
గడియసే పైన నొక్కెడ నూరకుండక
త్రిభువనంబుల సంచరించువాఁడు,
నూఱుతంత్రులవీణె నూతనంబగుక్రియా
హేవాక మొప్ప వాయించువాఁడు,
గోర్లు దాఁటించి నిర్నిమిత్తంబు[?]
వీఁకునఁ బోరు గావించువాఁడు,
గీ. మునివరేణ్యుఁడు పద్మగర్భునికి నింపు
కొనలు సాఁగంగఁ బుట్టినకొడుకుఁగుఱ్ఱ
చనియె శర్వాణిఁ గొలువంగఁ దనువిలాస
శారదాంబుదవర్ణుండు నారదుండు. 103

మహాస్రగ్ధర. కని రాబ్రహ్మోచ్యుతాదు ల్ఘనకనకలతా
గ్రంథిసంబంధిజూటా
వనిఖేలద్బాలచంద్ర స్వాయముపచయకృ
ద్వర్ణవర్ణప్రభాసం
జనిభాస్వత్ఫాలభాగస్థలసితభసిత
స్థాసకశ్రీసమగ్రా
ననపద్మున్ బుణ్యసద్మున్ జరణానతవిప
న్నాశు నానందికేశున్. 104

సీ. కమలజాండంబులు కందుకంబులు సేసి
యొండొండఁ దాటింప నోపువారు,
విలయవహ్నులఁ బట్టి వెస దండలుగ గ్రుచ్చి
యురమున ధరియింప నోపువారు,

తివిరి సంహారభైరవు లైనఁ బోకపోవ
నొకమాత్ర వసిమాల్ప నోపువారు,
కాలచక్రక్రియాఘటనంబుఁ ద్రిప్పి యొం
డొకలాగు గావింప నోపువారు,
గీ. ప్రమథవీరులు వివిధరూపములతోడ
హాసన లనుఘనతాపనాద్యలఘుగతులు[?]
వెలయఁ గోటానకోటులు కొలిచి వచ్చి
రతఁడు హరుఁ గొల్వ నేతెంచునవసరమున. 105
సీ. కలికుఁజీఁకటులమూఁకలు నుగ్గునూచగా
నుతిచి నూఱక త్రాగు నెఱతనంబు,
పొట్టేటిరాయని బొళియంబుఁ గదలించి
వాహ్యాళిఁ గపలెదువైభవంబు,
క్రతుభాగములు దెచ్చి కైతప్పు గాకుండ
వేల్పుల కందిచ్చువెరవుసొంపు,
మూఁడుమూర్తులు దాల్చి గురువుతో జన్నంపు
వేదిపైఁ గొలువుండువిభ్రమంబు,
గీ. నీకుఁ జెల్లు నొరుల నీతోడిసాటికిఁ
జేరఁ గ్రుచ్చి యెన్న లేరు జగతి
వరమె నిన్నుఁ బొగడ స్వాహావధూకుచా
భ్యున్నతప్రకాశ! యోహుతాశ! 106
సీ. కల్పాంతవార్ధి మోఁకాలిబంటిగ నేయ
తీశ్వరుఁ డొంటిమైఁ దిగినాఁడు?
వటపత్రవీథి నెక్కటియున్నబాలు నే
తాపసాధిపుఁడు ముద్దాడినాఁడు?
తపవేర నేతపోధనమౌళి సుస్థిర
స్థితిఁ బురాణంబు సంధించినాఁడు?

హరుని మెప్పించి సంహారకాలుని జయో
న్నాద మేమునిరాజు నూన్చినాఁడు?
గీ. కనియె నటువంటిసంయమీంద్రుని మహాత్ముఁ
దనయునిఁగ నమ్మృకండునిధర్మపత్ని
సహజశివభక్తిరతుని విశ్వప్రసిద్ధు
ననఘకీర్తి మార్కండేయుఁ డనెడువాని. 107
సీ. జడి వట్టుపడగలు, పడగలమీఁదిచోఁ
గదలెడికండ్లును, గండ్ల నడుమ
నూత్రించుజోడును, జోడుపైఁ జరియించు
బంట్లును, బంట్లకుఁ బాయరాని
ధనువును, ధనువుతోఁ దగిలినయుగళంబు,
నరదంబుక్రిందికి నరుగునారి,
నారి నిద్రించుబాణము, బాణ మొదవించు
నూతుండు, నూతసంజాతహరులు,
గీ. గాఁగ నద్భుతార్థకరపదార్థావళు
యుల్లసిల్ల నొప్పుచున్న దిపుడు
త్రిపురహరణకరణవృషదత్తధీరము
నోరథంబు దేవ! నీరథంబు. 108
సీ. తల్లిదండ్రులతోడి తగు లొల్ల కుండియుఁ
దల్లిదండ్రులతోడితగులు వఱచి,
కందర్పుమీఁదియక్కటికంబు సెల్లియుఁ
గందర్పుమీఁదియక్కటిక మొదవి,
సంసారకేళిప్రసక్తిఁ బోఁదట్టియు
సంసారకేళిప్రసక్తి గలిగి,
సగుణవిశేషయోజనము ఘటించియు
సగుణవిశేషయోజనము మాఁగి,

గీ. సగము పురుషుండు కంజాక్షి సగము గాఁగ
నర్ధనారీశ్వరాకృతి ననువుపఱచి
హరుఁడు తల్లింగమధ్యంబునందు నుండి
హరివిరించుల కంతఁ బ్రత్యక్ష మయ్యె. 109

సీ. దైతేయకాంతల తళుకుఁగెమ్మోవుల
వీటికాశ్రీలకు వీడుకోలు,
వేల్పుటిల్లాండ్ర క్రొవ్విరపుఁ జన్నులమీఁది
యలువుఁబయ్యెదలకు నిలువ నీడ,
విశ్వజగత్త్రయీవిజయలక్ష్మీగాఢ
బిరుదోత్సవములకుఁ బెండ్లివిందు,
పరిపంథివాహినీపరిచితపరిభవ
ప్రాప్తిసంకటములపాయుత్రోవ,

గీ. నేసి యెయ్యది విలసిల్లుఁ జిత్రమహిమ?
నది ప్రయోగింప నెత్తె నయ్యచ్యుతుండు
విలయసమయసముద్భూతవిపులదహన
దారుణస్పర్శనంబు సుదర్శనంబు. 110

ఉ. నన్నయభట్టుఁ గావ్యరచనావిధిఁ, దిక్కనసోమయాజి న
చ్ఛిన్నమహత్త్వసంవిధిఁ బ్రశేముషి, నెఱ్ఱయప్రెగ్గడన్ సము
త్పన్ననవప్రబంధరసభావస, నింపుసఁ బ్రార్థనాంజలుల్
మున్నుగ నాత్మలోఁ దలఁతు మువ్వుర మువ్వురఁ బోలుపుణ్యులన్.

సీ. పులినంబుతోఁ జూలు పుండరీకాక్షుని
యవతారభేదంబు కవులరాజు,
బహుపురాణగ్రంథభారతసంహితా
సంగుంభనక్రియాపండితుండు,
కట్టివన్నియవాఁడు కౌరవాన్వయకర్త
శ్రుతు లేర్పఱించినసూత్రధార,

సిద్ధనీవారముష్టింపచాధ్యక్షుండు
శుకునికూరిమితండ్రి సకలవేది,
గీ. కాళికేయుండు యోజనగంధిపట్టి
తత్త్వనిర్ణేత ఘనతపోధర్మరాశి
నైమిశారణ్యమునిసభాభూమి కెలమి
నేఁగె నొకనాఁడు వ్యాసమునీశ్వరుండు. 112

సీ. పులుఁగురాయఁడు తమ్మికొలఁకులచెలికాని
బండిబోయనితోడిపాలివాఁడు,
పన్నగస్త్రీలను బాలిండ్లపసుపాస
మగిడింప నోపినమగలమగఁడు,
దంభోళి కొకయాకతాఁకుఁ గానిక సేసి
యమృతంబుఁ దెచ్చినయాపఘుళుండు,
వినతముద్దులపట్టి వనధిచెంగట బోయ
పగకు నాఁకలి గొన్నభవ్యబలుఁడు.
గీ. పక్షములు దాల్చి వచ్చినపసిఁడికొండ
యట్టు విలసిల్లు మేటి నాహనము గాఁగ
నడచె హతశేషదేవసైన్యములు దాను
నసురకులమర్దనుండు జనార్దనుండు. 113

సీ. పైఁడిచాయలతోడిపక్షసంపుటముల
మెలఁగుతేజాలతీగె గలుగునతని,
మొకరితుమ్మెదలకు మకరందరసధార
లూసఁగుపీఠమునఁ గూర్చుండునతని,
సత్కవీంద్రుల మానసములలో విహరించు
కొమరాలి కింపులు గులుకునతని,
దిక్కులు నాల్గింట లెక్క దప్పక యొప్పు
నాననంబుల మాటలాడునతనిఁ,

గీ. కనిరి యింద్రానలాంతకదనుజవరుణ
పవనభవసఖేశానపూర్వకము గాఁగ
నమరు లందఱు మధుకైటభాసురేంద్ర
మదవిమర్దకనాభిపద్మజుని నజుని. 114

సీ. ప్రణవపీఠిక నెక్కి భాసిల్లు నేదేవి
యామ్నాయహేమహర్మ్యాగ్రవీథిఁ?
జరియించు నేదేవి సహజారుణజ్యోతి
రానందమూర్తి యై బ్రహ్మనాడి?
నేదేవి తవణిల్లు నిచ్ఛాక్రియాజ్ఞాన
శక్తిభేదమున విశ్వంబు నిండి?
తోడునీడయుఁ బోలెఁ దూలకించు నేదేవి
యెల్లకాలంబు విశ్వేశుఁ గూడి?

గీ. యట్టిదేవి జగన్మాత యఖిలవంద్య
నిఖిలవిద్యాకళేశ్వరి నిత్యమహిమ
నొకటియును శ్రీగళునిక్రేవ నుల్లసిల్లు
నలఘుకల్యాణశుభగాత్రి యద్రిపుత్రి. 115

## గంగరాజు—చిరుమూరి. (కుశలవోపాఖ్యానము.)

క. హరిదాసుని వనవాసునిఁ
బరిచితపరమోపవాసు భాసురహాసున్
సురుచిరనిగమాభ్యాసున్
విరచితకాశీనివాసు వేదవ్యాసున్. 116

సీ. పదపద్మరజమునఁ బాషాణపుత్రికఁ
బూఁబోఁడిఁ జేసినపుణ్యుఁ డితఁడు,
బాలుఁడై హరధనుర్భంగంబు సీతకు
నుంకువ సేయునిశ్శంకుఁ డితఁడు,

మణిమయంబైయున్న మాయాసురంగంబుఁ
గడఁగి చూపినవేఁటకాఁ డితండు,
కట్టాణిముత్యంబుకైవడి మున్నిరు
బాణాగ్రమున నిల్పు ప్రౌఢుఁ డితఁడు,
గీ. ప్రబలదశకంఠపటుకంఠనిబిడవిపిన
దహనకీలాయమానదోర్దండచండ
చటులకోదండనిర్ముక్తశరనికాయుఁ
డితఁడు గాకుత్స్థవంశాబ్ధిహిమకరుండు 117

గంగాధరుఁడు—కాకమ్రాని. (బాలభారతము.)

గీ. అట యుధిష్ఠిరుఁ డప్పంకజాక్షి ధౌమ్య
దత్తవహ్నిధూమకంపితశిఖులు[?]
మగువఁ గూడిన రాయంచ మగటిశతబల
నలినములఁ బోలెను బ్రదక్షిణంబు సేసె. 118

ఉ. ఆంధ్రకవిత్వతత్త్వసముపార్జితకీర్తినిఁ దిక్కయజ్వ నీ
రంధ్రతరప్రభావనిధిఁ బ్రస్తుతిసేయుదు [?] నుల్లస
త్కంధ్రగభీరమంజుతరగర్జితవిభ్రమభవ్యభంగిసై
రంధ్రికయైనచాటుమధురస్ఫుటబంధురవాగ్విజృంభిగన్. 119

శా. ఆలజ్జావతి ధౌమ్యపంపున శిఖివ్యాలోలకీలాలిపై
నోలి న్వ్రేల్చినలాజరాజి పవనప్రోద్ధూతవారాశివీ
చీలోలోద్ధతవిద్రుమాటవి నధిక్షేపించుకట్టాణిము
త్యాలో నాఁ గనుపట్టె సట్టియెడ నంచద్రాజహంసంబుగాన్. 120

క. ఇంద్రప్రస్థం బనుపురి
సాంద్రమహేంద్రాశ్మకాంతిసంతతులను ని
స్తంద్రంబై విలసిల్లెను
చంద్రాతపధవళచంద్రశాలాయుతమై. 121

సీ. ఇంద్రమణిజాలకములందుఁ జంద్రముఖుల
వాలుఁగన్నులు యమునయావర్తములను
మెలఁగి యాడెడువాలికమీ లనంగ
......కనుపట్టు నీపట్టణంబునందు. 122

సీ. కైవార మొనరింతు గంభీరసాహిత్య
ఘంటాపథోద్భాసుఁ గాళిదాసు,
వర్ణింతు నుద్వేలవాణీసుధాపూర
పాథోధిపరబాణు భట్టబాణుఁ,
బ్రణుతింతు నుద్దండభాషాసమాక్షిప్త
హరబాహుకేయూరుఁ డగుమయూరు,
సన్నుతిఁ గావింతుఁ జాటుధారాప్రౌఢిఁ
గోమలతాయత్తు సోమదత్తు,
గీ. భక్తి నంజలి రచియింతుఁ బ్రవరసేన
భాస శివభద్ర భవభూతి భట్టహర్ష
భారవి మురారి హేరంబ చోరులకును
మఱియుఁ దక్కిన సుకవుల మదిఁ దలంతు. 123

శా. క్రీడాలోలత దంతకోరకశిఖం గీలించి భూచక్రముల్
గ్రోడగ్రామణి మించి యెత్తి ఘను లక్షుద్రానుమోదంబునన్
జూడాభోగము లెత్తి చూడఁగ దిశాశుండాలరాణ్మండలిన్
వ్రీడం బొందఁగఁ జేయుపంతిముఖు నిర్వ్యఘ్నార్థ మై కొల్చెదన్.

శా. చంచత్కేసరస్థకీసరకతచ్ఛాయాకదంబంబు గ్రొ
మ్మించుల్ సోఁకినఁ దమ్మి బిమ్ములను గిమ్మీరంబు లై యుంట సం
ధించున్ వాసనఁ జంచరీకములు మందీభూతసందేహతన్
సంచారించుచు నబ్జకల్పవిదులన్ ఝంకారసంకారు లై. 125

శా. ధారాపాతవిభాతిశీతకరకాంతస్ఫారగేహంబు లీ
యూరం జంద్రిక మీఁదఁ బర్వ నురుచున్ [?] వ్యూఢాంబుధారాళతన్

జేరఁ జాతకపంక్తి చిత్తములు రంజిల్లఁ మయూరంబులుఁ
సారస్యంబుల లాస్యము ల్సెఱయఁ నుత్సాహించి భూపాలకా! 126

సీ. పురుహూతవిస్ఫూర్తి భూమండలం బెల్ల
భుజవిటంకంబునఁ బూనినాఁడు,
గీర్వాణదుర్వారుఁ గేశిదానవుఁ గొట్టి
విజయలక్ష్మియుక్తి వెలసినాఁడు,
లచ్చి నెచ్చెలికాని లలితోరుపీఠికఁ
బొడమినపూఁబోఁడిఁ బొందినాఁడు,
నవయుగద్వీపభూనాథచూడారత్న
మిత్రశాసనలీల మెఱసినాఁడు,

గీ. విమలకీర్తిమందాకినీవీచినికర
పూరపాతాళమర్త్యవిబుధనివాసుఁ
డై కరం బొప్పు సోమాన్వయప్రభుండు
చారుకీర్తి పురూరవశ్చక్రవర్తి. 127

శా. మత్తారాతిమహాంధకారపటలీమార్తాండుఁ డుద్ధాటికా
దత్తోద్యత్తురగావళీఖురపుటోత్పన్నక్ష్మాధూళికా
యత్తాంభోధి యయాతిఁ జెప్పఁ దగు నుద్యద్వజ్రధారాప్రభా
జిత్తేజుఁ సితకీర్తికైతకదళశ్రీనూతనాంభోదముఁ. 128

గీ. వరుఁడు కెంగేల నకన్యచరణపుటము
సన్నెకంటిపై నిడ నొప్పె శత్రుయువతి
చూడమాణిక్యములమీఁదఁ గూడఁ జేయు
లీలఁ బ్రకటింపఁ బూనినకేళి మెఱయ. 129

క. శబ్దార్థరసవిశారదు
శాబ్దికమూర్ధన్యు శబ్దశాసనబిరుదుఁ
శబ్దాయమానవిస్ఫుర
దబ్దఘటారభటి నన్నపార్యునిఁ దలఁతుఁ. 130

శా. శ్రీరామాయణకావ్యకల్పనవిరించిన్ వేదఘంటాపథో
ద్ధారప్రాఘమనీషిసర్గమునిమార్తాండున్ దపఃకీర్తిల
క్ష్మీరమ్యున్ భువనైకవంద్యుఁ డగువాల్మీకిం గవిగ్రామణిన్
ధారాళస్థిరభక్తియుక్తిఁ దలఁతున్ దత్త్వజ్ఞచూడామణిన్. 131

శా. సంసారార్ణవపారగుం బరమహంసవ్రాతచూడాపదో
త్తంసంబున్ శ్రుతిసంకరోద్దళనపాథఃక్షీరభేదక్రియా
హంసంబున్ జగదేకవంద్యు జలజశ్యాము న్మహాపాతక
ధ్వంసాభారతు భారతామృతనిధిన్ వ్యాసున్ బ్రశంసించెదన్. 132

గణపయ—రాయసం. (సౌగంధికాహరణము.)

శా. అంతంతం గబళింపఁగాఁ గడఁగె బాలార్కున్ ఫలభ్రాంతి, వే
శంతోల్లంఘనకేళి దాఁటెను సుస్వంతున్, మహాదానవా
క్రాంతారామమహీరుహంబుల నుదగ్రక్రీడఁ ద్రుంచెన్, హనూ
మంతుండున్ గపియు న్నవిం గపులె సామాన్యాటవీచారముల్? 133

గౌరనకవి—(నవగ్రహస్తవము.)

ఉ. మ్రొక్కులయిక్క కాంతిగలమువ్వురువేల్పులమూర్తి చీఁకటిన్
మెక్కెడిమిత్తి పద్మములమేలు నవగ్రహరాజు మింటిపై
నెక్కెడుమానికంబు దినమేలిక సింహవిభుండు ముక్తిపెన్
జక్కెర యిందుమిత్రుఁడు ప్రసన్నత మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడిన్.

చ. హరుతలపూ చకోరములయాఁకని పాల్కడలిబ్బినాంగు శ్రీ
వరునిమఱంది తారకలవల్లభుఁ డింపిరతోడఁబుట్టు వం
బురుహముదాయ కల్పలతసోదరి యనంగునిమామ ఱేవిభుం
డరయఁగఁగర్కటేశుఁడమృతాంశుఁడు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్.

చంద్రమౌళి—(హరిశ్చంద్రకథ.)

చ. అలసత ట్రొంకు నాస్తికత యాయతచింత యయుక్తికారితా
కలనము దీర్ఘసూత్రము వికాసముఁ బొందమి దుర్వ్యయంబు పె

ల్లలుక నిరర్థకార్యరుచి యర్థమతచ్యుతి మంత్రహాని ప్రా
జ్ఞులవెలి శాంతసౌమ్యకృతిమాన్యత నా నివి రాజదోషముల్. 136

చిక్కయ—చందలూరి. (నాసికేతోపాఖ్యానము.)

సీ. అమృతోపమానంబు లగునన్నములతోడ
బహువిధశాకసూపములతోడఁ,
బాయసాపూపజాంబాలికంబులతోడ
విమలహయ్యంగవీనములతోడ,
షాడబంబులతో రసావళ్లతోడను
ఘనశర్కరాపానకములతోడఁ,
గదళికాద్రాక్షాది స్వాదుఫలంబులతోడ
వడియాలతోడఁ బచ్చడులతోడఁ,
గీ. ప్రకటముగ దుగ్ధమథితతక్రములతోడఁ
బ్రియము దళుకొత్త షడ్రసోపేతముగను
భాసురంబుగ నారగింపంగఁ జేసె
నారఘుక్షోణివిభుఁడు బ్రాహ్మణుల నెల్ల. 137

సీ. ప్రాలేయకిరణబింబస్ఫూర్తిఁ దలఁపించు
విశదంపుఁదనుకాంతి దిశలు ప్రాఁక,
జిగి నిండఁ దొలఁకెడుచిగురుటాకులసొంపు
వాటించుఘనజటాభరము మెఱయఁ,
గాంచనమౌంజీవికాసంబు గెడగూడి
చెలువు సూపుచు మృగాజినము దనరఁ,
గమనీయకోమలకరపయోరుహమునఁ
బ్రకటితం బగువిపంచిక దలిర్ప,
గీ. హరికథాలాపశోభిత మైనయట్టి
యాననమ్ము ప్రసన్నత నలరుచుండ

గగనముననుండి సమవర్తికడకు వచ్చె
నమరసంయమివరుఁడు విద్యాసురుండు. 138

సీ. బహువిధపరిమళభరితోదకంబులఁ
జెలువంబు శోభిల్ల జలకమార్చి,
నిండారుపండువెన్నెలసోయగము నవ్వు
పసిఁడికమ్ములవెల్లపట్టుఁ గట్టి,
కబరిభారంబునఁ గన్నెచెంగలువలు
పసమీఱఁ గొనలు దోఁపంగఁ జెరివి,
తీండ్రించు పసిఁడిదీధితులచే నమరెడు
నవరత్నమయభూషణములు దొడిగి,

గీ. మృగమదము గుంకుమంబును మేళవించి
గంధసారంబు మైదీగెఁ గలయ నలఁది
శ్రీలు మెఱయంగఁ బరిణయోచితముగాఁగ
సఖులు కైసేసి తెచ్చిరి చంద్రముఖిని. 139

సీ. రాజితరత్నదర్పణతోరణంబులఁ
గడు శోభితము లైనకలువడములు,
మానితకనకరంభాస్తంభపంక్తుల
భాసురోజ్జ్వలపతాకాసమృద్ధి,
నిర్మలస్ఫురితమాణిక్యకుంభంబుల
మెం డైనచిత్రంపుమేలుకట్లఁ,
బ్రకటితనూత్నమౌక్తికరంగవల్లుల
రమణీయపరిమళద్రవ్యసమితిఁ,

గీ. దనరు నగరంబు నుతనిరంతరవిభూతి
నతిశయంబుగఁ దగ నలంకృతు లొనర్చి
బహుపదార్థంబు లొకచోఁ గూర్చి పరిణయమున
కాయితము సేసి రంత నా రనుపమముగ. 140

సీ. లక్ష్మిఁ గొల్లాపురి లంక శాంకరి విశా
లాక్షిఁ గాశికను వింధ్యమున దుర్గఁ,
గన్యఁ గన్యాకుబ్జఁ గామరూపంబునఁ
గామాక్షిఁ గాంచిని గామకోటి
మండలిఁ బుండ్రక మాణిక్య దత్తవా
టమున నార్యావర్తకమునఁ ద్రిపురి,
జాలంధరంబున జ్వాల హేమచ్ఛత్ర
పురి మహాయోగ శ్రీగిరిని భ్రమర,
గీ. విరజవిరజహుంకృతిపీఠ[?]సింహ
ళమున నరసింహికను గాశ్మీరమున వాణి
నుజ్జయిని మహాకాళిని నున్నతముగఁ
జూచువారలు జముపురిఁ జూడ రెండు. 141

సీ. వర్ణితప్రాకారవప్రరత్నప్రభా
వ్యూహాకిమ్మీరితవ్యోమతలము,
వివిధవాదిత్రభైరవరావపూరిత
ప్రవిమానతరదిశాభాగసమితి,
బహుళదంతావళప్రాలంబఘంటికా
టంకృతోల్లాసిఘంటాపథంబు,
కమనీయరూపరేఖాకళావిభ్రమ
ప్రకటితాబ్జాననారత్నపేటి,
గీ. సహజధర్మార్థకామమోక్షప్రసిద్ధి
సన్నుతౌదార్యఖేలనాజన్మభూమి
సకలసంపద్విలాసవిస్తారహసిత
రాజరాజపురంబు వారణపురంబు. 142

## చౌడయ్య—గంగరాజు. (సాముద్రికశాస్త్రము.)

క. ఉదరంబు దర్దురోదర
సదృశం బై జఘన మతివిశాలం బైనన్
సుదతీరత్నంబున క
భ్యుదయంబుగ ధరణి యేలుపుత్త్రుఁడు వుట్టున్. 143

క. కడు నిడుదయుఁ గడుఁ గుఱుచయుఁ
గడు వలుదయుఁ గడుఁ గృశంబుఁ గడు నల్లనిదిన్
గడు దెల్లని దగు మెయి గల
పడఁతిని గీ డనిరి మునులు వరమునిచరితా! 144

## చౌడయ్య—గంగరాజు. (నందనచరిత్ర.)

సీ. కురులు వ్రాయుటయును గొదమతుమ్మెద లయ్యెఁ
గన్నులు వ్రాయంగఁ గలువ లయ్యె,
నధరంబు వ్రాసిన మధురబింబం బయ్యె
గళము వ్రాయుటయును గంబు వయ్యెఁ,
జనుఁగవ వ్రాసినఁ జక్రవాకము లయ్యెఁ
జేతులు వ్రాసినఁ జివురు లయ్యె,
నడుము వ్రాయుటయును నవలత యై యొప్పెఁ
బొలుపారఁ గటి వ్రాయఁ బులిన మయ్యెఁ,
గీ. దరుణితొడలు పాదతలములు వ్రాసినఁ
గరికరములు హల్లకములు నయ్యె
నేమి వ్రాయఁ దలఁచి యేమి వ్రాసితి నని
మదనవిభ్రమమున మనుజవిభుఁడు. 145

క. కులమున బలమునఁ జలమున
నలవునఁ గార్యమున సదృశు లగువారలతో

బలిమి యుడిగి సామముగాఁ
దలకొని చేయునది నీతితత్త్వజ్ఞులకున్. 146

గీ. దొడ్డముత్తియంబు తోరంపుఁబటికంబు
వెండిగుండు మొల్లవిరులచెండు
రసముగుళిక కప్పురంబునకరుడు నా
సొంపు మిగిలి వేగుఁజుక్క వొడిచె. 147

సీ. బచ్చెనయోవరి బంధాలమేల్కట్టు
సకినలమంచంబు జమిళిపఱుపు,
నిలువుటద్దము హరినీలపుగద్దియ
పటికంపుగిండి పాంబట్టుసురఁటి,
పసిఁడిపావలు వెండిపడిగంబు ముత్యంపు
జాలవల్లిక కెంపుసానబాయి,
పగడంపుదివియకంబము వజ్రములతట్టు
మరకతమయ మగుమధువుకుడుక

గీ. గరిగె పోఁకయొత్తు బరణి సున్నపుఁగ్రోవి
కప్పురంపుఁబెట్టె గాజుకోర
తనువు నునుపు గలుగుతడి యొత్తుమడుఁగులు
నాది యైనవాని నలవరించి. 148

చ. ముదిమికి మందు వాక్కలిమి [?] ముంగలిజిహ్వా తపఃఫలంబు స
మ్మదమునివాస మింపుగని మారవికారముప్రోది కామినీ
వదనవిభూషణంబు జనవశ్యము హాస్యరసాబ్ధి లాస్యసం
పదయుదరస్థలంబు మధుపానసుఖంబు జగత్త్రయంబునన్. 149

గీ. వికసితం బైనమోమున వెండికోరఁ
గదిసి మధు వొక్కయొత్తున సుదతి గొనిన
మగువ మొంగ మచ్చునను శశిమండలంబు
చెలువముగఁ జేసఁ బెట్టించు రేఖ్చినల్లు.

ఉ. వెన్నెలయూపుకప్పురపువేలుపువజ్రపుబొమ్మలెల్లఁ దాఁ
బన్నిన నొప్పులెప్ప మనఁ బంకజమధ్యమునందుఁ బొల్చి శ్రీ
గన్నుల బ్రహ్మఁ జూచి చిలుకం బలికింపుచు నున్నవాణి యు
ద్యన్నవశబ్దభావరసతత్త్వము మాకృతి కిచ్చు నెప్పుడున్.[?] 151

తిక్కన—(విజయసేనము.)

సీ. అరిమానసమ్ములు పరికొని యేర్చు నె
వ్వనియుజ్జ్వలాకారవైభవంబు?
బుధుల లజ్జానతిఁ బొందునట్లుగఁ జేయు
నెవ్వనిపాండిత్య మెసక మెసఁగ?
నెట్టిమాన్యుల నైన నెవ్వని వితరణం
బులు వంది (జనుల) చాపల మొనర్చు?
వనితాజనముమానధనముఁగొల్లవుచ్చు వి
చ్చలవిడి నెవ్వానివిలసనంబు?
గీ. అట్టివిజయసేను నభిరామమూర్తి వి
ద్యానిరూఢమతి వదాన్యవరుఁడు
మధురవిభ్రమైకనిధి యను జగమెల్ల
నతఁడు చిత్రగుణసమగ్రుఁ డగుట. 152

ఉ. అల్లనఁ గొండ మెత్తి శివునావలయేటిజలంబు వుచ్చి సం
ఫుల్లతఁ బాదపీఠకముపొంతన యున్నసహస్రనేత్రుపైఁ
జల్లి శివార్చనాకమలసంహతిఁ బ్రోక్షణ సేయునట్లు శో
భిల్లుగజాననుండు మదభీప్సితసిద్ధికరుండు గావుతన్. 153

శా. ఉత్సాహప్రభుమంత్రశక్తుల నజేయుం డై పరీక్షించినన్
దిత్సావ్యగ్రుఁడు గాక విగ్రహముచో దేశంబుఁ గాలంబు సం
పత్సామగ్ర్యముఁ జూపి శక్యము దెసన్ బ్రారంభి యై భూప్రజా
వాత్సల్యార్ద్రమనస్కుఁ డైన (పతి) శశ్వచ్ఛ్రీసమేతుం డగున్. 154

క. కిసలయకదళీబిసబిం
బసుధాంశుప్రాయవస్తుబహువిధరూపో
ల్లసము మద ముడుప నజుఁ డొక
యసమాకృతిఁ దాల్చె ననఁగ నంగన యొప్పెన్. 155

చ. కొనియెద మన్న బందరులు కోటుల కమ్ముగు; రమ్మఁ బూని తె
చ్చినసర కెంతపెద్దవెల చెప్పినఁ గొంద్రు తగంగ నిచ్చి; న
చ్చినవెలతీర్చి లక్ష్మి తమచెప్పినయట్టులచేయుసొంపు పే
ర్కొన గణుతింపరాదు; పురికోమటులం బ్రణుతింప నొప్పదే? 156

శా. గీర్వాణాచలసాను వాత్మరదనక్రీడాహతం బైన న
య్యుర్వీరంధ్రమునం దనంతఫణరత్నోద్యత్ప్రభ లుర్వి దృ
క్పర్వం బై పొడి గట్టి పేర్చిన మదిం గంబంబ యంచున్ కన
ద్గర్వోన్మీలితనేత్రుఁ డై మెఱయు వేదండాననుం గొల్చెదన్. 157

క. పరధనపరాంగనాజన
పరిహారముపరమధర్మపథ మందురు స
త్పురుషులు మఱవక వీనిం
బరికింపుము వినకు మెపుడు పైశున్యంబుల్. 158

సీ. మదనవశీకారమంత్రదేవత దృష్టి
గోచరమూర్తిఁ గైకొనియె నొక్కొ?
సితకరబింబనిస్సృతసుధాధార ని
తంబినీరూపంబుఁ దాల్చె నొక్కొ?
విధికామినీశ్రేష్ఠవిజ్ఞానపరసీమ
భాసురతనులీలఁ బడసె నొక్కొ?
శృంగారనవరసశ్రీవిలాసోన్నతి
సుందరాకారంబు నొందె నొక్కొ?

గీ. కాక యొకవధూటికడుపునఁ బుట్టిన
భామ కేల యిట్టిరామణీయ

కంబు గలుగు ననుచుఁ గన్నియ్యపై మహీ
పాలసుతుఁడు దృష్టి పఱపె నర్థి. 159

గీ. మహిమ చెడదు స్వా మ్యమాత్య సుహృ త్కోశ
రాష్ట్ర దుర్గ బలపరాయణులకు
నీవు నిదియు నెఱిఁగి కావింపు సప్తాంగ
సంగ్రహంబు నీతిశాస్త్రనిపుణ! 160

తిప్పరాజు—కుడిచెర్ల. (కాంచీమాహాత్మ్యము.)

గీ. అరుణమణిదీప్తు లంతంత నతిశయిల్ల
విమలశశికాంతరోచులు విస్తరిల్లఁ
గావ్యబుధగురుసంగతిగలిగి పురము
సూర్యసోమవీథులు కడు సొంపు మిగిలె. 161

గీ. కనకభూధరశిఖరానుకారు లగుచు
నాపురంబున నొప్పారు గోపురములు
సంతతాధ్వగమనపరిశ్రాంతు లైన
చంద్రసూర్యులవిశ్రమస్థలము లట్లు. 162

మ. జ్వలదగ్నిప్రథమానతేజుని భరద్వాజున్ వినిర్ధౌతవ
ల్కలభాస్వత్పరిధానుఁ బింగళజటాలంకారుఁ గృష్ణాజినో
జ్జ్వలసంవ్యానుఁ దపఃకృశీకృతతనున్ శాంతాత్ము బ్రహ్మైకని
శ్చలచిత్తున్ విజితేంద్రియున్ బ్రముదితస్వాంతున్ గృపావంతునిన్.

సీ. పద్మరాగప్రభాభాసురపటల మ
కాలసంధ్యారాగలీలఁ బెనుపఁ,
గాశ్మీరకనకనిర్గతదీప్తి యసమయ
బాలాతపస్ఫూర్తిఁ బరిఢవింప,
హరినీలరుచులు గస్తురిప్రోవులును నవా
రంభసీలాభ్రవిభ్రమముఁ జేయ,

వజ్రమౌక్తికహీమవాలుకాదీప్తులు
నిర్నిశాచంద్రిక నిర్వహింపఁ,
గీ. జతురబహువర్ణపట్టవస్త్రప్రభాతి
నిర్జలదజాలసముదీర్ణనిర్జరేంద్ర
చాపలక్ష్మి రచింపఁ బ్రశస్త (దీప్తి)
(వి)తతి నొప్పారు నప్పురి విపణివీథి. 164

సీ. మహనీయతరయాజమాన మంత్రంబులు
జపియించుముఖచతుష్టయము దనరఁ,
బావననవనీత పరిలేపనంబున
మెఱుఁ గెక్కియున్నకుప్మేను వెలుఁగ,
బహుచిత్రమృదుసూక్ష్మపక్ష్మశోభిత మైన
హరిణాజినోత్తరీయంబు మెఱయ,
శ్రీవత్సలాంఛనశ్రీమూర్తిచింతన
సంభృతానందబాష్పములు దొరుగ,
గీ. శారదాదేవి, సావిత్రి, శ్రద్ధ, తుష్టి,
మతియుఁ, గుశసూత్రకాంచిదామములు పెట్ట
నెమ్మిఁ గొలువంగ దర్భాసనమ్ముమీఁదఁ
జూడ నొప్పెఁ బితామహసోమయాజి. 165

ఉ. సహ్యముఁ గాంచె వాణి వనసైరభ సామజ సింహ గండకా
సహ్యము సిద్ధసాధ్యసురచారణకిన్నరసన్మునీశ్వర
గ్రాహ్యము శృంగసంశ్రితకిరాతవధూశ్రుతదివ్యయోషిదై
తిహ్యము నగ్రభూసుఖితతిగ్మమయూఖరథోపవాహ్యముఁ. 166

తిమ్మయ—కుంటముక్కల. (శైవాచారసంగ్రహము.)

సీ. కపిలవర్ణముగోవు కడు నొప్పు నంద నా
జనియించెఁ దద్గర్భమున విభూతి,

నల్లని మొసవు వర్ణన కెక్కు భద్ర నాఁ
దద్గర్భమున భసితంబు పుట్టె,
నెఱ్ఱనిధేనువు నేపారు సురభి నాఁ
గలిగె భస్మంబు తద్గర్భమునను,
పొగ(డ)చాయ గలయావు పొలుచు సుశీల నా
క్షారంబు గలిగెఁ దద్గర్భసరణిఁ,
గీ. జిత్రతరవర్ణరుచులు ప్రసిద్ధిఁ దాల్చు
గిడ్డి సుమనోభిధాన మంగీకరించుఁ
బ్రభవ మొందెఁ దదీయగర్భమున రక్ష
పంచముఖముల ని ట్లుద్భవించె భూతి. 167

త్రిపురాంతకుఁడు—రావిపాటి. (అంబికాశతకము.)

ఉ. ఆదిమశక్తి యీతరుణి యాద్యకుటుంబిని యీకుమారి ము
త్తైదువ యీతలోదరి చిదాత్మక యీసతి విశ్వమాత యీ
పైదలి సర్వలోకగురుభామిని యీచపలాక్షి యంచు బ్ర
హ్మాదులు వచ్చి నిచ్చలు హిమాద్రికి ని న్నెఱిఁగింతు రంబికా! 168

ఉ. కూడెడువెండ్రుకల్ నిడుదకూఁకటఁ బ్రోవుగ బొడ్డుపై వళుల్
జాడగ దోఁపఁ గొమ్మెలుకచన్నులు మించు దలిర్ప సిగ్గునన్
జూడఁగ నేరముల్ మెఱుఁగుఁజూపుల నీన హిమాద్రియింట నీ
వాడుటశాలికిన్ మనమువాడుటగాదె తలంప నంబికా! 169

ఉ. భారతి వై సరోజభవుపాల వసించి రమావధూటి వై
నీరజనాభుఁ జెంది ధరణీధరనందన వై మహేశ్వరుం
గోరి వరించి తమ్మ! నినుఁ గొల్వక యూరక యేల కల్గు సం
సారసుఖంబు లీమనుజసంతతికిం దలపోయ నంబికా! 170

## త్రిపురాంతకుఁడు—(ఉదాహరణము.)

ఉ. పాములు హారముల్ సెలయుఁబాఁపటసేసయు సేఁబు మల్లికా
దామము తోలు దువ్వలువు దట్టపుబూదియుఁ జందనంబు పై
సామునఁ జాల నందముగ సన్నిధి సేసినజాడఁ గంటి నే
నామదిలోఁ గుమారగిరినాథుని శైలసుతాధినాథునిన్. 171

## త్రిపురాంతకుఁడు—(తారావళి.)

మ. అమితధ్వాంతతమాలవల్లిలవనవ్యాపారపారీణదా
త్రము సౌగంధికషండకుట్మలకుటీరాజీసముద్ఘాటన
క్రమనిర్వాణధురీణకుంచికయొ నాఁగం బెంపున న్నీకళా
రమణీయత్వము చూడ నొప్పెసఁగుఁ జంద్రా! రోహిణీవల్లభా! 172

మ. చరమక్ష్మాధరచారుసింహముఖదంష్ట్రాకోటియో నాఁగ నం
బరశార్దూలనఖంబు నాఁగఁ దిమిరేభప్రస్ఫురద్గర్వసం
హరణక్రూరతరాంకుశం బనఁగ నుద్యల్లీల మీరేఖ ని
త్యరుచిన్ బోల్పఁగఁ బెంపగున్ విదియచంద్రా! రోహిణీవల్లభా! 173

మ. పొలకయ్యంబులఁ గల్గుముద్దుటలుకన్ బుష్పాయుధారాతి మ్రొ
క్కులఁ దీర్పన్ దలమీఁదఁ గాన నగునీక్షుమ్మేను పుణ్యాంగనా
తిలకం బైనభవానిపాదనఖపంక్తిం జెంద డెందంబులోఁ
దలఁతా చుక్కలతోడిమక్కువలు చంద్రా! రోహిణీవల్లభా! 174

మ. రతినాథుం డనుమాయజోగి చపలం త్రైలోక్యవశ్యాంజనం
బతియత్నంబునఁ గూర్చి మౌక్తికమయం బైయున్న పాత్రంబునన్
మతకం బేర్పడఁ బెట్టి దాఁచె నన నీ మధ్యంబునన్ మచ్చ సం
తతమున్ గన్నులపండు వై వెలయుఁ జంద్రా! రోహిణీవల్లభా! 175

## దుగ్గన—దగ్గుఁబల్లి. (నాసికేతోపాఖ్యానము.)

సీ. పాండ్యకేకయచోళబర్బరపాంచాల
బంగాళలాటనేపాళగౌళ,

గాంధారసౌవీరకాంభోజకాశ్మీర
హైహయాభీరబాహ్లీకవిదేహ,
మగధమద్రవిదర్భమాళవకేరళా
శ్మంతకకుంతలమత్స్యవత్స,
కరహాటవరహాట కర్ణాట శకలాట
కుకురకోసలకాశకురుకరూశ,
గీ. సుహ్మసౌరాష్ట్ర ఘూర్జరశూరసేన
చేదిసింధుయుగంధరచేకితాన
యవనబహుధానమలయాలకాంగవంగ
తెంకణాంధ్రకళింగాది దేశములకు. 176

దుగ్గన—దగ్గుబల్లి. (శివకాంచీమాహాత్మ్యము.)

సీ. క్షోణి నభంబులు సూత్రించిన ట్లింద్ర
చాపంబు చాపమై సంఘటింప,
బ్రహ్మాండభాండంబు పగిలించుగర్జలు
సింహనాదస్ఫూర్తిఁ జేయుచుండ,
సౌదామనీదామజాలము ల్దిక్కుల
స్వప్రతాపానలజ్వాలలుగను,
నాహార్యహారిణోద్యదశనిసంఘంబులు
దివ్యాస్త్రవితతులు తేజరిల్ల,
గీ. నాశుశరవృష్టిశరవృష్టి నఖిలలోక
బాధకోద్రిక్తభీష్మశుంభత్ప్రతాప
మార్చె నర్జునయుతశిఖండ్యభివర్ధ[?]
నాఖ్యవర్ష ర్తునారాయణాఖ్యమూర్తి. 177
సీ. బంధూక మడరించెఁ బరపయ్యె గేదంగి
కడిమి పుష్పితమయ్యె గ్రంథి పూచె,

నర్జునం బలరాతి నరసింహములు కేశి
భూస్థలి నేఱులు పుక్కిలించె,
గండూపదము లుబ్బఁ గలఁగె హంసచయంబు
నటియించెఁ గప్పలు నమిలి చెలఁగెఁ,
జాతకంబులు మించె సాగరం బెడయించె
హరిగోపములతోడ నాడె లేళ్లు,
గీ. మత్తభృంగంబులకుఁ దేనె రిత్త యయ్యె
గండుఁగోయిల కూఁతలు గట్టుకొనియె
చూలుకొన స్వాతి చూటిఁబోదువ[?]
విష్ణునకు నిద్రపోయెడువేళ యయ్యె. 178

## దేచిరాజు—రాపరది. (గ్రంథమేదో?)

మ. ఘనవప్రోపరిభాగకేతుకపటన్ గంజారిబింబంబు కం
దిన దంచున్ బురిముగ్ధభామినులు ప్రీతిన్ గందు వోఁ దోమఁ జం
దన మర్థింగొని లీల నీలరుచిమత్కాంతోరుహార్మ్యంబు లె
క్కిన నంభోదతటిల్లతావితతమాడ్కిం బొల్తు రవ్యగ్రతిన్. 179

## దేవరాజభట్టు—(హరిశ్చంద్రకథ.)

ఉ. అంబుధు లాలవాలము దిగంతము లాకులు కూర్మశేషవ
ర్ష్మంబులు కందమూలములు చక్రపుఁగొండలు కోట నాఁగ హ
ర్షంబున విష్ణువిగ్రహకుజంబునఁ జుట్టి పెనంగి మిన్ను పు
ష్పంబుగ నబ్జజాండ మనుపండును బండు ధరిత్రి వల్లి యై. 180
చ. సురనిచయంబు ద్రోచి నహుషుం డటు లేలక యున్న రాక్షసు
ల్వొరసల వచ్చి చూఱకొని వాసవు వెట్టికిఁ బట్టు కున్న శ
ర్వరి గనుమాయఁ గన్నఁ ద్రిదివం బనునారడి నల్పజీవ మై
యరుగక భూమి నున్న నమరావతి యీడగు నయ్యయోధ్యకున్. 181

నరసింహభట్టు—ఆమడూరి. (షోడశరాజచరిత్ర.)

శా. జంఘాలప్రతిభాను లార్షకవితాసంఘాతు లాశుక్రియా
సంఘుప్రష్టలు సంఘశీకలశజుల్ సాహిత్యసర్వంకషుల్
సంఘర్షార్హులు కాక కాకవులు లక్ష్యంబే హాలిగ్రామఘా
ణంఘాణైకశరణ్యబల్బజ[?]నిబంధల్ మత్కుటాక్షేక్షకుణ[?] 182

నాగనాథుఁడు—పశుపతి. (శ్రీవిష్ణుపురాణము.)

ఉ. మాసర మయ్యె నంత మధుమాసము పాంథవిలాసినీజన
త్రాసము పుష్పబాణనవరాజ్యవిలాసము వల్లరీవధూ
హాసము మత్తకోకిలసమంచితపంచమనాదమంజిమ
వ్యాసము జీవలోకహృదయంగమసౌఖ్యవికాస మెంతయుణ. 183

నన్నిచోడఁడు—(కళావిలాసము.)

క. తలపోయఁగ రుచు లాఱును
గలుగును వాతంబుఁ గ్రిమియుఁ గఫముం జెడు నాఁ.
కలి పుట్టు దగయుఁ జెడుఁ ద
మ్ములము పదార్థంబు రోగమూలము ధరణిణ 184

చ. తొడవులు పెట్టి సంభ్రమముతోఁ దిలకించు మడుంగు గట్టుఁ బై
పడఁ చడ వోప దిం పెటిఁగి పట్టును నేర్పులు గట్టిపెట్టుఁ బ
ల్కెడు నెడఁ దొట్రుపా టొదవుఁ గింకకుఁ జేగిలు, మేణ సమర్పఁగాఁ
జిడిముడి బొందుఁ గాంత పతిఁ జేరినఁ గూరిమి గల్గె నేనియుణ. 185

సీ. పృథులవిశ్వంభరారథమున కెదురుగాఁ
బూన్పించె నెవ్వాఁడు పువ్వుఁదేరు?
కాంచనాచలకార్ముకమునకు సాటిగాఁ
జేపట్టె నెవ్వాఁడు చెఱకువిల్లు?

నవిరళపాశుపతాస్త్రమ్మునకు వాఁడి
మిగిలించె నెవ్వాఁడు చిగురుఁదూపు?
నతులితామరదానవాదిబలంబుల
గెలిపించె నెవ్వఁ డయ్యళిబలంబు?
గీ. నట్టిజగజెట్టి మన్మథుం డఖిలలోక
ములకు వెఱఁగొంగ జీవులమూలకండ
యతనియిలు సొచ్చి వెడలనియతఁడుఁ గలఁడె?
యతనియమ్ములఁ బడకున్నయతఁడుఁ గలఁడె? 186
క. శ్రీమంతుఁడు గుణవంతుఁడు
ధీమంతుఁడు రూపయుతుఁడు ధీరుండు కళా
ధాముండును గావలయును
దా మహిఁ గాముండు కామతంత్రవివేకీ! 187

పద్మకవి—(జినేంద్రపురాణము.)

సీ. హరినిలయంబును హరినిలయంబును
విషధరాఢ్యంబును విషధరాఢ్య,
మప్సరోమయమును నప్సరోమయమును
వనవిలాసమును బావనవిలాస,
మున్నతకరిశ్రేంగ మున్నతకరిశ్రేంగ
మిందుకాంతప్రవ మిందుకాంత,
మురుకలనకులంబు నురుకలనకులంబు
నంశుకాంతద్యోతితాంశుకాంత,
గీ. మొనర నవశతసాహస్రయోజనోన్న
తమును బదివేలుయోజనా లమరువలము
గలిగి కనకాద్రి కిన్నాటఁ గలిగి తనరి
ప్రథితమై యొప్పు మందరపర్వతంబు. 188

## పెద్దిరాజు—పొన్నాడ. (ప్రద్యుమ్నచరిత్ర.)

సీ. అమృతంబులోనికందంతయుఁ బోఁదోమి
 కొని పూర్ణచంద్రుండు దనరెనేని,
విధుమండలంబున విధిచేత దళవంబు [?]
 గని పూవుఁదూపులు వ్రాలెనేని
శృంగారరససరసీజాతు లైనకో
 మలమృణాళంబులు వొలిసెనేని
పసిఁడికుంభములకు బ్రభవించి మించు జ
 క్కవకవ బోదలు గలిగెనేని,
గీ. మెలఁతనెమ్మోము చెన్నున మించవచ్చుఁ
బొలఁతిచూడ్కుల పొలపంబుఁ బోలవచ్చు
నింతిమృదుబాహువుల దొరయింపవచ్చుఁ
జెలువచనుఁగవ జిగి సరిసేయ వచ్చు. 189

శా. అవ్యాయామపురారు లక్షుభితపారావారు లక్షీణపు
ణ్యవ్యాపారసురేంద్రు లగ్రహణచంద్రాదిత్యు లస్థావర
ప్రవ్యక్తామరభూరుహంబు లచతుర్భావానన బ్రహ్మ లా
దివ్యద్వారవతీపురిం గలుగు ధాత్రీపాలు రెల్లప్పుడున్. 190

చ. ఇతవులయందు నెల్లతన మేపును సొంపును మవ్వమున్ జిర
స్థితిఁ జెలువొందనో చివురుసేనలకున్ జెనుప్రాపుగా సమా
తతమ్ముగఁ బెక్కు నిక్కడలు దాల్చినమాధవలక్ష్మియో యనన్
సతతము నొప్పెఁ జూడఁ బురనందనసుందరపాదపావళుల్. 191

చ. ఇలకు నుపేంద్రుతోఁ దగిలి యీశుఁడు వేల్పులపిండు వెండిగు
బ్బలికిని బైఁడికొండకును బాలెము నిచ్చలుఁ జేయు చంద్రసూ
ర్యుల నిలఁ దెచ్చిరో యనఁగ నొప్పగునప్పురి హేమరత్నమం
డలిఁ దగి నాగభోగపరిణాహము లయ్యెడి దేవగేహముల్. 192

సీ. కమనీయచిత్రసంగతగతిక్రమముల
దిగ్గజాదులనడ ధిక్కరించి,
లాలితగంభీరలఘుతరప్లుతముల
హరిణసంఘంబుల నపహసించి,
సవ్యాపసవ్యసంచరణమహోద్ధతిఁ
బంచాననక్రీడఁ బాడిచెఱిచి,
మహితనిరాయాసముద్యాజవంబుల
ననిలప్రయాణంబు నతకరించి,
గీ. సముచితాస్వర్థపూర్ణవేగములచేతఁ
గెరలి వచ్చి తలంపులఁ గిక్కరించి
హేతిమాడ్కి నుప్వరముల నెసక మెసఁగి
పంచధారలఁ గలహయపంక్తు లడరు. 193

మ. కలయం గాడ్పునఁ దూలి పుష్పొడి దివిం గప్పందు మాయందు వే
డ్కల నారామరమావసంతులఁ గడంకం బెండ్లి సేయించుచో
వెలయం బట్టినయుల్లభంబుపగిదిన్; వేమాఱుఁ దద్భూమిపైఁ
జెలువొందింపుచు రాలుఁ బుష్పవితతుల్ చేకొన్నప్రాలో యనన్.

క. కోటలతుద మకరప్రభ
దీటుకొనం బర్వి పరులదృష్టికి నొప్పున్
పాటించి మేయ దివి రవి
ఘోటకముల కజుఁడు పసురుకొలిపినభంగిన్. 195

సీ. గజయాన మెలఁగినగతి యైనఁ బైపడ
గద్దించి తర్కించి కలఁక నొందు,
మానిని యల్గినమాడ్కిఁ దోఁచినఁ దేర్ప
నుంకించి భావించి యుమ్మలించుఁ,
జపలాక్షి కెమ్మోవిఁ జవిగొన్నయ ట్లైనఁ
జెమరించి చర్చించి చిన్నవోవు,

మదవతి కౌఁగిలి గదిసినయ ట్లైనఁ
బులకించి తేటి సంచలత నొందుఁ,
గీ. దన్ను నాఁటిసినఁ గోర్కులు తెసులుగొలుపు
నోలిఁ దనలోన నన్నరపాలసుతుఁడు
మాన మూఁటాడ గంభీరమహిమ సడల
లజ్జ గడివోవ ధైర్యంబు లావు డిగఁగ. 196
క. ద్విజకుశ్రూషాపరవశు
లజనితపరివాదు లభినవాక్పతులు[?]మహా
సుజనచరిత్రులు ధీరులు
భుజవిక్రమధనులు ఘనులు పురిశూద్రజనుల్. 197
సీ. నెలఁతుకచూడ్కి వెన్నెల గాసినఁ గుమారు
వీక్షణాంభోనిధి వెల్లివిరియఁ,
బతిచూడ్కి తామరల్ పరువంబు నొందఁ దో
య్యలిచూపు టలులు చిట్టాడుచుండ,
సుదతిచూ పమృతంపుసోన యై కురిసిన
వరుదృష్టి యనిమిషత్వమునఁ బొంద,
నధిపుదృష్టి ప్రవాహంబు పెల్లడరిన
నింతిదృక్మీనంబు లీఁతలాడ,
గీ. వరుసఁగౌతుకకల్లోలవలన మొలయ
రాగమకరందమత్తత ప్రజ్వరిల్ల
సంచితధ్యాన మనుప్రకాశము తలిర్పఁ
జిఱుతసి గ్గనువలలోనఁ జిక్కువడక. 198
సీ. పరువంపువిరులపైఁ బొరసి యొండొకవనం
బులసౌరభంబులఁ బొరపుసేయుఁ,
బక్కువాసినపువ్వుఁబడుపుతోఁ జెరలాడి
యిలకు నేవ్యంకంబు లలవరించుఁ,

గ్రొవ్విరులను దిరుగుడువడి పుష్పాడిఁ
దలిరాకులకు వింతచెలు వొనర్చుఁ,
దనుపారఁ గొలఁకులఁ దగ నాడి వనకేళి
జనులపైఁ బులకలఁ జాదుకొల్పుఁ,
గీ. చేరి మకరందములఁ దొలఁకించి మించి
మొనసి లేఁదీగెలకుఁ జిఱు ముసుగు గురియ
నప్పురారామముల నెల్ల నలసగతుల
మలసి సొంపారు నింపారుమారుతంబు. 199
క. పురగోపురశిఖరంబులఁ
గర మరు దైన పద్మరాగకలశము లనురుచ్
చరమాచరమాద్రులపై
సరిఁ బున్నమఁ దోఁచుసూర్యచంద్రులభంగిన్. 200
సీ. బహువర్ణరత్నప్రభాతతి దివికి నొ
ప్పుఁగ వసంతశ్రీవిభాతి గాఁగ,
నగ్రస్థితాంగనాస్యామోదములు దివ్య
సరిదబ్జములకు వాసనలు గాఁగ,
రమ్యస్థలములు నిర్జరులచూడ్కికిఁ గొమ
రా [?] గదాకరములలాగు గాఁగ,
రజతకుట్టిమకాంతి రాజరోచుల కెదు
రరుగుచుట్టపుఁబిండువరుస గాఁగ,
గీ. సరసలీలావిలాసవిస్ఫురణ గలుగు
రమణిరమణులచే నిప్డు గొమరు మిగిలి
పొడవు సొబగును గలిగి యప్పురమునందు
భర్మనిర్మితహర్మ్యము ల్పేర్మి నడరు. 201
మ. బహువస్తుక్రయవిక్రయక్రియలు సంపత్ప్రాప్తికై కాకయున్
విహితాచారము లైనచందముల వర్ణింపంగ నెంతెంత నా

మహిలో రా దని చెప్ప నొప్పుదురు ధీమంతుల్ కుబేరాధికుల్
మహిమోదాహరణంబు లప్పురముకోమ ల్లెల్ల లక్ష్మీస్థితిన్. 202

సీ. బ్రాఁతియే యిఁకఁ గల్గు లేఁతవెన్నెలనిగ్గు
లుగ్గువెట్టెద నీకు నూరకుండు,
మునుపుగా నీకిత్తు మురుపువెన్నెల సోఁగు
సంతసంబున నుండు జాలి మాని,
వేగిరింపకు నీకు వెలఁదివెన్నెలక్రొవ్వు
గుడిపింతుఁ జిన్నారికడుపు నిండ,
నిట్టిముచ్చట వాయ నీఁదింతుఁ బండువె
న్నెలవెల్లిఁ బలుమాఱు నిన్నుఁ జేరి,
గీ. కూయకుండు మీరు సంతుష్టిఁ గూరినపుడు
శీతలం బగువెన్నెల చిగురుఁబొన్ను
నందు నిడి నిద్రవుచ్చెద ననుచు నాద
రించె బిడ్డల నొకచకోరీపురంధ్రి. 203

సీ. మించినగతులు సాధించి యింద్రునికి మా
ర్కొని యున్నకా ల్గలకొండ లనఁగఁ,
చేతనత్వంబులు చేకొని రవికిఁ గొ
మ్ములు చూపుచీఁకటిమొన లనంగఁ,
జే కల్గి యలుల కనేకదానము లిడ
మెలఁగుతమాలభూమిజము లనఁగఁ,
జిత్రరథోధర్యసిద్ధు లై [?]గాడ్పుతో
మోహరించిన కారుమొగులు లనఁగ,
గీ. నెల్లచందంబులను కడు నెసక మెసఁగి
పొగడు నెగడును బడసి యప్పురిఁ జరించుఁ
దమ్ముఁ జూచిన సిరియుఁ బుణ్యంబు నొసఁగఁ
దావలం బైనభద్రదంతావళములు. 204

గీ. రత్నగర్భగర్భరత్నంబు లవ్వీట
నర్థిఁ బుట్టుచుఁ గొనియాడ మరగి
వీథి వీథి నెపుడు విలసిల్లు నా నాప
ణముల వివిధరత్నసమితి వెలుఁగు. 205

గీ. రాయుచున్న ఘనపయోధరములు గలిగి
నడుము లోకకొంత బయ లయి బెడఁగు మిగిలి
చూడ నొప్పారు రేఖలసొంపు మెఱసి
కోటకొమ్మ లమరు వీటికొమ్మలట్లు. 206

చ. లలితలతాంతపల్లవకలాటు ఫలాంకితభూజరాజి సం
కులబహుచిత్రవర్ణపటకూటకుటీపటలంబుగా లతా
మిళితవిలాసు లై చెలువుమీఱుఁ బురీవనముల్ జగజ్జయా
కలితరమాభిరామనవకామమహాశిబిరంబులో యనన్. 207

శా. లీలం గాముని నోముఁ బోవు నెడఁ గేళీనందనం బెంతయున్
జాలన్ వాసన కెక్కు, నొండొరువు లోజం బల్కుచోఁ జిల్కపిం
డాలో నాల్కలతోక్కుఁ దక్కుఁ, జని నీరాడంగ నంభోజినీ
రోలంబంబులు చొక్కు, వీటిసతులన్ రూపింప సామాన్యమే? 208

సీ. వలరాజు వోసినవిలునారువోలె బం
ధురము లగుచెఱకుఁ దోఁటలకును,
నలువచేఁ బెరిగి దీనుల కీగి యును లేని
కల్పకంబులు వోనిక్రముకములును,
మాధవుం డేదిన మవ్వపుఁబొరలయే
డైఱ నివ్వటిలునాకుఁదీగెలకును,
పర్జన్యసత్కృతిఁ బసిఁడి పండెడుచేల
నంగఁజేర్చినరాజనంబులకును,
గీ. దెట్టుపలు గట్టి నీటితోఁ దేలిపాఱు
తమ్మిపుప్పొళ్లఁ బ్రోను లై తనరుచుండు

సనిస నవ్వీటిచెఱువుల యతిశయంబుఁ
బుడమిలో నింక నేమని పొగడవచ్చు? 209

ఉ. శీలములీల, లంగములుచేకొని క్రాలెడువేదముల్, కలా
జాలము మన్కిపట్లు, యతిసజ్జనసంపదతిట్ట, లర్థిపూ
జాలలితప్రభావములు, ... ... ...
వేలుపుఁబిండుపండువులు, వీటు ఘరామరు లుత్తమస్థితిన్. 210

పెమ్మన—భావన. (అనిరుద్ధచరిత్రము.)

గీ. అన్నిదినములు నీభంగి నఖిలలోక
సమ్మదావహ మై మహోత్సవము జరుగ
నుత్తమక్షత్రవిహితశాస్త్రోక్తసరణి
శాంతవిఘ్న మై పెండిలి సంపతిల్లె. 211

గీ. అభినవము లైనముక్తాఫలాక్షతములు
హస్తపంకేరుహముల నిండారఁ బట్టి
జాణజగజెట్టి యగుపంచబాణుపట్టి
చేరి నించె నుషాదేవి శిరముమీఁద. 212

క. అభిషేకోత్సవలీలా
విభవానంతరమునందు వెన్నునిమనుమం
డభినవవిలేపనాంబర
విభూషణస్రక్కలాపవిభ్రాజితుఁ డై. 213

సీ. అర్జునప్రీతియు నర్జునఖ్యాతియు
నిగిడింప మగిడింప నేర్పుగలిగి,
యక్రూరచరితంబు నక్రూరదురితంబు
భూషింప దూషింపఁ బొం దెఱింగి,
కుబ్జావలేపంబుఁ గుబ్జావరూపంబు
ఘరియింప విరియింప వెరవు గలిగి,

గోపాలచయమును గోపాలభయమును
బాలింపఁ దూలింపఁ జాలి వారి,
గీ. వారి కెదిరినరిపువీరవరుల నమర
మానినీహారనాయకమణులఁ జేయఁ
బటుపరాక్రమకేళిసంపదలఁ బొలిచెఁ
దరమె వర్ణింపఁ గృష్ణాభిధానవిధులు? 214
చ. అసమవతంసనీలజలజాకృతిఁ గైకొని యొప్పె నెంతయు
న్విసృమరహోమధూమములు నిర్భరలీలమెయిన్ హవిర్మయీ
కిసలయలాజసౌరభవికీర్ణసమస్తదిశాముఖంబులై
కుసుమశరాసనాత్మజునకున్ రజనీచరరాజపుత్రికిన్. 215
క. ఆంగిరస భార్గవులునుం
జెంగట మంత్రంబు సెప్ప శ్రీపతిమనుమం
డంగనగళమునఁ గట్టెను
మంగళసూత్రంబు సర్వమంగళయెదురన్. 216
క. ఆసాయ మాప్రభాతము
వాసరయామినులు హృదయవర్ధితరాగ
వ్యాసంగంబునఁ దరుణియు
రాసుతుఁడు భజించి రెల్లరతిసౌఖ్యంబుల్. 217
గీ. ఇగముచే నంబరం బెల్ల నివముకొనఁగ
నుష్ణకరుఁడును గరము లొయ్యొయ్యఁ జాఁచి
తాను ననలాశఁ జరియింపఁ బూనె ననిన
నెంత యనవచ్చు నింక హేమంతమహిమ? 218
సీ. ఇరులు దర్పము మానఁ దిరముగా మంత్రించి
జగముపై నడరినజడ నడంచి,
జలజాతగృహములతెలుఁపు లొయ్యనఁబుచ్చి
మెలపుమైఁ దేఁటుల మేలుకొలిపి,

సొంపున మెఱుఁగారుచుక్కలఁ బోఁజాగి
పేర్చుకైరవములబింక మడఁచి,
రజనికిఁ బతి యైనరాజు మై కందించి
చక్రవాకముల కుత్సవము నొసఁగి,
గీ. దెసల కెసకంపుఁ దెలుపులు దీటుకొలిపి
సకలజంతులు మోహసంజనకలీల
చనదు రుచిరారుణాంశులు వినుతి కెక్క-
నుదయధరణీధరముమీఁద నొప్పె నినుఁడు. 219
సీ. ఉచ్చైశ్శ్రవంబును, సురుమదసురభిక
పోలపాళీవిలోలాళికలర
వాన్వితస్మై వాలునభ్రశుండాలంబు
వాహనంబులు, వీరవైరిభీష
ణాంశుల మించునూఱంచులకైదువు,
కొమరారు పరివార మమరగణము,
పట్టణదేవియుఁ బౌలోమి, యీగతి
నెల్లభోగములకు నెల్ల యగుచు,
గీ. విలసదమరీకరాంభోజవీజ్యమాన
చామరానిలసంచారచలితచారు
చికురభారుఁడై చూడఁగఁ జెలువు మిగిలె
వేయుఁగన్నుల నింద్రుఁ డీవిభుఁడు తరుణి. 220
సీ. ఉదయార్కరుచిఁ బోర నొలిచికొన్నట్టిమా
వ్వమునఁ జెంగావిగోవణము మెఱయ,
వెన్నెల జరిగొన్నవిద్యుల్లతలమాడ్కి-
యజ్ఞోపవీతంబు లఱుతఁ బొలయ,
నను కైనకుసుమఁ బెట్టినపల్లవంబుల
చాయ సన్నపుగుజ్జుజడలు గ్రాలఁ,

గందువోఁ జనలేటఁ గడిగినళశిరీతి
నెడకేల ముత్తెంపుగోడగు దనర,

గీ. జగతిఁ దనుకాంతి యసమయచంద్రికావి
భాతిఁ బ్రసరింప దివినుండి పార్థివేంద్రు
కొలువునకు వచ్చె సభయెల్ల నెలమిఁ జూడ
నారదుఁడు సర్వలోక విహారశీలి. 221

సీ. ఉప్పరం బెగయంగ నొదవినవెరవున
నడిసన్నరోహణశైల మనఁగ,
వినతాసుతాకృతి వినువీథి ప్రబ్బి
బాలభానుప్రభాపటల మనఁగఁ,
జైతన్యసంపదాస్పదభాతి దివిఁ బర్వు
శాతమన్యవచాపభూతి యనఁగ,
జలధి నుండక మింటఁ జరియించుటకుమూర్తి
బొలుపు దాల్చినరత్నపుంజ మనఁగ,

గీ. వివిధమండనభవవిభావిభవజటిల
నిఖిలదిక్చక్రనాళుఁ డై నిరుపమాన
జవసముల్లాసగగనసంచారగరిమ
చెలువు నెలవయ్యె నప్పు డప్పులుఁగుఱేఁడు. 222

సీ. కమనీయవప్రసంకలితనానారత్న
ధామకిమ్మీరితవ్యోమతలము,
సౌధాగ్రవిహరణాసక్తబింబాధరా
విజితఖేచరవధూవిభ్రమంబు,
లీలావనీపుష్పలోలాలికలనాద
రచితమన్మథధనుర్జ్యారవంబు,
పరిఖాంబుపరివర్తకరవిడంబితవార్ధి
సంచారిజీమూతసంచయంబు,

గీ. మహితవితరణనృపతికుమారతిలక
హసితగీర్వాణసర్వంసహారుహంబు
విపులసౌభాగ్యపుష్పలావీవిలాస
కలితరథ్యాంతరము ద్వారకాపురంబు. 223

సీ. కరిముఖుండు లిఖించెఁ గల్యాణలేఖలు
కనకపట్టికల లోకముల కెల్ల,
వివిధశిల్పానల్పవిన్యాసరచనల
వేది శృంగారించె విశ్వకర్మ,
కైసేసి యప్సరఃకాంతాజనంబును
బెరిమతో నేతెంచెఁ బేరఁటంబు,
పంచమహాశబ్దభరిత మై విలసిల్లె
నంకురార్పణమహోద్యమవిభూతి,

గీ. భార్గవుఁడు దానవాన్వయప్రథమగురుఁడు
కాలసంసిద్ధికై నిల్పె గడియ (కొడుపు)
(శాస్త్రసరణిని) దేవతాసంయమీంద్రు
లాచరించిరి పుణ్యాహవాచనంబు. 224

చ. కలమవనప్రతానములు గాచుటకై చనుదెంచి యింపులం
జిలికెడుమంజురీతి విలసిల్లఁగ నార్చుచు ముద్దుఁబల్కులన్
జిలుకలఁ దోలి పైఁ జెమట చెందఁ గొలంకుల కేఁగి చిల్కలం
జిలుకల నాడుచుండుదురు చెన్నుగఁ బామరబాలికాజనుల్. 225

క. కల్పితమణిఘృణిరచనా
కల్ప మగువివాహవేదికామధ్యమునన్
గల్పోక్తవిధానంబున
వేల్పించిరి యదుకుమారు వేల్పుందపసుల్. 226

ఉ. కాంతనితాంతరత్నపరికల్పితశిల్పములన్ ద్రికాలమున్
వింతతెఱంగులన్ దనరి విష్ణుపదోల్లిఖవైజయంతికా

సంతతు లుల్లసిల్ల సిరిచాను యహర్నిశముఁ వెలుంగ న
త్యంతముఁ జూడ నొప్పుఁ గను నప్పురిలోనిగృహప్రతానముల్. 227

చ. కులకుధరాపహాసిపురగోపురశేఖరరత్నదర్పణం
బుల వలరాచపోఁడుములు పోలఁగఁ జూచి తలంపు ప్రాణనా
థులదెసఁ గూర్చి యత్తఱిన తోడి వయస్యలు చూడ సిగ్గునన్
జెలు వెసలారఁగ న్గురులఁ జిక్కులు దీర్తురు సిద్ధకామినుల్. 228

సీ. కుసుమంబుఁబోలి పొల్పెసఁగు పొక్కిలిడిగ్గఁ
గుఱుపట్టుపుట్టంబు నెఱికఁ గట్టి,
కమనీయనవరత్నఖచిత మైయొప్పుప
సిండిపీఠమునఁ గూర్చుండఁ బెట్టి,
గన్నెరాకుశరంబు కరపల్లవమునకు
రక్షాప్రయోజనార్థముగ నిచ్చి,
దీవించి కాశ్మీరతిలకమధ్యంబునఁ
బుణ్యాక్షతలఁ జిట్టిబొట్టునుర్చి,
గీ. భాగ్యసౌభాగ్యవతి యైనభామ యోర్తు
చన్నుఁగవభారమునఁ గౌను జలదరింపఁ
దివిచి కొనగోరఁ దోఁచి బిందువు విదిర్చి
బాణతనయకు నంటె సంపంగినూనె. 229

సీ. కుసుమకోదండుండు గుణవంతుఁ డగుటెల్ల
యళులార! మీ ప్రాపుకలిమిఁ గాదె!
మరునియెక్కుడుపెంపు మహిమీఁదఁ జెప్పుట
కీరంబులార! మీపేరఁ గాదె!
సంకల్పజన్ముండు సత్రాణుఁ డగుటెల్ల
మలయానిలంబ! నీమహిమఁ గాదె!
మీనకేతనుకీర్తి మిన్నందుకొనుటెల్ల
శీతమయూఖ! నీచెలిమిఁగాదె!

గీ. బాలఁ గారింపఁ దగ దనిపలుకఁ దగదె!
యేడుగడయును మీర గా లెంతద్రవ్వ
మాకుఁ బుష్పాస్త్రుఁ? డంచు ననేకగతుల
మధుప శుక మందపవమాన విధులఁ దలఁచి. 230

శా. క్షామక్షామముఁ గీకటప్రకటవక్షఃపీఠమున్ బాండుర
క్షామిశ్రావయవంబు నైనవికటాకారంబుతో నవ్వకై
చాముండాకరతాళకుక్షివలయస్థానంబుగా నుజ్ఝిత
హ్రీముద్రంబుగఁ బేరణీవిధము నర్తించెన్ మహాభృంగియున్. 231

ఉ. ఖంజననేత్ర చన్నుఁగవ కంపముఁ బొందఁగ ఢీరమేఖలా
శింజితకంకణక్వణనజృంభణ మొప్పఁగఁ గౌను నిక్కఁగా
వ్యంజితబాహుమూలముగ హర్షము లజ్జఁ దిరస్కరింపఁగా
నంజలి యెత్తి నించె విభునౌదల నిర్మలమౌక్తికాక్షతల్. 232

గీ. గురులపంపున వక్షోజభరము గదలఁ,
జెలువు వీక్షించి యొక్కింత సిగ్గువడుచుఁ
గంకణంబుల ఝుణఝుణత్కార మెసఁగ
నతివ లాజలు వోసె సప్తార్చియందు. 233

సీ. ఘనపక్షవిక్షేపజనితవాతాహతిఁ
బర్వతశ్రేణులు పాదు గదల,
విపులాస్యకర్ణికావిజృంభితదీప్తుల
మలయాద్రి యవ్వల వెలుకఁ బాఱ,
శతకోటిశతచండజవభవారవముల
శరధులు ఘూర్ణిల్లి బరలు గడవ,
వితతాద్భుతాపాదివిభ్రమోత్థితకాంతి
దెసల హోమద్యుతి దీటుకొనఁగ,
గీ. సిద్ధచారణగణనుతశ్రీఁ దనర్చి
మింటఁ బఱఁగు ఱెక్కలతోడిమేరు వనఁగ

వచ్చెఁ దనరాక కఖిలంబుఁ బిచ్చలింపఁ
బక్షిదేవుండు పుండరీకాక్షుకడకు. 234

సీ. చంద్రమండలములే జలజాతములుగాక
కాకున్న నలు లేల కాఁపు లుండు?
నెలదమ్మితూఁడులే యలరుఁ దీగెలుగాక
కాకున్న నీకోరకములు గలవె?
క్రొక్కారు మెఱుఁగులే కుసుమాస్త్రములుగాక
కాకున్న నీవిండ్లు గలుగ వచటఁ,
గనకకుంభంబులే ఘనచక్రములుగాక
కాకున్నఁ బరగలఁ గదియు నేల?

గీ. ననుచు వదనాలకములు బాహానఖములుఁ
బొలయుచూపులు బొమలుఁ జన్నులును వళులుఁ
జూచి జనములుఁ దమ్ము సంస్తుతులు సేయ
వఱలుదురు దత్పురంబున వారసతులు. 235

ఉ. చీటికిమాటికిన్ మొగుపుఁజేతులు మాళి ఘటించి మ్రొక్కెదన్
హాటకగర్భబోటికి మహాకవికాంక్షితకల్పకాటవీ
వాటికిఁ దారకాహృదయవల్లభమంజులపుష్పమంజరీ
జూటికి వల్లకీస్ఫురితశుద్ధవరాటికి వాగ్వధూటికిన్. 236

చ. చెలువము లొప్ప రాజనపుఁజేలకుఁ గావలియున్న కాఁపుఁగూఁ
తులనిడువాలుఁగన్నులనుఁ దోరపుఁజన్నులు చూచి ధైర్యము
ల్పలపలనైన మందగతులన్ జనుచుందురు రంగజాస్త్రముల్
దలముగఁ దాఁక నధ్వగులు పన్నగరాంతికమార్గభూములన్. 237

మ. జలనైర్మల్యవిధాయి వింధ్యగిరిశిక్షాకేళిసంశీలుఁ డి
ల్వలదైత్యావరజన్మగర్వదళనావంధ్యక్షుధాభీలుఁ డు
జ్జ్వలతేజోనిధి కల్పితాయతపిపాసారిక్తవారాశి మం
జులహేలాగతిఁ దోఁచెఁ గుంభజుఁ డురుస్తోత్రైకపాత్రోన్నతిన్. 238

చ. తగులము పెక్కువం బుః సుధాధవళోన్నతహర్మ్యరేఖలన్
మగలునుఁ దాఁకు మచ్చరపుమచ్చికమై వలరాచవేడ్కలన్
సోఁగియువధూజనంబుల తనూతనుఘర్మము లార్చు నిచ్చలున్
గగనతరంగిణీకమలగంధసుగంధమరుద్విహారముల్. 239

చ. తలిరులు దోఁచె నేతరుల దట్టము లై? నన లేధరారుహం
బులఁ దలసూపె మున్న? వలిమొగ్గల నొప్పెడు నేయనోకహం
బులు? నవగుచ్ఛరాజి నగము ల్విలసిల్లెడు నెవ్వి? యన్నియున్
గలుగుట నేమహీజములు గన్నులపండువు లయ్యె? నామనిన్. 240

మ. తెర యెత్తించిరి దేవదానవగురు ల్దీక్షాకళాకోవిదుల్
తరుణీరాజతనూభవాంతరమునన్ దట్టంపుఁగౌశేయమున్
తెర యెత్తించెను వార లిద్దఱమనోదేశంబులన్ గాముఁడున్
సర నన్యోన్యముఖేందుమండలదిదృక్షాకౌతుకాంభోనిధిన్. 241

సీ. తెలుపులదాయ జారులకుఁ గట్టనియిల్లు
బలితంపుఁజోరుల బ్రదుకుఁదెరువు,
నలుపుల మొదలు రేనెలఁతకస్తురిపూఁత
యఖిలంబుఁ గప్పెడుసరిదిముసుఁగు,
గుణములమీఁదటిగణనవిజ్ఞానంబు
మఱుఁగు సందియములమనికిపట్టు,
కౌశికంబులచూపు క్రవ్యాదవితతిమ
న్నియము జక్కవదోల భయముప్రోఁక

గీ. యనఁగఁ గలవస్తువుల నెల్లఁ దనమయంబ
కాఁగఁ జేయుచు దెసలు నాకసము నిండ
సకలజనులకు మతుల విస్మయము లడర
నంధకార మంతంతకు నగ్గలించె. 242

శా. ధన్యం బై పితృదేవతానివహ ముద్యత్ప్రీతి నర్తింపఁ బ
క్షన్యాయాచార్యుఁడు భార్గవుండు శ్రుతిమంత్రంబుల్ పఠింపంగఁ బ్రా,

ధాన్యం బొప్పఁగ శైలరాజసుత యత్యాసక్తి వీక్షింపఁగాఁ
గన్యాదాన మొనర్చెఁ బాణుఁ డనురాగస్ఫూర్తిఁ బ్రాద్యుమ్నికిన్. 243

ఉ. ధన్యవిభూతి శోభితుఁడు దానవనేత్రుఁ డొనర్ప నూర్జిత
ధ్వన్యతులోగ్రతాడిత దానవసైన్యము ధూతభూతమై
తన్యముఁ దోషితేంద్రముఖదైవతసంస్తుతిమాన్యము న్నదీ
జాన్యుదరాంతరస్థగితసన్నుతజన్యముఁ బాంచజన్యమున్. 244

సీ. ఘూర్జటికోపాగ్ని ధూళిగాఁ గ్రాఁగిన
నాఁ డేల నీయమ్ము వాఁడిలేదు?
వాఁడికోఱల రాహు వడిఁ దోలి కఱచిన
నాఁ డేల నీరశ్మి వేఁడి లేదు?
శాపంబు శ్రీరామభూపాలుఁ డిచ్చిన
నాఁ డేల కూయవో పోఁడిగాను?
చనుపకముల కర్గి కనుకని డుల్లిన
నాఁ డేల మ్రోయరో? నేఁడు మీరు

గీ. మగువఁ బాయు లెఱిఁగి మగఁటిమి వాటించి
యేయఁ గాయఁ గూయ మ్రోయ నగునె?
మదన! చంద్ర! పికమ! తొదమతుమ్మెదలార!
నాఁడు నాఁడు నాఁడు నాఁడు లేరె? 245

సీ. నిర్భరవాంఛావశీభూతమానస
భంగీకృతాదయాలింగనంబు,
సురుచిరనఖరాగ్రపరిరంభితాలకం
బాస్వాద్యమానాధరామృతంబు,
బాహ్యక్రియాసార్ద్రభావనాళీకంబు
వితతమృదూరూరువేష్టనంబు,
వర్ధితమనురోక్తివాచాలవదనంబు
ఘర్మాంబుకణగణాకలితగండ,

గీ. మతితరంగితనిశ్వాస మాత్తపులక
మరుణితాక్రాంతలోచనాంబురుహయుగళ
మగుమనోహరఖేలనం బతిశయిల్లఁ
దనరెఁ గామినీకామకదంబకంబు. 246

సీ. పడఁతికన్నులయొప్పుఁ దడవుచో నది యెంత
వెలిదమ్మిరేకుల విలసనంబు?
పొలఁతిసెన్నడపెంపుపొగడుచో నది యెంత
కలహంసములయానగౌరవంబు?
ఉవిదనెన్నడుముతో నుపమింప నది యెంత
కొఱనెల నెలకొన్న నెఱసుకలిమి?
వనితయూర్పులతావి కెనపోల్ప నది యెంత
యరవిరులందలిసురభిమహిమ?

గీ. లలనకరివంకబొమలయొప్పులు గణించు
చోట నది యెంత పెడవింటిసోయగంబు?
కాంతతనుకాంతి నరసేయ నెంతమాత్ర
వాలు మెఱుఁగుల సౌభాగ్యవైభవంబు? 247

సీ. పల్లవాధరతోడఁ బలుకులయింపుల
[?] నరయంగఁ బికము పోల్చనుట పికము,
నలినాక్షివేనలిచెలువుతో సరిసేయఁ
బురలెంత ఫురినెమ్మిపురులపొలుపు?
తనుమధ్యనడుముతో నెనవచ్చు ననిచూడ
బయ లగు నఖిలంబు బయలుకలిమి,
సుదతిదంతద్యుతిసొబగు వర్ణించుచో
రుచులె మౌక్తికములరుచులు దడవ?

గీ. ననిన నభినవరామణీయకముమహిమ
యిజ్జగంబునఁ బ్రతిలేమి యేమి సెప్ప,

గరుడఖచరోరగామరకన్యలందు
నయ్యుషాకన్య నుపమింప నబల గలదె? 248

చ. ప్రమదవనాంతరంబుల విభాకమనీయములై యశోకము
ల్కమలిన నెల్లచోటఁ బ్రియులక్ గృతకప్రణయాపరాధవి
భ్రమముల నల్గఁ జేసి వెడవాసినపాంథులమీఁదికోపభా
రమున రతీశుకన్నుఁగవ రాలిననిప్పులప్రోఁకలో యనన్. 249

గీ. ప్రియముఁ గూర్చి ముత్తైదువ పేరఁటాలు
నలువపట్టంపుదేవి లేనగవు నగుచు
నగసుతాపద్మ లీక్షింప బిగియ ముడిచె
దంపతులయుత్తరీయవస్త్రములతుదలు. 250

చ. పొలుపు వహించి పెన్నురువు ప్రోఁకగతిక్ హరిదంతభాగముల్
గలయఁగఁ బర్వ మంచున దళంబుగ శైత్యముఁ దాల్చె క్రొత్తత
మ్ములచెలికాని నిండుఁ డని ము ద్దొలుకంగఁ దదీయదీప్తు లు
య్యెలలుగఁ దూఁగుఁ బ్రీతి యెసలారఁ జకోరకిశోరసంఘముల్. 251

చ. భువిఁ దనివోక వెండియు నభోనదిపొందునకై కళిందసం
భవ బహువేణికావిభవబంధురతక్ దివియందుఁ బర్వె నా
నవిరళలీల నొప్పెసగు నప్పురివప్రనిబద్ధశాతమ
న్యవమణిజాయమానసముపగ్రతరాగ్రిమదీప్తిపూరముల్. 252

సీ. మకరందరసపానమత్తాలినీగాన
మంజులోద్యాననికుంజములను,
కలనినాదగభీరకాదంబసంచార
సముదీర్ణకాసార సైకతములఁ,
జందనామృతచంద్రచంద్రశేఖరచంద్ర
సదృశశోభాసాంద్రసౌధములను,
కమలాప్తహిమభానుకాంతశిలాభాను
మహితలీలాసానుమంతములను,

గీ. వినుతలావణ్యసంపద కనుగుణంబు
ప్రకటసామ్రాజ్యవిభవంబునకు ఫలంబు
నగుమనోజకేళినమున నతిశయిల్లె
భోజనందనయును దానుఁ బుష్పశరుఁడు. 253

సీ. మత్తాలిసంగీతమాధుర్యములతోడి
కుసుమగుచ్ఛంబులు కోసి కోసి,
సంఫుల్లమాధవీసదనవాటికలందుఁ
జిలుకల పెండిండ్లు చేసి చేసి,
కమనీయకమలినీఘనసైకతంబుల
నంచలఁ బట్టంగఁ బొంచి పొంచి,
సహకారవరతరుచ్ఛాయాతలంబుల
మేనులఁ జెమరార మెలఁగి మెలఁగి. 254

గీ. దర్పకునియాజ్ఞఁ దల మోచి తమక తమక
తమకముల నోలముల కల్లఁ దారి తారి
మఱియు బహువిధసంచారమహిమ లమర
నుల్లసిల్లిరి లీలామహోత్సవముల. 255

గీ. మందవాఃకణపరితాపమథితహృదయ
పాంథలోక మై తనవిజృంభణము దనర
శిశిరసంపద భువనలక్ష్మీదుకూల
కల్పితోపకుంఠనభాతిఁ గానఁ బడియె. 256

క. మధుపర్కము సేయించిరి
మధురిపుమనుమనికి సర్వమంగళ యెదురన్
విధివిహితం బగుపథమున
నధిగతపరమార్థు లగుసురాసురమంత్రుల్. 257

చ. మరుతురగాలయంబు లన మన్మథు నమ్ములయిండ్లు నాఁగ శం
బరరిపునాట్యశాల లనఁ బంచశిలీముఖు నాతపత్రనుం

దిరములు నాఁగఁ జారుశుకదీప్తలతాంతమరుచ్ఛటల్ లతా
సురుచిరపల్లవప్రతతి సొం పెసగుం బురితోఁట లెప్పుడున్. 258

సీ. రక్షోవధూవృత్తవక్షోజపరిలిప్త
కుంకుమక్షోభంబు క్రొవ్వు డించి,
శక్రారిమదవతీవక్రాలకాభోగ
ఘనతమఃపరిభాగగరిమ నడఁచి,
క్రవ్యాదయోషాసీగ్రైవేయమణిహార
కహ్లారదీప్తులగర్వ మడఁచి,
దైవతాహితవీరతరుణీసముల్లాస
దరహాసచంద్రికాదర్ప మడఁచి,
గీ. చటులసంవర్తపరివర్తచండకిరణ
శతశతాఖిలపరిదీప్తసారఘోర
దర్శనం బగునట్టిసుదర్శనంబు
గలుగ నీ కసాధ్యంబులు గలవె కృష్ణ! 259

మ. లలనల్ పాడఁగఁ గౌఁగిలింపఁగ సముల్లాసంబునం దాఁపఁ బైఁ
గలయం బుక్కిటికల్లు నింపఁ దిలకత్మోజాతకాండంబుఁ గ్రో
వు లశోకంబులుఁ గేసరక్షితిరుహవ్యూహంబుఁ దోడ్తోఁ గడున్
దిలకించెన్ బులకించె నవ్వె నలరెన్ దీపించె నుద్యానముల్. 260

సీ. వనరుహామోదిని చనుదోయి ప్రాపున
ననులేపనములు వాసనకు నెక్కఁ,
బూఁబోణి నెఱివేణిపొందు సంధిల్లుట
నలరులు సౌమనస్యంబుఁ దాల్ప,
నంగనారత్నంబు నవఘనద్యుతుల సొ
వర్ణమండనములు వన్నె కెక్క,
ధవళాంశుముఖిమేనితఱచు గ్రమ్మించుల
వెలిపట్టుసుఁరాజి నెలవుకొనఁగఁ,

గీ. చెలువ మసలారఁ బూసి వేడ్కలు జనింప
ముడిచి బెడఁగుగఁ దొడిగి సొం పడరఁ గట్టి
గట్టినేర్పులు వళుకొత్తఁ గంబుకంఠి
కాచరించిరి శృంగార మాత్మసఖులు. 261

సీ. వరుణుండు కానిక పురుహూతునకుఁ దెచ్చి
ప్రోవిడ్డనవరత్నపుంజ మనఁగ,
నుదయాద్రితటములో సున్నాళిపై మున్న
వికసించురక్తారవింద మనఁగఁ,
గాశ్మీరరసపూరకమనీయ మగుశచీ
సఖిచేతికల్యాణచషక మనఁగఁ,
బ్రాచి కందుకకేళిపరత మింటికి వైవఁ
బొల్పారుమందారపుష్ప మనఁగ,
గీ. నడరు కెంజాయ మండలం బతిశయిల్ల
నఖిలభూసురదత్తసంధ్యార్ఘ్యతోయ
దళితమందేహుఁ డై జగంబులు వెలుంగ
భానుఁ డుదయించె దేదీప్యమానుఁడగుచు. 262

సీ. వరుణునిశృంగారవనములోఁ బెడఁగొందు
పగడంపుఁదీగలప్రాఁ కనంగఁ,
చరమభూధరముపై సురగాలి నెగయింపఁ
దోతెంచు జేగురుధూళి యనఁగ,
సప్తాంబురాశిలో నంతకంతకుఁ గ్రాలు
బాడబానలశిఖాపటల మనఁగ,
నినురాక కపరదిగ్వనిత యొత్తించిన
రత్నతోరణవిభారాజి యనఁగ,
గీ. విరియ నంకించుచెందొవ విరులయంగు
వఱలు తేపలకాంతికి వన్నెవెట్టి

రమణరమణీజనానురాగములతోడ
నిగిడి యెఱసంజ పడుచుట నివ్వటిల్లె. 263

గీ. వారుణీస్పర్శమున నాదు వాఁడి దఱిఁగె
సకలతీర్థనిదాన మీజలనిధాన
మే నొనర్చెదఁ బావనస్నాన మనుచు
మునుఁగుగతిఁ బశ్చిమాంబుధి మునిఁగె నినుఁడు. 264

శా. విఘ్నధ్వాంతనిరాసవాసరపతిన్ వేదండరాజాననున్
విఘ్నాధీశ్వరునిన్ గపోలఫలకావిర్భూతదానచ్ఛటా
నిఘ్నాళిన్ నిరుపాధికాధికకృపానిత్యోదయోపఘ్నుఁ ప్రాం
చఘ్నజ్యేష్ఠు భజింతుఁ గావ్యరచనాచాతుర్యసంసిద్ధికై. 265

సీ. వికచారవిందదీర్ఘికల వినోదించి
తనిఁ గమ్మతావుల ననఁగి పెనఁగుఁ,
కుసుమితనవలతావిసరంబుఁ గదలించి
వలిఁ దేనియలసోనఁ దలముగొల్పు,
సహకారపాదపచ్ఛాయల కై యేఁగి
శశికాంతవేదుల సంచరించు,
సురతకేళీశ్రాంతి సొగియుముద్దియలపైఁ
జిట్టాడితనువులఁ జెమట లార్చుఁ,

గీ. చంచరీకంబురీతిఁ బర్జన్యభాతి
విరహపరితాపహారుమాడ్కి సురఁటిపోల్కి
నప్పురంబున సకలజనానుమోద
కరణదక్షుండు దక్షిణగంధవహుఁడు. 266

గీ. వెలయువెన్నెల నిఖిలంబు వెల్లివోడిచి
తనిసి చనుచోట నుడువీథిఁ దవిలియున్న
నురువుబుగ్గలు దోఁతోన విరియుసగిదిఁ
దరతరంబ తారకములు విరియఁ దొడఁగె. 267

ఉ. "వేగుచువచ్చెఁ బాసె నిదె వెన్నెల యిన్నెల వింక నుండఁగా
వేగునె మాను నీక్షణమ వేఁడివెలుం గుదయించు" నంచు ను
ద్వేగమునం దదీయపదవీపరివర్తన ముజ్జగింప వే
వేగమునం దొలంగుగతి విచ్చె నుడుప్రజ మంబరంబునన్. 268

ఉ. వేలుపుగిడ్డియుం బరుసవేదియుఁ గల్పకుజంబుఁ దోడరా
లాలితపావనూపురఝుళంఝుళనాదము లుల్లసిల్లఁ బై
చేలచెఱంగు దూలఁగ విశృంఖలవృత్తిఁ జరించుచుండు నీ
లాలక యన్నపూర్ణ యమృతాన్నము వెట్టుచుఁ బంక్తిపంక్తులన్. 269

శా. సీమాంతంబున ద్వారకానగరముల్ జేరన్ దటాకోత్తరా
రామశ్రేణిసమన్వితంబు లగుచున్ రాజిల్లి రాజన్యస
స్వామోదం బిడుకారునుం గలుగు భాండాగారవాటీమహా
గ్రామవ్రాతము నిచ్చెఁ గన్యకు హరిద్రాచూర్ణసంపత్తికిన్. 270

సీ. సుందరీయావనస్ఫురితోష్ణకుచకుంభ
పరిరంభలీలలఁ బరఁగకున్న,
బింబాధరానానాతాంబూలరససుధా
స్వాదఖేలనముల జరుగకున్న,
సీమంతినీజనస్నిగ్ధోరుయుగళసం
కలితపేషణములఁ గ్రాలకున్న,
రాజాననానేకరతికళావిర్భూత
సుఖవిజృంభణముల సొగియకున్న,

గీ. మఱి శరణ్యంబు గలుగునే మనుజతతికి?
ననఁగ హేమంతసంపద కంతటికినిఁ
దాన యగుచుఁ గుబేరదిక్తటమునందు 271

... ... ... ...

శా. సేవాయాతవధూమనోజ్ఞకలకాంచీకింకిణీకంకణా
రావంబుల్ సముదగ్రవాద్యపటలీరావంబులున్ గూడి భూ

దేవస్తోత్రనినాదమేదురము లై దిక్కూలముల్ నిండఁగా
దేవాగారము లొప్పు నప్పురములో దివ్యప్రభావోన్నతిన్. 272

సీ. హంసతూలికశయ్య లలరుఁబొత్తుతలాడ
శశికాంతమణిశిలావిశదధరణి,
తాంబూలపేటి యద్దము రాజకీరంబు
పన్నీరుచెంబులు పసిఁడిగిండి,
విరులచింద్రిక [?] రుద్రవీణామతల్లిక
వింజామరము వట్టివేళ్లసురఁటి,
గిలుకలపాగాలు క్రీడాసరోజంబు
కాళంజి ముత్యాలమేలుకట్టు,
గీ. చతురశీతిబంధసంయుతప్రతిసీర
యగరుధూపపాత్ర యాదియైన
కామదీపనప్రకాశవస్తువులతో
నందమైన కేళిమందిరమున. 273

## పేరయ—బొడ్డపాటి (అనంతమహాత్త్వము).

సీ. తనయనురాగాభ్యుదయమూర్తి పద్మినీ
సతికిని ముఖవికాసం బొనర్పఁ,
దనదుర్నిరీక్షప్రతాపవైఖరి యరి
తమముల గిరిగుహాంతములఁ దార్పఁ,
దనకరవిదళితదానధారాశక్తి
కలయలోకులకు నాకండ్లు దీర్పఁ,
దనదుమిన్నందినఘనతరైశ్వర్యంబు
నకు విబుధాళి సన్నుతు లొనర్పఁ,
గీ. దేజరిల్లెడురా జన దినదినంబు
మూఁడుమూర్తుల జనులచే మ్రొక్కుఁ గొనెడు

పద్మినీవల్లభుని సాదుపాలివేల్పు
భక్తసులభునిఁ గొల్తు హృత్పద్మ మలర. 274

## పేరయ—బొడ్డపాటి. (చాటువు.)

సీ. కాంతులఁ జూపట్టుకం డ్లమరించిన
తిర మైనవిపులపుఁ దేరునందు,
విద్యలప్రోఁక యా వృద్ధసారథి నిల్పి
యతఁడు శిక్షించుహయములఁ బన్ని,
తన్నివాసుల మించుతిన్ననిప్రావిల్లు
చొక్కుఁ బైనారి సెక్కువెట్టి, [?]
గరితోడఁ గూడ నాకసపుసూటిని బాగు
సెమ్మేనుఁ బస నిచ్చునమ్ముఁ దొడిగి,
గీ. యమరభటు లార్వ దైత్యపురములు గెడపి
విజయ మొందినజోదఁ వీవిశ్వమునను
వేల్పు లెవ్వరు నీసాటి విజయవాటి
మల్లికార్జునలింగ! యుమాప్రసంగ! 275

సీ. ఖండఖండంబుగఁ గదిసినతేరును
భంగంపుటిరుసు బోసంగఁ గూర్చి,
విజ్జోడుపడి నిచ్చ వినునీధిఁ దిరిగెడు
చక్రంబు లొనగూడ సంఘటించి,
తలకొన్నభీతిఁ గొందలపడ బహుముఖ
భ్రాంతసారథి నేరుపరిగ నిలిపి,
పలుకఁ బదక్రమంబుల నలుజాడలఁ
బోయెడిగుఱ్ఱముల్ పూనుకొలిపి,
గీ. కుంటివింటను బలువంకకోలఁ దొడిగి
విషమలక్ష్యంబు లేగతి వ్రేసి తయ్యా!

వేల్పు లెవ్వరు నీసాటి విజయవాటి
మల్లికార్జునలింగ! యుమాప్రసంగ! 276

సీ. బంట్లున్నపాలెంబు బలువిల్లు గాఁ జేసి
నవమణివలయంబు నారిఁ జేసి,
నుదుటికెన్నడిమికన్నును ములికి గాఁ జేసి
దక్షిణాంగంబ యస్త్రంబుఁ జేసి,
చేకోరతలవాని జోక సారథి సేసి
తనమూర్తి యొకటి రథంబు సేసి,
కనుదోయిఁ జక్రయుగ్మముగ యోజనచేసి
సమతే నూరుపుల నశ్వములఁ జేసి,

గీ. యన్నియును నీయధీనంబు లగుటఁ జేసి
పురము లేసితి గాక నీకొరులు తోడె?
వేల్పు లెవ్వరు నీసాటి విజయవాటి
మల్లికార్జునలింగ! యుమాప్రసంగ! 277

## పేరయ—బొడ్డపాటి. (పద్మినీవల్లభము).

గీ. ఆప్రదోషయ ... ముతైయున్నసమయంపు
కంటవేఁటకానికరముదిల్పె
సాగపుద్రోచెఁ గ్రుంకె నగుప్రొద్దు పరసంధ్య
వెనుక నిరులు ముందు వెలుఁగు నగుట. [?] 278

క. ఒక యెనిమి దడఁగె దిక్కుల
మకరంబున కొకటి యోడె మలహరుచే ము
న్నొక టుడిగె ధిక్కరింపఁగ
నిఁక నేలని మాఱుమలయు నేనుఁగులు పురికె. 279

సీ. కమలాకరస్ఫూర్తి కాసారములయందుఁ
దమయందుఁ గలుగంగఁ దనరుచుండు,

గంభీరజీవనక్రమ మగడ్తలయందుఁ
దమయందుఁ గలుగంగఁ దనరుచుండు,
ధారావిహార ముత్తమతురంగములందుఁ
దమయందుఁ గలుగంగఁ దనరుచుండు,
సుమనోవికాసంబు ప్రమదావనములందుఁ
దమయందుఁ గలుగంగఁ దనరుచుండు,
గీ. దానమహిమ సముత్తుంగదంతులందు
దమకరంబులఁ గలుగంగఁ దనరుచుండు
సిరులసంతోషమున ముఖ్యశీలవృత్తి
రణజయౌదార్యములఁ బురి రాజకులము. 280

సీ. గజములనడలుఁ దత్కరములజిగులుఁ ద
త్కుంభగౌరవములుఁ గూర్చికూర్చి,
జలజస్ఫుటములుఁ దచ్ఛదవిభ్రమములుఁ ద
త్కేసరసురభులు గిలిమి గిలిమి,
సురవిండ్లుఁ దన్మౌర్వీమధుకరరుచులుఁ ద
దస్త్రంబుమొనలును నలమి యలమి,
కనకవేదులు నందుఁ గాంతినుగ్గులును ద
త్సగితసన్మణులును దార్చి తార్చి,
గీ. గతులు నూరుకుచములు మొగములు నేత్ర
ములును దనుగంధములు బొమ లలకములును
చూపులు నితంబములును రుచులును దశన
ములును విధి సేసె నా సుంద్రు పురిచెలువలు. 281

ఉ. పాయక కన్నె నాథుతలఁ బ్రాలిడఁ బూన్చినయాణిముత్తెముల్
దోయిట పద్మరాగమణులో యన నించుక యెత్తి చూచుచోఁ
జాయల నింద్రనీలములచాయలు గాఁ బతిమౌళి మీఁదటన్
బోయఁగఁ బూవుమొగ్గ లనఁ బొల్చె విచిత్రవిలాసవైఖరిన్. 282

ఉ. సారసరః ప్రతీరవనసౌరభపుష్పరజోవిభూతి నో
య్యారపుఁజొక్కు చల్లి మలయానిలుఁ డన్గడిదొంగ వేసవిన్
జారనగండ్లఁ గన్నములఁ జొచ్చియు దివ్వెలు దూల్చి భోగభా
మారతితాంతఘర్మకణమౌక్తికపంక్తులు దార్చు నిచ్చలున్. 283

పేరయ—బొడ్డపాటి. (మంగళగిరివిలాసము.)

ఉ. హారతు లిచ్చువేళయిన......సారికిరాయనిగన్నతండ్రి కొ
య్యారి మెఱుంగుఁజూపులనె యారతు లిచ్చె నొకర్తు తజ్ఝణా
త్కారకరద్వయీవలయకాంతులు గుత్తిపుఁజన్నుదోయి తా
హారగళించలన్నలుజాలతశౌనెంతకురాయభాకాంతియై[?] 284

పేరయ—బొడ్డపాటి. (శంకరవిజయము).

చ. అడరి సరోజరాగమణు లామిషఖండము లంచుఁ గట్టుకు
ట్లొడికము సేయువేడుకల నుజ్జ్వలసన్మణు లేర్చి నిప్పులం
దిడియును భల్లుకవ్రజనిరీక్షణము ల్గని దివ్వెలంచు దేఁ
దడవుదు రొయ్య మార్గ్యమునఁ దద్గిరిసీమఁ గిరాతబాలికల్. 285

ఉ. ఆమనిటెంకిపట్లు మలయానిలునిత్యవిహారసీమముల్
కాముని పాళెముల్ శుకపికంబులజీతపుటూళ్లు కామినీ
కాముకవిశ్రమంబులకుఁ గల్లని యోర్వ్యవు[?] లాపురాంగనా
స్తోమమునందు నెందు నెలతోఁటలు శైలశిలోన్నతస్థితిన్ 286

గీ. తనకు బలము గలిగి తన మంత్రిమిత్రాప్త
బలము దనకుఁ దోడుపడుట గలిగి
వైరిబలము దఱిగి వారిచుట్టము లెల్లఁ
గ్రిందు వడినవేళ గెలువవచ్చు. 287

చ. తనరుచిగానివేళ బెడిదం బగువేఁడి నినుండు దోఁచినన్
గనుమొఱఁగుంట రాజునకుఁ గర్జ మటం చెటయేని జన్నయ

ట్లనుచరు లై వెలింగెడి గ్రహంబులుఁ దారలుఁ దోడ రాఁగ వే
గన చనె వెల్లవెల్లని మొగంబుకళంకమునన్ శశాంకుఁడున్. 288

గీ. రాజురాకకుఁ దారహారములతోడి
యామినీపాత్ర నాడింప నేమి సమయ
నాటకుఁడు దోఁపుతెర వారినాఁ డనంగ
సాంధ్యరాగము పశ్చిమాశను దనర్చె. 289

సీ. సంజప్రొద్దున నాట సలుపునంబరకేశు
తలయేటిజలకణతతు లనంగ,
రజనీవధూద్విజరాజులపెండ్లి కే
ర్పఱచుముత్తెపుఁదలఁబ్రా లనంగఁ,
గాలవాణిజ్యుండు నీలాంబరస్థలీ
స[?] జచరించువజ్రము లనంగ,
వేళాఖ్య పుష్పలావిక యిందుఁ డనురాజు
నకు నేరిచినప్రసూనంబు లనఁగఁ,

గీ. బాలవెల్లి మథించు తొల్కాలమునను
నమృతబిందువు లదరి మిన్నంటె ననఁగ
గగన మనుకొల నలమినతోగ లనంగఁ
గలయఁ జుక్కలు తోఁచె నాకాశవీథి. 290

మ. సమలావణ్యము వన్నెఁగూడి రసముల్ సంధించి శృంగారవే
షముతోఁ జొక్కపుఁజూపు నవ్వోలయ నిచ్ఛాతూలికన్ భావచి
త్రము గాఁ బంచశరుండు రాగ రతిఁ జెంతం జూచుచున్ వ్రాసి ప్రా
ణము వాగీశ్వరు వేఁడి నించె నన మేనాపుత్త్రి యొప్పెం గడున్.|౹. 291

పేరయ—బొడ్డపాటి. (సూర్యశతకము.)

శా. ఈఁగల్వోలె వ్రణంబులే వెదకుచు న్నీర్ష్యం బరున్ మెచ్చకే
మాఁగల్వోలె నిరంతరాస్యు లగుచున్ మూర్ఛించి తర్కించినన్

వీఁగ స్నేఁదనిరుష్కృవుల్ బ్రతుకనీ విక్రాంతులై వారినో
రాఁగం బోవఁగ నేల సత్కృవులు సూర్యా! పద్మినీవల్లభా! 292

పోతరాజు—(బేతాళపంచవింశతి.)

చ. అరయఁగఁ బూర్వదిగ్వనితయం దనురక్తుఁడు ముందఱిప్డు భా
స్కరుఁ డిట వచ్చి నాదెసఁ బ్రశాంతముతో ననురక్తుఁ డయ్యె సు
స్థిర మిది యంచు నయ్యపరదిక్సతి రాగముఁ బొందె నాఁగ వి
స్తరముగ నిండఁ బర్వె నెఱసంజ నభంబునఁ బశ్చిమంబునన్. 293

క. ఇంటింటం జింతామణు
లింటింటం బరుసవేదు లింటింట నిధుల్
జంటగొని యుండు ధనపతి
యింటిక్రియన్ బురములోనియిండ్లల నెల్లన్. 294

ఉ. ఇందుల నున్న నగ్నిభయ మెందునుఁ గల్గ దటంచు మున్ సురా
నందన మైనఖాండవవనం బమరావతి వాసి వచ్చి పా
ల్పొందఁగ మర్త్యలోకమున నుత్సవలీల వహించెనో క్కొ నా
నందవనంబు లొప్పెఁ బురినాలుగుదిక్కుల నున్నతస్థితిన్. 295

క. పురివిభవముఁ జూడఁగ న
త్కరమున[?] జలదేవి పెక్కుకన్నులు వెలయన్
ధరియించినట్లు వికసిత
సరసిరుహాకరము లొప్పు సౌరభలీలన్. 296

సీ. ప్రజ్వరిల్లుచు నున్నపసిఁడిశాఖలతోడ
వెలసినవనముల చెలువుదానిఁ,
గరిమకరగ్రాహకచ్ఛపంబులతోడఁ
బరిపూర్ణజలములపరిఖదాని,
మరకతవైడూర్యమాణిక్యములతోడ
హాటకమయ మైనకోటదానిఁ,

గమనీయకాంచనకలశాంగములతోడ
నమరిన దేవాలయములదానిఁ,

గీ. కనకఖచిత మైనకంబంపుగట్లతో
వెండిమాడులిండ్లు వెలయుదాని
జనమహోత్సవ మనఁ దనరిననుజ్జయి
నీపురంబు సొచ్చె నృపవరుండు. 297

క. రవిఁ బొంది రాహుచేఁ బరి
భవములఁ బడ నోడి తద్గభస్తులు పురి ను
క్కివమునఁ జొచ్చినవిధమున
నవిరళరుచి వెలిఁగె దివియ లయ్యెయిండ్లన్. 298

ఉ. వ్యాళవిభూషణాళియు దిగంబరమున్ గదయున్ ద్రిశూలమున్
వ్రేలెడుకెంజడల్ గగనవీథికిఁ జాఁగినయుగ్రరూప మా
భీలచతుర్భుజంబులు నభేద్యకరాసియుఁ జంద్రఖండమున్
ఫాలవిలోచనంబుఁ గలభైరవుఁ గాంచె విభుండు ముందరన్. 299

క. సురధరము పెక్కురూపులు
ధరియించి పురంబులోనఁ దనర ననంగా
స్ఫురితనవరత్నకాంచన
భరితము లై వివిధదేవభవనము లొప్పున్. 300

## పోలమరాజు—(పర్వతపురాణము.)

చ. అరయఁగ లోకబాంధవుఁడ నై భువనత్రయకర్మసాక్షి నై
హరిహరపద్మసంభవమయాకృతి నై మనునాకు వారుణీ
పరిచయదోష మబ్బె నని భానుఁడు తద్దురితోపశాంతికై
శరనిధిఁ గ్రుంకెనా నపరశైలతిరోహితుఁ డయ్యె నయ్యెడన్. 301

సీ. ఒనరంగఁ గమలంబు నుపహారసంధియు
సంతానసంధియు సంగడంబుఁ,

జాల నుపన్యాససంధియు ...
...సంధియు యో గసంధికమును,
బుష్పాంతరాదృష్టపురుషనామకములు
నాదిష్టకంబును నాత్మమిషయు,
బంధురోసగ్రహసంధి పరిక్రియా
సంధియు నుచ్ఛిన్నసంధికంబు,
గీ. ననుపమపరదూషణాంచితస్కంథోప
నేయసంధు లనఁగ నిశ్చితముగ
షోడశప్రకారసునిశితసంధివి
ధాన మెఱుఁగవలయు ధరణిపునకు. 302

బద్దెభూపాలుఁడు—(నీతిసారము.)

శా. నానాశాస్త్రవిశారదుండు నయనానందాంగుడుఁ సత్కుల
స్థానశ్రేష్ఠుఁడు నిస్పృహుండు పరచిత్తజ్ఞుండు వాక్శుద్ధుఁడుఁ
శ్రీనిత్యుండును లోకమాన్యుఁడును నిశ్చింతుండు నైయుండినఁ
వానిఁ మానుగ రాజమాత యని చెప్పఁ వచ్చు నుర్వీస్థలిఁ. 303
క. పతి కలిగి తానె పాలియును
బతి నలిగించు (టనుఁ) దనకె భంగము వచ్చుఁ
బతిమతమె కాని భటునకుఁ
బతితో నాగ్రహము చనదు బద్దెనరేంద్రా! 304
క. పతిచీర లట్టిచీరలు
పతితొడవుం బోలుతొడవుఁ బతిగతివేష
స్థితియును సేవకులకుఁ దగ
దతిధనయుతు లైన నముఁగు లైనను సభలోఁ. 305
సీ. బలుకాపు వాకిళ్లఁ బగలు రేయును నిడి
కోటఁ బాళెముఁ దగుచోటఁ బెట్టి,

కనుమట్లనెల్ల[?] కావలి నియమించి
నడిమిచావడిఁ దగునరుల నునిచిఁ,
నగరిచుట్టును జాలె నడిపించి క్రంతలఁ
దిరుగుచుఁ దగఁ దలవరుల నునిచి,
దిన[?]...యుఁ బాళెముల్ దృష్టి వెట్టుచుఁ గేల
దివియలు విడువక తిరుగఁజేసి,

గీ. దొరలు రాజులందు నరయుచు భటులందు
భేద మొదవకుండ నాదరించి
యుచితవృత్తిఁ గావకుండిన దుర్గంబు
నేలఁ గలఁడె భూమి నింద్రుఁడైన? 306

బసువయ—అంగద. (ఇందుమతీకల్యాణము.)

మం. ఉదయస్తంభములోపలన్ వెడలి తా నుద్యత్తమోదైత్యునిం
గుదియంబట్టి గభస్తిమన్నృహరి సక్రోధంబునన్ వానిదు
ర్మదగాత్రంబు కరంబులం దునుమ ధారాళాస్రపూరంబుకా
వి దివిం బర్వినకైవడిన్ గలయఁబర్వెన్ సాంధ్యరాగచ్ఛవుల్. 307

ఉ. బీద శచీవిభుండు దితిబిడ్డలవార్యులు వారు పట్టుకున్
బాదలఁ బెట్టఁగాఁ జెఱలు వట్టఁగ నుండుట భార మంచు రం
భాదిమరున్నివాసలసదప్సరసల్ చనుదెంచి వచ్చిరో
నా దరఫుల్లపద్మవదనల్ విహరించుదు రప్పురంబునన్. 308

సీ. లాజవిమోక్షవేళాసముద్గతహోమ
ధూమవాసన మేనఁ దొంగలింప,
మృగనాభిమకరికారేఖ లై మృదుగండ
మండలి హోమధూమములు నిలువ,
హోమధూమశిఖాముఖోష్ణంబు చోఁకి పూ
ర్ణేందుబింబాననం బెజ్జువార,

మాటికి హోమధూమంబుచే వెడలెడు
కన్నీటఁ గాటుక కరఁగి పాఱ,
గీ. గురుజనోక్తవిధానానుకూలచాల[?]
నిజవివాహవిలాసంబు నిర్వహించి
భోజుఁ డప్పుడు వేడుక బుధకవివి[?]
తానములతోడ నార్ద్రాక్షతములు సల్లె. 309
సీ. శశిమండలముమీఁద సాంద్రచంద్రికవోలె
నునుమొగంబునఁ దెల్లఁదనము నిల్చెఁ,
బసిఁడికుండలమీఁద బలభిన్మణులవోలె
వలిచన్నుముక్కుల నలుపు లాదవె,
నిలుపేదమీఁదనిర్ణిద్రసంపదవోలె
మధ్యభాగంబున మహిమఁ దాల్చెఁ,
గదలినలత మీఁది కమ్మపూవులవోలె
నలవనిమేన సొమ్ములు దొలంగెఁ,
గీ. పరుణిగమనంబు మిగుల మాంద్యము వహించె
వనజపత్రాక్షికోర్కులు కొనలుసాఁగె
వనితనేత్రాంతములు పసివాఱ్లువాడె
వనితతనువల్లి శయ్యల వ్రాలఁ గడఁగె. 310
సీ. హేమసింహాసనం బెక్కి నుద్యోగించు
మణికల్పితాస్థానమంటపమున,
విసరించుకొనఁ జూచు వింజామరంబున
వైరివీరవిలాసవతులచేత,
నాటింపఁ దలఁచు నానాద్వీపసంధుల
గెలుపుఁగంబంబులు వలసినన్ని,
దుష్టరాక్షసకోటిఁ దునుమ విచారించు
మఘవన్ముఖాఖిలామరులు వొగడ,

గీ. సంతసము జహ్నుకన్యాతటాంతరముల
నధ్వరంబులు గావింప నలవరించు
నెలఁత నిచ్చలు నిజగర్భనివసదర్భ
కప్రభావపరిప్రాప్తి గౌరవమున. 311

బసువయ్య—తులసి. (సావిత్రికథ.)

ఉ. అన్నగరంబుహర్మ్యములయందు ఘటించినపద్మరాగర
త్నోన్నతకాంతిమండలము లొక్కమొగిన్ జదలేటఁ బర్విన
కిన్నరకాంత లాత్మఁ దలకింతురు జంబునదీప్రవాహ మి
ట్లెన్నఁడు వచ్చె నింగి కని యెత్తినసంశయసంభ్రమమ్ములన్ 312

మ. అరవిందప్రియవాది ఘోరతిమిరవ్యాళవ్రజన్మాన్తికిన్
గరుడం డంచితదిక్సతీకుచతటీకాశ్మీరపంకంబు పు
ష్కరభాగాటవిధాగ్రపల్లవితమాకందంబు[?] మందప్రభల్
బెరయం దూర్పునఁ గుంటువేల్పు పొడసూపెన్ దీపదండాకృతిన్.

క. ఆపూర్ణశంఖపద్మమ
హాపద్మాధికధనాఢ్యులై పుణ్యజన
వ్యాపారవృత్తి పెంపున
నాపౌలస్త్యున్ గణింప రప్పురివైశ్యుల్. 314

చ. ఉరగవధూజనంబులు పయోధరసంభృతకుంకుమాంకముల్
గరఁగ నిరంతరంబు నవగాహన మర్థి నొనర్చు చుండఁగా
నరుణరుచిం గనుంగొనఁగ నంద మగుం బరిఖాంబుతోయ మ
ప్పురి దనఘోరవీరరసముం బ్రకటించుచు నున్నకైవడిన్. 315

సీ. కమలకోరకనికాయములఁ జిక్కి న తేఁటి
గమిమ్రోఁత ప్రియు కూఁతగాఁ దలంచు
వికసన్నవోజ్జ్వహల్లకరాశిలోఁ దూఁటి
దావానలం బని తల్లడిల్లు,

హంసఖండితమృణాళాంకూరములు శశి
ప్రతిబింబితము లని పరితపించుఁ,
గల్లోలఘట్టనోద్గతఫేనపుంజంబు
ఘన మైనవెన్నెల యని కలంగు,
గీ. వెదకు నలుదిక్కులును జాల వెచ్చ నూర్చు,
తలఁకు బిసినీపలాశమధ్యమునఁ బొరలు,
జాలిఁ బడి తూలు దివసావసానవేళ
జడిసి ప్రాణేశుఁ బాసినచక్రవాకి. 316
చ. కరుణ దలిర్ప నిన్ గుటిలుఁగా మదిఁ జూడక జూటకోటిలో
నిరుపమలీలఁ జేర్చికొని నెమ్మది నున్నపురారిఁ బాండురు
గ్భరితశరీరుఁ జేసితివి కంతుని వైరముఁబట్టి యక్కటా!
సరసిజవైరి! యీవిసపుజాతికిఁ బాంధవధంబు పెద్దయే? 317
గీ. గగనలక్ష్మివధూటికిఁ గలశవార్ధి
యెలమితోడ నుపాయనం బిచ్చినట్టి
క్రొత్తకట్టాణిముంగరముత్తె మనఁగఁ
జూడ నొప్పారి వేగురుఁజుక్క వొడిచె. 318
ఉ. గైరికమండనంబులు నఖర్వసమున్నతపాదపంక్తియున్
హారిమదాపరాశి యపహార్యసమంచితసత్త్వరేఖయున్
ధారుణి మీకు మాకు విదితంబుగ సాటియె పొ మ్మటంచు దు
ర్వారగతిన్ హసించు గిరివర్గముఁ దత్పరివారణౌఘముల్. 319
సీ. తనశాతహేతి మత్తవిరోధిశుద్ధాంత
మర్దాంతహృదయాగ్నిధూమరేఖ,
తనకీర్తి హుతవహస్తంభశంభుకిరీటి
తత్ఫుల్లమల్లికాస్తబకపంక్తి,
తననిరర్గళదానధార పంకజభవాం
డోదంచితావరణోదకంబు,

... ... ... ...

... ... ... ...

గీ. గాఁగ విలసిల్లు సకలదిక్చక్రవాళ
భరితతేజోబృహద్భాను భానుదళిత
చండభానుండు సంతతాఖండవిభవ
శాలి యగునశ్వసేన భూపాలవరుఁడు. 320

సీ. ధర్మభంగము విధూత్తంసవీరమునందు
ధర్మభంగము రణస్థలులయందు,
ఘనతమస్స్ఫూర్తియు [?] ర్యమునందు
ఘనతమస్ఫూర్తి యామినులయందు,
విక్రమోత్సేకంబు వీరయోధులయందు
విక్రమోత్సేకంబు విష్ణునందు,
బలగర్వహతి గోత్రకులభంజనునియందు
బలగర్వహతి రా ... [?]

గీ. (కా కిఁకే) చోట లేక నిష్కంటకంబు
గా మహీతల మేకచక్రముగ నేలె
రంతిదశరథనాభాగరఘుదిలీప
నయసమన్వితుఁ డశ్వసేనప్రభుండు. 321

సీ. పటుచండతాండవోత్పతితధూర్జటిజటా
మకుటాగ్రఫణిఫణామణి యనంగ,
నికటవాతాఘాతనిర్భగ్న మగుపశ్చి
మాచలధాతుశృంగాగ్ర మనఁగ,
సంధ్యాప్రభిన్నరక్షఃకోటిపై వియ
చ్చరణుఁ డేసినసుదర్శన మనంగ,
ఘననిశాంబుధి జగం బనుకలం బెడలక
యుండంగఁ ద్రోచినగుం డనంగఁ,

గీ. దేశమంతయు శిఖియందుఁ దిరముకొల్పి
కడఁకఁ దల లెత్తి పటుమాంసకలశశంకఁ
బదరి జలచరపంక్తి పైపైఁ బడంగఁ
బడియె నపరాంబురాశిలోఁ బద్మహితుఁడు. 322

చ. పనివడి పాకశాసను నెపంబునఁ బంకజసంభవుండు నీ
తనువుఁ దొఱంగఁ జేసె నతిదారుణశాంభవరోషవహ్నిచే,
మనమున నాఁటియాగ్రహము మానక నీవును సంఘటించి తా
ఘనునిశిరంబుఁ ద్రుంచుతమకం; బితరుల్ తెలియంగ నేర్తురే. 323

ఉ. పోసులఁ బోయి యన్యసతిఁ బొందినవాఁడు సదాకళంకి దో
షాకరుఁ డుగ్రమూర్తి సముదగ్రవిషాగ్నిసహోదరుండు ప
ద్మైకవిరోధి సంతతజినాత్ముఁడు మాసరిగాఁ డటంచు న
త్యేకముతోడ రాజు నిరసింతురు రాజకుమారు లప్పురిన్. 324

సీ. బింబంబు హిమధామబింబంబు నడఁగించు
మధురాధరాననమండలములు,
మించులఁ బసిఁడిక్రొమ్మించులఁ దలఁపించు
నతిమనోహరకటాక్షాంగరుచులు,
నగములఁ గృష్ణపన్నగముల నగుఁ గుచ
ద్వితయరోమావళీవిభ్రమములు,
దమ్ములఁ దేటిమొత్తమ్ముల నిరసించు
నంఘ్రిద్వయీవినీలాలకములు,
గీ. కరము కేసరిఁ గేసరోత్కరముఁ దెగడు
మధ్యకోమలదంతాంశుమండనంబు
లౌర! నుతియింప నజునకు నైన వశమె?
యప్పురంబున నొప్పారునబ్జముఖుల. 325

క. బీరమునఁ బొదలి సమర
ప్రారంభమె పెండ్లియనుచు బలవర్షమునన్

వైరులకు వెన్నుచూపని
శూరవ్రజ మప్పురమునఁ జూడఁగ నొప్పున్. 326

క. మందేహ దేహదహనా
మందక్షతజప్రవాహ మహనీయనదీ
సందేహదాయి యగుచును
గ్రందున నెఱసంజ మింటఁ గానఁగ నయ్యెన్. 327

ఉ. మాయపుఁదుంటవిల్తువెడమాటల మానినులార! ప్రాణముల్
వోయెడు నాఁడునాఁటి కిఁకఁ బో విడుఁ డీయలుకల్ నిజేశులన్
బాయకుఁడీ యటంచుఁ బరిభాషలఁ జాటెడుభంగిఁ గొక్కొరో
కో యని కూఁత వేసెఁ దొలికోడి పురాంతరగేహదేహళిన్. 328

మ. లలితాహంకృతిచేత రాచిలుక తాళం బుగ్గడింపం గరాం
చలవాచాలవిపంచికారణనచంచద్గానముం గూడి యు
జ్జ్వలపాదాంబుజరత్ననూపురచలద్వాక్యంబు సొంపొంద వా
గ్జలజాతాక్షి యొనర్చు నాహృదయరంగక్షోణి నృత్యక్రియన్. 329

సీ. వదనాంబుజంబుపై వ్రాలినమదభృంగ
జాలంబు లబలనీలాలకములు,
రదనముక్తాఫలప్రకరంబుదాఁ(చిన)
(పవడంపుఁనును)గ్రోవి పడఁతిమోవి,
యౌవనాంభఃప్రవాహములోనఁ దేలెడు
జక్కవకవ కాంతచన్నుదోయి,
నతనాభికూపసంగత యైననవజల
ద్రోణి పల్లవపాణిరోమరాజి,

గీ. ... ... రామణికి నిడిన
కమ్మపూదండ లబ్జాక్షికరయుగంబు
చరణపద్మముల్ ముట్టంగఁ జాలునట్టి
కరికరంబులు నిడువాలుఁగంటితొడలు. 330

చ. విడిలినమోవికెంపులును వ్రేఁకపుటూరుపుగాలిసొంపులు
న్బడలినమేనియొప్పులును నానదొఱంగినమాటతప్పులుఁ
సడలినకొప్పుబాగులును జంకెనచూపులవింతలాగులుఁ
దడఁబడ నభ్యసించిరి ముదంబున నిద్దఱుఁ గామతంత్రముల్. 331

సీ. సకలదిగ్గేశరాజన్యహారప్రభా
జాలంబు ఫేనపుంజంబు గాఁగఁ,
జంచలలోచనాజనకరాంచలచల
చ్చామరోత్కర మూర్మిచయము గాఁగ,
సముచితరత్నాసనము లంతరాకీర్ణ
బహుళభూధరకదంబములుగాఁగఁ,
బరనృపాలార్పితబాలాజనంబుల
మెఱుఁగుఁజూపులు గండుమీలుగాఁగ,
గీ. వందిసంస్తుతు లుద్ధతధ్వనులు గాఁగ
జయరమాకాంతకుద్భవస్థాన మగుచు
నంచితాజ్ఞామహావేల నంబురాశి
మహిమఁ జెలువొందు నాస్థానమండపమున. 332

సీ. సంతతిలేనిసంసారంబు నిస్సార,
మొగి. నర్భకులు లేనియొప్పు తప్పు,
కొడుకుతోఁ గూడనికూడు కీడు, తనూజు
లెపుడు క్రీడింపనియిల్లు పొల్లు,
పుత్త్రరత్నము లేనిభోగంబు రోగంబు,
తనయుఁ గాననిదానితగవు నగవు,
పిన్నబిడ్డలు లేనిపెక్కువ తక్కువ,
సూను మైసోఁకనిమేను మ్రాను,
గీ. కాన యెబ్భంగి నైన సంతానలబ్ధి
కాన నగుత్రోవఁ బరికించి కానవలయుఁ

గాని యూరకయునికి యుక్తంబు కాదు
జగతి సంతతి లే కున్న జన్మహాని. 333

సీ. సురవాహినీహేమసరసిజంబులు గోయ
జను లర్థి నిడిననిచ్చెన లనంగ,
నభ్రంబు పాథోధి యనుచు నేఁగఁగ నిల్చి
సాఁగినశరదభ్రచయము లనఁగ,
జవభిన్నరవిరథాశ్వములు నిల్వఁగ నోలిఁ
బన్నినపటికంపుఁ దిన్నె లనఁగ,
ఘనరత్నకుట్టిమోద్గతరసాతలశేష
ఫణిఫణాద్యుతికలాపంబు లనఁగ,
గీ. భూమికాంచితనవమణిస్తోమధామ
మండలాఖండలాచ్ఛకోదండఖండ
పటలనర్తితదేహాళీబర్హిణులము
లగుచు నప్పురి సౌధంబు లతిశయిల్లె. 334

సీ. సౌవీర మగధ కోసల భోసల పుళింద
లాట కేరళ మహాభోట చోట
సాముద్ర పౌండ్ర ఘూర్జర కుంత లావంతి
పాండ్య గాంధార నేపాళ గౌళ
కర్ణాట కుకురు కేకయ వత్స మత్స్యాంగ
బంగాళ సింధు కళింగ వంగ
కురు బాహ్లి కా[?]ది కొంకణ టెంకణ
సాళ్వ కాశ్మీర పాంచాళ చోళ
గీ. శక సుధేష్ణ త్రిగర్త దశార్ణ వార్ణ
కాల కాంభోజ దరద కంధాణ హూణ
సుంహ లోత్కళ బహుధాన శూరసేన
యావన మద్ర మరుప్రదేశాంధ్రవిభులు. 335

క. హరితురగమునరుణాంశుని
హరులుం గవ గూడెనేని యగు సరి లేదా
సరి గావని యితరహయో
త్కరముల నగు నప్పురమునఁ గలహరు లెల్లన్. 336

సీ. హరినీలరుచిరమధ్యప్రభాభోగంబు
నంభోధరశ్రేణి నపహసింప,
శశికాంతకుట్టిమచ్ఛాయాకలాపంబు
వరబలాకావైభవంబు నెఱప,
నంగనాచటులకటాక్షపాతంబులు
సౌదామనీవిలాసములఁ జేయ,
నిబిడభేరీశంఖనినదసంరంభంబు
ఘనగర్జితప్రౌఢిఁ గైకొనంగఁ,
గీ. గలహవిగళితసౌధాగ్రగతవధూటి
కాప్రసూనాళి కరకాప్రశస్తిఁ బెనుప
మహిమ నేప్రొద్దు వర్షాగమంబు తేవ
దీపితం బయ్యె భోగవతీపురంబు. 337

## మల్లయ—నంది. (మదనసేనము.)

గీ. అపుడు తానావసానంబునందు మధ్య
కీలితంబయి యొప్పెఁ గెంగేలు వలికి
నలియవు గదా యటంచు నానడిమితీగ
నుపచరింపఁగ వచ్చినదో యనంగ. 338

సీ. తళతళ మనుపతాకలతోడ రవికాంతిఁ
దలతల మనెడిరత్నములతోడఁ,
గనఁగన సౌబ గధికం బైనపాడవుతోఁ
గనకన మనుహేమకాంతితోడఁ,

గలకలఁ బల్కుచిల్కలతోడ గృహదీర్ఘి
కలఁ గలహంససంఘములతోడఁ,
బరిపరిగతి నాడుబర్హులతో నిజో
పరిపరిగతిమేఘపంక్తితోడఁ,
గీ. దముల విహరించుపారావతములతోడ
భ్రమదళివ్రాతసుమవితానములతోడఁ
బ్రమదవనవాసనలచేతఁ బ్రమద మొసఁగి
యొనయునీమేడతోఁ బ్రతి యొనయఁగలదె? 339
సీ. పరిఫుల్లహల్లకప్రభలు నిండినచోట
సాంధ్యరాగద్యుతి చౌకళింప,
వికచనీలోత్పలప్రకరస్థలంబుల
గిఱిగొన్నచీఁకట్లు గ్రేళ్లుదాఁట,
నిర్నిద్రకుముదవనీప్రదేశంబులఁ
దేటవెన్నెల పిల్లతీపు లాడ,
వికసితకనకారవిందబృందంబులు
బెరయునీరెండఁ బింపిళ్లుగూయఁ,
గీ. బగలు రేయును దమలోనఁ బగలుమాని
కలసి మెలసినబాగున గడలుకొల్పి
వివిధమహిమలఁ దనరునావిమలసరసిఁ
జూచి నివ్వెఱపడి రాజసూనుఁ డపుడు. 340
సీ. మెఱుఁగుశృంగములందు మెదలక యున్నవి
నీలమేఘంబులు నీరజాస్య!
వెన్నెలపులుగులు వేకువచంద్రుపైఁ
దేలుచున్నవి చూడు తియ్యఁబోఁడి,
మింట నాగడపలు మెల్లమెల్లన విచ్చి
కానరావయ్యె నోకలువకం

పారిజాతపుఁదీగ బహువర్ణపుష్పభా
రంబు మోవఁగలేదు కంబుకంఠి!
గీ. యనుచుఁ దమలోన గర్వోక్తు లాడుకొనుచుఁ
దనకు నుపచారములు సేయు ననుఁగుఁజెలులఁ
జూచి నవ్వుచు సహజన్య చూడ నొప్పెఁ
జారుదోహదలక్షణసహిత యగుచు. 341

మల్లయ—నందూరి. (హరిదత్తోపాఖ్యానము.)

చ. నవరుచిపల్లవస్థితిఁ దనర్చి లసత్సుమనస్సమృద్ధివై
భవమునఁ బొంది గంధబహుబంధురతం దగి యాశ్రితద్విజో
త్సవములఁ బొల్చి వారవనితామణిరీతిఁ ద్రివిష్టపంబుతే
వ వరగజంబుమాడ్కిఁ గ్రతువాటిగతిన్ బురితోఁట లొప్పగున్. 342

మల్లయ—మద్దికాయల. (రేవతీపరిణయము.)

సీ. అమృతాంశుబింబంబు నవఘళింపఁగఁ జాలు
తీయనిపెడపెన తేనెపెరలు,
కలశాంబునిధితరంగలపిల్ల లనఁ జాలు
సాంద్రదీర్ఘనశేషచామరములు,
తారకంబులయొప్పిదములు గా దనఁజాలు
మైణవమౌక్తికవ్రాతములును,
పండువెన్నెలగుంజుఁ బరిహసింపఁగఁ జాలు
పరిపరిగతులయబ్బురపుజున్ను,
గీ. నాది యగుదివ్యవస్తుసంహతులు దెచ్చి
యవనమండలపతి యుపాయనము లిచ్చి
విన్నపము చేసె నిట్లని వేడ్కఁ దనదు
డెందమునఁ గందళింపఁ బుళింనవిభుఁడు. 343

మ. కటకండొంయన మంతనంతఁ జలుపంగాఁ దామ్రపర్ణీమదో
త్కటదానంబులు నిండి చెండుకొన కస్తూరావకూటధ్వష
త్తటము ల్మెట్టఁగ జిర్కుబాఱె నవనీతంబుల్ వడింబాఱెనా
బుటకన్యాప్తుఁడు గ్రుంకెఁ బశ్చిమమహాంభోరాశిపూరంబునన్. [?]

చ. నిలయతమఃప్రతానము గణింప మఱుంగులుసొచ్చినట్టుగా
నలరుపిఱిందినీడలు రతాంతదుకూలపరిగ్రహత్వరా
కలితవిలాసినీనివహకౌతుకహేతువు లై చెలంగ ను
జ్జ్వలరుచి మించె గేహముల సంపెఁగమొగ్గలవంటిదీపముల్. 345

మల్లుభట్లు—ఘటసాసి. (జలపాలిమహత్త్వము.)

సీ. అత్రిమునీశ్వరుం డడవి కేఁగినవేళ
హరిహరబ్రహ్మలు ధరకు వచ్చి,
యనసూయవర్తనం బరయఁ దలంచి వా
రతిథు లై యాహార మడిగినంత,
యవుఁగాక యని వేగ నన్నపానాదులు
వడ్డింపఁ దలఁచుచో వారికోర్కి,
తప్పకుండఁ బతివ్రతాప్రభావంబున
నకలంక యగుచు బాలకులఁ జేసి,

గీ. యంబరము లూడ్చి సకలపదార్థములను
బాత్రములఁ బెట్టి తొంటి (రూప)ములొనర్చ
సంతతం బంది తత్తదంశముల సుతుల
వరము లందె నయ్యాది పతివ్రతలమహిమ. 346

సీ. కచభరకృష్ణమేఘంబులఁ బ్రభవించు
మెఱుఁగుఁదీ గలరీతి మేను లలర,
వదనేందుదరహాసవరశరచ్చంద్రిక
లక్ష్మీచకోరంబు లనుభవింప,

నతులసౌందర్యాబ్ధి కధరబింబద్యుతుల్
పవడంపుఁదీఁగెలబాగు మెఱయ,
జగము గెల్వఁగ దక్షునగరంబు దౌనసేసి
మరుఁడు దాఁచినదివ్యశరము లనఁగ,
గీ. సరసలీలావలోకనచతురగతుల
నప్సరస్స్త్రీసమూహంబు లభ్యసింపఁ
బద్మినీజాతిముఖ్యస్వభావములను
వన్నె మెఱయుదు రప్పురివారసతులు. 347
సీ. ధవళాంగుఁ డగుశంభుదత్తగర్భము గాఁగ
వనితదేహము పాండువర్ణ మయ్యెఁ,
బుత్రలాభానందపూరితకుక్షి యై
యఖిలభక్ష్యములందు నరుచి యయ్యెఁ,
జెలులు వచ్చినఁ జూచి సిగ్గున నున్నట్లు
పలుక నోపక యుండె నలసవృత్తిఁ;
దతి మరాళములకు గతి నేర్పఁ గైవడి
నళినాక్షి మందయానము వహించె,
గీ. హేమకలశాగ్రములయందు నింద్రనీల
రత్నములరీతిఁ దత్కుచాగ్రంబులందు
నలుపు సొంపారి గర్భచిహ్నములు గలుగ
నతివతల్లికిసంతోషమావహిల్లె. 348

మాధవుఁడు—ఘణిధవు. (ప్రద్యుమ్నవిజయము.)

గీ. అత్త్రిమునికంటిపసుబిడ్డఁ డాకసమున
నుడుగణము లాడకాడకు నొడ్డగిలిన
బాలభానుండు నలుఁగడఁ బర్వమీటు
వెండిగుండ నుదయించె వేగుఁజుక్క. 349

చ. ఎడపక దివ్యవస్తువు లనేకము లుండుటఁ జేసి యేమిటం
గడమయిడంగ రానినిజగర్భభరంబున దేవతాపురిం
దొడరుట కప్పురంబు బిరుదుల్ గగనంబున కెత్తెనో యనన్
జొడవున నాడుచుండు నృపపుంగవ! మారుతవై జయంతికల్, 350

సీ. గబ్బిచేడెసమీరాలు కన్నుల కెనవచ్చుఁ
బలుమాఱు నవి మిట్టిపడకయున్నఁ,
నొగలనెచ్చెలికాఁడు మొగమున కెనవచ్చు
నొకయింత మేనఁ గం దుండకున్నఁ,
గ్రొవ్వున జక్కవల్ గుచముల కెనవచ్చుఁ
బ్రొద్దుపోయిన బాసిపోకయున్న,
మెఱుఁగులు మెత్తనిమేనుల కెనవచ్చుఁ
దళతళఁ బొడకట్టి తలఁగకున్న,
గీ. ననుచు సరసులు వర్ణింప నవయువాతి
విభ్రమవిలాసవిస్ఫూర్తి వినుతికెక్క
గణన మీఱినమానినీ మణులు గలరు
... ... ... ... 351

గీ. గాఢతరకాంతి కై మ్రింగుకాంతు నంత
రిక్షకాపాలికుఁడు సంతరించినట్టి
గొప్ప యగుశుద్ధపారదఘుటిక యనఁగఁ
జొక్క మగుకాంతి వేగురుఁజుక్క దనరె. 352

ఉ. చెంచెతగుబ్బచన్నుఁగవ శీఘ్రతరంబుగ నంతనంత వ
ర్తించిన యౌవనోపగమజృంభణ మెక్కననంతకంతకో
షించెను దానిసెన్నడుము జీవితనాథుఁడు వానివిల్లునన్
జెంచులరాజులన్ సవతిచేడియపిండును బక్కణంబులన్. 353

గీ. తొలుత ముంగిళ్లఁ గస్తూరిధూళిఁ దుడిచి
సహజచందనజలములఁ జాఁపి చల్లి

చారుగృహములఁ గమ్మకస్తూరి నలికి
ముగ్గు లిడుదురు పురసతుల్ ముత్తియముల. 354

ఉ. దలదవదాతకంజదళఘాతకనత్కలఘాతమల్లికా
వలులవికాసలీల శరవర్గమృణాళిమనోజ్ఞహారవ
ల్లులరవణంబునన్ సకలలోకనుతోజ్జ్వలకందబృందకం
దళములచాయఁ జంద్రకిరణంబులకుం దెలు పెక్కు నంతటన్. 355

చ. నవకపుఁదెల్లముగ్గు జతనంబునఁ గూర్చి వియద్గృహంబునన్
దివురుచు రంగవల్లికలు దేవగణంబులు చూచి మెచ్చఁగా
నవరఁగఁ దీర్చి కాల మనుజక్కలముద్దుఁడు వేడ్కతో దివా
యవనికఁ బాయఁదట్టె నన నంచితలీల వెలింగెఁ దామరల్. 356

గీ. పట్టువడ కది చపలతఁ బాఱె మనసు
సూరిజననుత! రూపతి సుడిసె గాలి
యండగొనె నారి గట్టి దై యాశుగంబు
లప్పురముగుజ్జుములవేగ మరసి చూడ. 357

ఉ. పొంకపుగుబ్బలం బునుఁగుఁబూఁతయుఁ దుమ్మెదకప్పుమేనులున్
జంకెనచూపులున్ జఘనసైకతసీమలఁ బారుటాకులున్
మంకెనచాయమోములును మానితహస్తధనుశ్శరంబులున్
కొంకక భిల్లకామినులకుం దగియుండుఁ బసిండిగుబ్బలిన్. 358

ఉ. పోలఁగ నందులం గలుగుపుష్పసుగంధుల రూపవైభవ
శ్రీ లరయంగఁ గోటయట చేరినఖేచరయక్షదైవత
స్త్రీ లని సంశయింపఁగఁ బురీజను లద్భుతదర్శనప్రియా
చాలనదూరతన్ వెఱయు సౌధహిరణ్మయసాలభంజికల్. 359

గీ. మిక్కుటపుఁగాంతి నేగురుఁజుక్క వొడిచె
బారెఁడెక్కినయపుడు గన్పట్టియుండె
నినుఁడు నరుదెంచినను రాగ మెసఁగఁ బ్రాచి
మురువుగాఁ దాల్చునాసికాభరణ మనఁగ. 360

క. మెత్తనిబంగరురవరవ
లొత్తెడుకరమూలరోచు లొలయంగను దా
రత్తులు గట్టెడుమిషమునఁ
జిత్తిణితన మెల్ల బయలు సేయుదు రచటన్. 361

## ముత్తరాజు—నెల్లూరి. (పద్మావతీకల్యాణము.)

క. నీ వెంతవేఁడుకొన్నను
గేవలపాతకుల కేల కృప పుట్టు మదిన్
దేవుఁడు 'నహి' గురువున్ 'నహి'
భావజచంద్రులకు వికచపద్మదళాక్షీ! 362

## ముద్దమరాజు—రెడ్డిపల్లె. (అష్టమహిషీకల్యాణము.)

ఉ. రామకథాసుధారసము బ్రహ్మపయోంబుధి మున్గి యుండఁగా
నేమునివాక్యమందరమహీధరసన్మథనంబుచే సము
ద్దామత సంగ్రహించి విబుధప్రకరంబున కిచ్చె నర్థిమై
నామహితుం బ్రచేతసునియాత్మజుఁ గొల్చెద నాదిసత్కవిన్. 363

శా. శ్రీవామాగ్రహలిప్తసన్మృగమదశ్రీఁ బొల్చి వక్షంబునన్
శ్రీవత్సంబు వెలుంగఁ గౌస్తుభము లక్ష్మీదీప మైయొప్పఁ ద
ద్దేవీఖేలనలోలచిత్తుఁ డగుశ్రీదేవుండు కృష్ణుండు స
ద్భావం బొప్పఁ గృపావలోకనమునన్ బాలించుఁ ద్రైలోక్యమున్. 364

## ముమ్మయ—జైతరాజు. (విష్ణుకథానిధానము.)

ఉ. అంగిటిగాల మాపదకు వ్యాధుల కెల్ల బొజుంగు భీతికిన్
గొంగ దరిద్రవృత్తిమునకుఁ గొయ్య యఘంబులవేఱు విత్తుదు
స్సంగతి వెన్నుసన్మైట విపత్ప్రకరంబులమిత్తి దేవ! నీ
మంగళనామధేయము సమాశ్రితభక్తివిధేయ నచ్యుతా! 365

చ. అమృతమువంటితల్లి కమలాసనుపట్టపుదేవి వేదశా
స్త్రములవిహారభూమి కలప్రాణుల కెల్లను పల్కుఁదోడు వి
శ్వమున సమస్తవిద్యల విశారద శారద నాదు వక్త్రప
ద్మమున వసించి మత్కృతిఁ జమత్కృతి పట్టుగఁ జేయుఁ గావుతన్. 366

చ. అరుణజటాచయంబును దిగంబరభావము సాంద్రధూళిధూ
సరితశరీరమున్ వెఱపుచంద మెఱుంగమి యెల్లచోటులన్
దిరుగుచు నున్కియున్ గలిగి తెల్లము చేసె యశోదపట్టి దా
హరిహరు లేక మూటఁ దనయం దతిశైశవవిభ్రమంబునన్. 367

క. అలకలును ముద్దుఁజెక్కులు
వలుదతొడలు మెడలు నడలు వలసినయెడలున్
చెలువుగఁ బుడుకుచు వెన్నుఁడు
వెలఁదులఁ జొక్కించి పుడుకువేఁడుఱుఁ గొలిపెన్. 368

చ. అసదృశసర్వశాస్త్రనిచయంబుల క్రొవ్వు పురాణపంక్తిలో
మిసిమి సమస్తవేదములమీఁగడ మంత్రచయంబులోనియ
య్యసురు విశిష్టధర్మములయుక్కు తపంబులచేవ యంచు నిం
పెసఁగఁగ నీదు నామము మునీంద్రులు సెప్పుదు రర్థి నచ్యుతా! 369

ఉ. ఆడఁగఁ గెంజడల్ దొలఁకి యాడఁగ జాహ్నవి దిక్కు లెల్ల న
ల్లాడఁగ భూతధాత్రి యసియాడఁగ నాకము నాకసంబు నూ
టాడఁగ ముజ్జగంబుఁ గొనియాడఁగ నిచ్చట నీవు తాండవం
బాడఁగ గౌరి నిన్ సరసమాడఁగఁ జేరు నటా మహానటా! 370

శా. ఆడెన్ దాండవ మార్భటిన్ బటుహలీలాటోపవిస్ఫూర్జిత
క్రీడాడంబర ముల్లసిల్ల గరళగ్రీవుండు జూటాటవీ
క్రోడాఘాటకరోటికోటరకుటీకోటీలుఠత్సింధువీ
చీడోలాపటలీపరిస్ఫుటతరస్ఫీతధ్వని ప్రౌఢిమన్. 371

సీ. ఆయు వగ్గలముగా నాశీర్వదించుచో
నేపుణ్యుఁ బురుడింతు రెల్లవారు?

జనులకు నేమహాత్మునిపురాణము సర్వ
వర్ణాశ్రమాచారనిర్ణయంబు?
ఏయయ్య చేసినయీశ్వరస్తోత్రముల్
పఠియించినను మృత్యుభయము వాయు?
... ... ... ధీర
శివలింగములఁ బ్రతిష్ఠించి నెగడె?
గీ. నట్టిలోకైకమాన్య మహానుభావు
సుతునిఁగాఁ గాంచి వెలసినసుకృతమయుని,
ఘను మృకండుమునీంద్రునిఁ గరివిభుండు
గనియెఁ దొలుమేనిసుకృతపాకమునఁ జేసి. 372
సీ. ఆరఁగా బండినయల్లనేరెడుపండు
మెఱుఁగున మెఱుఁగారుమేనివాఁడు,
వెడవెడ విరిసినవిరిదమ్మిఱేకులఁ
దెగడుకన్నులు గలమొగమువాఁడు,
మెండైన యేనికతుండంబు మెచ్చని
యిరుదోయిచేతులఁ బరఁగువాఁడు,
తొమ్మిదిరూపులతుమ్మెద వాయని
పువ్వుఁదామర గలబొడ్డువాఁడు,
గీ. కలిమిముద్దియ యురమునఁ గలుగువాఁడు
గడఁగి మున్నెటిసెల యైనయడుగువాఁడు
వన్నె గలపైఁడిచీరలవన్నెకాఁడు
నేఁడు నాచూడ్కిచుట్టమై నిలిచె ననుచు. 373
శా. ఆహాకావ్యము! మేలుమే లనమి యన్యాయంబు వో శారదా
ద్రోహం బేటికిఁ గట్టుకో ననుచు సంతోషించు నట్లుండు న
య్యూహాదుల్ విని సత్కవీంద్రుఁ డితరుం డొచ్చెం బపేక్షించు సం
దేహించుం దనసొమ్ము పోయినగతిన్ దీనత్వముం బొందుచున్. 374

సీ. ఉత్తుంగకర్కశవృత్తస్తనంబుల
నద్వైతభావన యతిశయిల్ల,
నత్యంతశూన్యతాయత్తమధ్యంబున
నాస్తికతత్త్వంబు విస్తరిల్ల,
స్నిగ్ధారుణారుణముగ్ధాధరంబునఁ
బ్రాభాకరాపూర్వశోభ దొలఁక,
విటమనోవిదళనస్ఫుటకటాక్షంబు ల
భేదసిద్ధాంతంబు పెంపు మిగుల,
గీ. మేన వైశేషికప్రభ గానఁబడఁగ
నొప్పుదురు వారకామిను లిప్పురమునఁ
దలఁపఁ గేవలకామశాస్త్రంబె కాదు
నిఖిల శాస్త్రంబులును నిందు నెగడు ననఁగ. 375
సీ. ఊఁకరల్ గొట్టక యుబ్బసం బందక
వెఱవక దేహంబు విఱుచుకొనక,
నిడుచన పెట్టక నిద్దోట ...
తరవాయి దప్పక తడవికొనక,
అక్షరాస్పష్టత యతిగీతనష్టత
కాకుండ నర్థంబుగానఁబడఁగ,
నయ్యైరసంబున కనురూపముగఁ బెక్కు
రాగముల్ ఘణితులు బాగుపుట్టఁ
గీ. జెఱుకుకొననుం ... వుదోఁప
కంతకంతకు వేడుక లతిశయిల్లఁ
జదువుకొన్నారు వీరలచదువుఁబోలఁ
జదువవలె దనిహాగడిరి సభికవరులు. 376
శా. ఓలక్ష్మీపతి! యోపురాణపురుషా! యోపుణ్యసంకీర్తనా!
యోలోకేశ్వర! యోగజేంద్రవరదా! యోద్వారకావల్లభా!

యోలీలామనుజావతారనటనా! యోకృష్ణ! యోయచ్యుతా
యోలిఁక నాదుమనస్సరోవరములో నోలాడవే యోహరీ!

చ. కదలదు తేరు రథ్యములు గట్టనశక్యము సూతుఁ డంటిమా
ముదుసలి చక్రముల్ సరసమోపుఘటిల్లని వల్ల నారియుఁక
గుదిగొను నమ్ము శార్ఙ్గమునకుం బనుపడ్డదిగాన వింతపెం
పొదవఁ బురత్రయంబు నెటు లోర్చితివో త్రిపురాంతకేశ్వరా! 377

చ. కమలజకృష్ణశంకరులు కాంచననీలపటీరవర్ణు లా
గమనగచంద్రధారు లఘుకంసపురారులు హంసతార్క్ష్యగో
గమనులు జన్మపోషలయకారులు వాక్కమలాంబికేశ్వరుల్
శమకరుణావిభూతిగుణసక్తులు ప్రోతురు మమ్ము నెప్పుడుఁక. 378

సీ. కమలజాతమ్ముఁడుఁ గొమరుండుఁ గూడి నీ
మూర్తియుఁ గీర్తియు మూదలింపఁ,
జతురాస్యుచదువులు జననియుఁ గూడి నీ
యునికియు మనికియు నుపచరింప,
హరిశిరోమాల్యంబు వరధనుః ప్రభయు నీ
యడుగును మడుగును నంగవింప,
శివునిరథంబును జెవికుండలములు నీ
యునికియు మనికియు నుపచరింప,
గీ. ననుసరింపఁగ నేర్తు వీవఖిలజగము
జగము లొగిఁ బ్రోవ నిల్చినజగదధీశ!
ఈశ! వాణీశ! నిర్మల హృదయవాస!
వాసుదేవ! జగత్త్రయావాస! దేవ! 379

సీ. కన్నులు నటియించుగతులకుఁ గడు మెచ్చి
చెక్కులఁ జిఱునవ్వు సేసచల్ల,
బిగువుచనుంగవబింకంబునకు మెచ్చి
లీలమైఁ జూపు నివ్వాళిసేయ,

జఘనంబు చేసినశౌర్యంబునకు మెచ్చి
వేనలి తగఁ బుష్పవృష్టిఁ గురియ,
నూరుకాండంబునౌయ్యారంబునకు మెచ్చి
మొలనూలు కైవార మెలమిఁ జేయఁ,
గీ. జెమటఁ గరఁగినతిలకము సెదరఁ గురులు
గలఁగ వదనము విరిదమ్మిచెలువుఁ దెగడ
మదనసమ్మానమందలి మగతనమున
మెఱయుగోపాంగనలపొందు మెచ్చె శౌరి. 380
మ. కరఘర్మాచరవవాద్య మింపొదవ గంగాతుంగరంగత్తరం
గరవప్రస్ఫుటతాళసమ్మిళితతత్కాంజాతపుంజస్ఫుర
ద్వరపుష్పంధయమందరధ్వనులు గీతం బొప్పఁ దౌర్యత్రికం
బిర వై యుండఁగ నీదుతాండవమహం బేపారు సర్వేశ్వరా! 381
ఉ. కాటుక చేతులఁ౯ మొగము గాఁ బులుమాడుచుఁ దల్పవస్త్రముల్
చీటికిమాటికిం దరలి చిందఱవందఱచేసి యాడుచున్
మీట నదల్ప నేడ్చుచును మెత్తనిమాటల బుజ్జగించి ము
ద్దాటకుఁ జొచ్చినఁ౯ నగుచు నట్లమరెఁ౯ హరి శైశవంబునన్. 382
సీ. చనుఁగవఁ బయ్యెద జాఱంగ జాఱంగఁ
గరమూలమున నంటఁ గదిమి కదిమి,
వేనలి వెడవెడ వీడంగ వీడంగ
నెలమి మూఁపునఁ జాల నిఱికి యిఱికి,
నుదుటిపై నలకలు సెదరంగఁజెదరంగ
నల్లని ముంజేత నదిమి యదిమి,
పొడతెంచుచెమటలు పొదలంగఁ బొదలంగ
నడరునూర్పులచేత నడఁచి యడఁచి,
గీ. చన్నులను జేతికలశంబు సరసమాడ
నవ్వు నమృతంబుఁ దమలోన నవ్వులాడ

సిగ్గు తమకంబు వినయంబుఁ జెంగలింప
వెలఁదియమృతంబు వడ్డించె విబుధతతికి. 383

(గూఢచతుర్థి.)

సీ. చూడ్కి మోమున నాభి సువిహారయోగ్యత
వలరాజుబావి జావళము సేసి,
యెలయింత బొమల మైమెలఁకువ మాటల
మరువింటిరసము లేఁబరము సేసి,
కళలఁ దనుప్రభ గతి నటనంబున
శారదమెఱుఁగుగజంబు గెలిచి,
యెలమి నవ్వునఁ గుచముల నిటలంబున
మొలకవెన్నెలమొగ్గముంపు దింపి,
గీ. పలుక నేర్చినరత్నంపుఁ బ్రతిమ లనఁగఁ
దిరుగ నేర్చినవెన్నెలతీగ లనఁగఁ
బొంద నేర్చినపుత్తడిబొమ్మ లనఁగ
నొప్పుదురు కామినీ మణు లప్పురమున. 384

మ. జయ నారాయణ పుండరీకనయనా! శార్ఙ్గి! జగన్నాయకా!
జయ పీతాంబర! భక్తవత్సల! విరించస్తోత్రపాత్రక్రియా!
జయ జంభారివిరోధివిక్రమకళాశ్లాఘావిఘాతక్రమా!
జయ గోవింద! ముకుంద! మందరధరా! శౌరీ! మురారీ! హరీ! 385

చ. తమకముతోడఁ దల్లియును దండ్రియు నొక్కట ముద్దువేఁడ సం
భ్రమమున వచ్చి తల్లిముఖపద్మముఁ దండ్రిముఖంబు నైదు వే
గమ తనయాఱుమోములను గైకొని ముద్దిడుమేటివేలుపుం
గొమరుఁడు నాదువాణికి నకుంఠితశబ్దము లిచ్చుఁ గావుతన్. 386

సీ. తియ్యవెల్లువ యను తెల్లదామరలోనఁ
గొమరారునిద్దంపుగ్రుద్ద (గుబ్బ?) యనఁగఁ,

గోడుకుఁ జూడఁగ వచ్చి కడు నిరవైనను
నిలిచినమంచుగుబ్బలి యనంగ,
ముక్కంటికొండకు నెక్కుడుగాఁగ వె
న్నుండు పాటించినకొండ యనఁగ,
నేఱులనెలఁత నిండెలమి (?) వేడుకను నై
పట్టినముత్తెపుబంతి యనఁగఁ,
గీ. బుడమిముద్దియ గందంపుఁబూఁతతోడి
చన్నుఁగవనాఁగఁ జుక్కలసంగడీల
గనియొకో యనఁ దెలుపులగద్దె యగుచుఁ
దెల్లమిగ నొప్పు నత్తెల్లదీవిమీఁద. 387

శా. ధాటీధూళియుఁబోలెఁ బుష్పరజముల్ దట్టంబుగా నుల్లస
ద్ఘోటీకోటులమాడ్కిఁ జూతతరువుల్ గ్రొవ్వారఁ జంచచ్చల
త్పాటీరానిలలోలపల్లవము లుద్యత్షడ్గసంఘంబుగాఁ
బాటిల్లెన్ వనవాటిఁ జైత్రుఁడు జితప్రాలేయసంరంభుఁడై. 388

సీ. నారాయణునకుఁ బ్రణామంబు గావింతు
నడుగుల కెరఁగుదు నచ్యుతునకుఁ,
గైటభారికి నమస్కారంబు వాటింతు
మ్రొక్కు సేయుదు నాదిమూలమునకు,
వందనం బొనరింతు వాసుదేవునకును
దండ మొనర్తు గదాధరునకుఁ,
బ్రణతిసంపాదింతుఁ బరిపూర్ణమూర్తికి
నంజలి ఘటియింతు నఖిలపతికి,
గీ. ననుచు నానందభరితు లై యమరదైత్య
మునినరోరగముఖ్యులు వినతు లగుచుఁ
గొలువ నొప్పుజగత్పతిఁ గొలుతు నిన్ను
నఖిలభూతాత్మ! యాదినారాయణాత్మ! 389

ఉ. పూర్వకవీంద్రులం గొలుచుపూనికి నిప్పటివారిఁ గొల్తు ని
ర్గర్వత నిక్కవీంద్రులు పురాణకవీంద్రులకంటెఁ దక్కు వే?
యుర్విని నేఁటివా రగుట యొచ్చెమె? నేఁడును దామ్రపర్ణిలోఁ
బూర్వపుముత్తియంబులను బోలినమౌక్తికరాజి లేదొకో? 390

ఉ. భారవిఁ గాళిదాసు శివభద్రుని మాఘుని బాణు భామహుం
జోరు మయూరునిం దలఁచుచున్ మఱియుం గవులౌ విదగ్ధు లె
వ్వారలు వారి నెల్ల ననవద్యుల నాద్యులఁ బ్రస్తుతింతు సం
సారసుఖైకసారవిలసత్కవితావరవైభవార్థి నై. 391

చ. మదమును మందమేలమును మందటయుం దమకంబు వేడ్కయుం
గుదిగొనియున్న జవ్వనపుఁగొమ్మలకాంక్ష యెఱింగి యెంతయున్
బ్రిదులనికౌఁగిలింతలను బింకపుఁగ్రీడ నఖక్షతాదులన్
మదనగురుం డనంగసుఖమర్మములం దనిపెం బ్రవీణుఁడై. 392

సీ. మేరురోహణముఖభూరిమహాశైల
కులజనకాయితగోపురంబు,
సోమసూర్యాద్యనానామహాస్సముదయ
జననీభవద్వప్రచక్రశతము,
అభ్రగంగాయమునాదిప్రవాహసం
ఘాతధాత్రీభూతకేతనంబు,
సౌదామనీశక్రచాపపురస్సర
ద్యుతిదేశికాయితతోరణంబు,
గీ. నిఖిలపాతాళపాతాళనిమ్నపరిఖ
మూర్ధ్వలోకోర్ధ్వలోకాయితోచ్చసౌధ
మసదృశానేకశుభవిభవాస్పదంబు,
పుణ్యసులభంబు వైకుంఠపురవరంబు. 393

సీ. రాగంబు లగుశుద్ధరాగసాళగరాగ
సంకీర్ణరాగముల్ చక్కఁదీర్చి,

స్త్రీపున్నపుంసకరూపంబులను వాని
వేళలు మైత్రియు వెలయఁ జూపి,
తానప్రపంచవిస్తారంబు చూపుచోఁ
గ్రొత్తతానంబులు గొసరికొసరి,
స్వరమూర్ఛనాగ్రామజాతిశ్రుతులలక్ష
ణములకు నపుడులక్ష్యములుగ[?]
గీ. ......లింపు లొదవంగఁదగినశుద్ధ
దేశమార్గములును రాణఁ దేటపడఁగ
సకలమోహనసంగీతచతురుఁ డగుచు
వేణుగానంబుఁ బ్రకటించె విశ్వగురుఁడు. 394
సీ. లసదురఃస్థలమునఁ బస నైనగళమున
విలసితలీల శ్రీ నిలిపినారు,
చరణంబుపట్టున జడలలోచుట్టున
ననువొందఁగా గంగ నునిచినారు,
భవ్యగుణంబున దివ్యదేహంబున
నొఱపు మీఱఁగ భూతి మెఱసినారు,
తిరముగా మూఁపునఁ గర మొప్పురూపునఁ
బొలుపొందఁగా ధాత్రిఁ బూనినారు,
గీ. తెల్ల గలయిండ్ల నిలిచి వర్తిల్లినారు
ఇరువు రిరువురభార్యల నేలినారు
పెక్కుమొగములకొడుకులఁ బెనిచినారు
హరిహరులు వీరు సర్వలోకాధిపతులు. 395

(గూఢచతుర్థి.)

సీ. వలపుల బొమల మైనిలుకడఁ గన్నులఁ
బుష్పచాపధ్వజస్ఫూర్తిగలిగి,

కాంతి గంధంబునఁ గరములఁ దనువల్లిఁ
గనకపంకజదామగరిమఁ దాల్చి,
కురులను బొడ్డునఁ బిఱుఁదునఁ గుచమున
ఘనసరసీచక్రగతి వహించి,
నేర్పున నగవున నిగ్గున మొగమున
శారదామృతభానుసమితినొంది,
గీ. కాను నఖములసొబగును గల్గి చూపు
హరిమణిశ్రీసమానత నతిశయిల్లి
రూపశుభలక్షణమ్ముల నేపుమిగిలి
వెలఁదు లమరుదు రవ్వీట వేశ్యతోడ. 396
చ. వల పెటువంటిదో ముసలివాఁ డనవచ్చునె యద్దిరయ్య! ప
ల్కులజవరాలు దాఁ జదువులోన జపంబులలోనఁ బాయ ద
గ్గలముగ నెల్లప్రొద్దును మొగంబునఁ గట్టినయట్లు యుండు నీ
నలువకు నంచుఁ గాముకులు నవ్వవిధాత శుభంబు లీవుతన్. 397
చ. వెడవెడఁ గౌఁగిలించుచును వేమఱుఁ జుంబనలీల మోవియుం
దొడుకుచు బుజ్జగించుచును దొంగలిచూపుల లోన సిగ్గుతో
నుడివడుభీతి వాపి మదిసోఁకునకున్ సొగియంగఁ జేసి యే
ర్పడ రతిసౌఖ్యముల్ మరపె బాలలకుం గమలాక్షుఁ డింపుగన్. 398
చ. వెనుకకుఁ బోక యీయనక నేసటఁ బొందక పంక్తిపంక్తికిన్
బెనుపక కానమిన్ భ్రమసి బెగ్గిల కంతయు మున్న చూచుచున్
గనుఁగొని యక్షరాక్షరముకందువ దప్పక యేకచిత్తుఁ డై
యనుపమభక్తితోఁ జదువునాతని వాచకుఁ డిండ్రు భూవరా? 399
సీ. శృంగారవిభుఁ డని చెప్పంగ నేటికి
భావజుఁ గొడుకుఁగాఁ బడసె ననినఁ?
గారుణ్యనిధి యని గణుతింప నేటికి
సృష్టిరక్షణనిత్యశీలుఁ డనినఁ

బరమపావనుఁ డని ప్రణుతింప నేటికి
గంగఁ బాదంబునఁ గాంచె ననినఁ?
ఘనవైభవుం డని కొనియాడ నేటికిఁ
గలిమిముద్దియ కులకాంత యనిన?
గీ. విష్ణుఁ డఁట యడ్డ నేటికి విశ్వమూర్తి
యనఁగ? నచ్యుతుఁ డఁట నిత్యుఁ డనఁగ నేల?
యని మునీంద్రులు గొనియాడ నతిశయిల్లు
నమ్మహాత్ముండు సర్వలోకాధికుండు. 400
శా. శ్రీరామాస్పద మైన పేరురముపై శ్రీవత్సచిహ్నంబుఁ దా
నారూఢంబుగఁ దాల్చి శ్రీకిఁ దగుచిహ్నంబుల్లువాఁ డౌట సాం
పారం దెల్లమి సేయుదేవుఁడు కృపావ్యాసక్తుఁ డై మామక
ప్రారంభంబు నిరంతరాయశుభసాఫల్యంబుఁ గాఁ జేయుతన్. 401
శా. శ్రీనిత్యాశ్రయ మై మహామధురిమశ్రీపేర్మికిన్ సంతత
స్థానం బై యనపాయ మై యనఘ మై తాపఘ్న మై స్వచ్ఛ మై
యానారాయణుశుద్ధసత్త్వగుణ మీయాకారముం దాల్చెనో
నా నొప్పారుఁ బయఃపయోధి నిఖిలానందైకసంధాయి యై. 402
శా. శ్వేతద్వీపము దుష్కృతాంధతమసచ్ఛేదక్రియాదీప ము
ద్భూతాఖండసుఖస్వరూప మమరస్తోమాద్భుతాటోప ము
త్ఖాతామర్త్యరిపుప్రతాపము నతధ్వస్తోగ్రసంతాప మ
జ్ఞాతాక్షుప్రియరూప మార్యహృదయప్రక్షేప మొప్పుం దగన్. 403
క. సుతుఁడుఁ దటాకము దేవా
యతనము నల్లిల్లు నిధియు నారామము స
త్కృతియు ననుసంతతులయం
దతిశయము ప్రబంధ మెపుడు నక్షయ మగుటన్. 404
సీ. సూర్యునిఁ బోలుకౌస్తుభముపైఁ బ్రాలంబ
మనియెడుపరివేష మతిశయిల్ల,

మేఘంబుసరి యైనమేనిపైఁ బీతాంబ
రప్రభ యనుతటిత్ప్రభలు మెఱయ,
నిండుఁజందురు నవ్వునెమ్మొగంబున సుప్ర
సన్నత యనుసుధాసార మమర,
జలజంబుఁ దెగడెడుచరణంబునను దివ్య
దీక్షి యనుపూవుఁదేనె దొరఁగ,

గీ. హస్తముల శంఖచక్రగదాంబుజంబు
లమర ధర్మార్థకామమోక్షములమాడ్కి
నఖిలలోకేశుఁ డాద్యుఁ డవ్యయుఁ డమేయుఁ
డమ్మహాత్ముండు మెఱయు నారాయణుండు. 405

చ. స్ఫురదురుకర్ణతాళమునఁ బుట్టినగాడ్పున విఘ్నవారిదో
త్కరములఁ బాఱఁదోలి మదధారల విశ్వముఁ దొప్పదోఁచుచుఁ
గరివదనుండు దోడుపడుఁగాత! మహాగణనాథుఁ దర్థితోఁ
గరివదనస్తవంబు పని గైకొని సల్పిన నాకు సత్కృతిన్. 406

రంగనాథుఁడు.

చ. అదలనితేరు తేరనకు నాడరు వై తగువిల్లు వింటికిం
గుదు రగునారి నారిపయిఁ గూర్కుశరంబు శరంబు బొడ్డునం
బొదలినయంత యంతముఖముల్ నిజవాసము లైనగుట్టముల్
చెదరక నీకు నెట్టిపని సేయునయా! గిరిజాధినాయకా! 407

సీ. ఓజు చేయుట్టక యొగ్గానఁ బట్టక
చక్కఁగా దివిఁ బాఱుచక్రములును,
లాయానఁ గట్టక లలి మేఁత పెట్టక
వర్ణహీనం బైనవారువములు,
తవన పెట్టక జీవితము కాసు ముట్టక
సత్త్వసంపదఁ జూపుసారథియును,

కడచీలఁ దట్టక ఘనముగా మెట్టక
గంభీరసంపద గలుగునిరుసుఁ,
గీ. గలిగి తనరారునరదంబుఁ గడఁక నెక్కి
త్రిపురవిజయంబుఁ జేకొన్న దేవదేవుఁ
డిందుశేఖరుఁ డానందమందిరుండు
మనలఁ గరుణావిధేయుఁ డై మనుచుఁ గాత! 408
ఉ. గోశతపంచవార్ధులును గోయుగవార్ధులు గోత్రివార్ధులున్
గోశరవార్ధులున్ విదితగోశత (వార్ధులు) పంచవార్ధులా
కేశవతల్పపద్మభవకేకిపవాహనదానవేశదే
వేశుల కిచ్చునట్టిపరమేశ్వరుఁ డీవుత మా కభీష్టముల్. 409

రామయ్య—వాసిరాజు. (బృహన్నారదీయము.)

శా. అంభోజాసనమానసాంబుజభవుం డధ్యాత్మవిద్యోన్నతా
రంభుం డిద్ధతపోవిశేషశమితప్రస్ఫీతఘోరాఘసం
రంభుం డంచితశాంతిసంయుతుఁడు భారద్వాజమౌనీంద్రుఁ డు
జ్జృంభించెన్ వరసప్తసంయమిజనశ్రేణీసముద్భాసి యై. 410
సీ. మల్లికానవసముత్ఫుల్లపాటలపుష్ప
వల్లరీసౌరభ్యవాసితంబు,
కాసారనీరజవ్యాసక్తమధుకరీ
ఝంకారముఖరితాశాముఖంబు,
పద్మాప్తకిరణప్రభావలీసంతప్య
మానసర్వంసహామండలంబు,
దహనహేతిచ్ఛటాదందహ్యమానదు
ర్గమఘోరకాంతారసముదయంబు,
గీ. చటులతరనిర్భరోష్ణసంసక్తవాత
శోషితాశేషనిమ్నగాస్తోమజంతు

సంచయంబును నగుఘుర్మసమయ మేచి
పర్వె నతిసాంద్ర మగుచు దిగ్భాగములకు. 411

సీ. విశ్వంభరాచక్రవిజయలక్ష్మీఘన
స్తనపరీరంభదోస్స్తంభయుతుఁడు,
బాడబానలశిఖాభంగభానుప్రభా
ద్యోతమాన ప్రతాపోజ్జ్వలుండు,
కుంభీనసాధీశగురుపద్మసంభవ
స్ఫుటశేముషీకళాభూషణుండు,
సురసింధుశరదభ్రశుభ్రాభ్రకాదభ్ర
విభ్రమస్థిరయశోవిశ్రుతుండు,
గీ. విపులకోదండనిర్ముక్తవిశిఖనివహ
దారుణోదగ్రదహనదందహ్యమాన
సమదశాత్రవరాజన్యచటులవిపిన
సముదయుండు భగీరథక్ష్మావరుండు. 412

రామయ్య—ఆంధ్రకవి (విష్ణుకాంచీమాహాత్మ్యము).

మ. అరుణస్ఫూర్తి సురేంద్రదిక్తటమహావ్యాప్తిఁ విజృంభింపఁగా
శిరసు ల్వంచెఁ జకోరవర్గములు హెచ్చెం జక్రవాకంబు లా
తురతం గైరవపంక్తి దూలెఁ గడు సంతోషించెఁ బద్మంబు లొ
క్కరిచే టొక్కరిమేలుపా మ్మనుట నిక్కం బైనచందంబునన్. 413

శా. ఇష్వాసక్రకచాదిసాధనపరాహీనప్రభాంగీకృతా
భిష్వంగద్యుమణిద్యుతిప్రకరుఁ డై పీతాంబరాలంకృతున్
విష్వక్సేనునిఁ గౌస్తుభాభరణు సుర్వీశ్రీయుతుం గొల్చి యా
విష్వక్సేనుఁడు సంచరించు గణరాడ్విఖ్యాతుఁ డాచక్కటిన్. 414

క. కాంచనబహువిధరత్నా
భ్యంచిత మై చిత్రరచనబంధురతర మై

మించి సురాసురముఖ్యులు
కాంచి నుతింపంగఁ గాంచి కాంచిం బోలెన్. 415

సీ. గజకచ్ఛపంబు లె
రనికుక్షిలోనికినిరాది(టి)[?] భిక్ష,
సకలలోకములు నేజవసత్త్వసంపన్న
ఖురళికాయాత్రకు గోష్పదంబు,
బలభేదివజ్ర మేయలఘు ఱెక్కలలోనఁ
జిక్కి పెంపే (ఁదిన) చిఱుతపుల్ల,
కద్రూతనూజవర్గంబు లేమహనీయు
నాగ్రహంబునకుఁ జొక్కాకుపదువు,
గీ. లతఁడు హరిఁ గొల్వ నచ్చోటి కరుగుదెంచె
శంఖచూడసుదక్షిణాక్షుమపయోద
వాహనోద్గారతాభీలసాహసైక
జనితదాక్షిణ్యుఁ డైనట్టివినతపట్టి. 416

సీ. తనుఁ బట్టి విడువనితగవరి యితఁ డంచు
మృడునకు నొకవంక మేలు సేసెఁ,
దనకుఁ బూర్వాశ్రితుఁ డని సురాధ్యక్షుని
శతకోటిధనసమన్వితునిఁ జేసెఁ,
దనపాదములు నితాంతముఁ జేరి కొలువఁగ
రాజీవశత్రుని రాజుఁ జేసె,
దనకు గుణంబుగాఁ దగిలియుండుట చూచి
యహికులాధిపుని భోగాఢ్యుఁ జేసె,
గీ. ననుచు మిన్నక కొనియాడినను నిజంబ
యగుచుఁ దనయందుఁ గాన్పించు ననుదినంబు
జగతి నొప్పారు శ్రీశైలచక్రవర్తి
యసమతరకీర్తి నిత్యకల్యాణమూర్తి. 417

శా. ద్రాక్షాపాకనవీనవైఖరిఁ బ్రబంధస్తోమముల్ సెప్పి య
ధ్యక్షుం డయ్యె మహాకవీంద్రులకు నాహా! యెట్టిపుణ్యాత్ముఁడో
సాక్షాద్భారతి గాక యీతఁడు మనుష్యవ్యక్తి యే యంచు సం
లక్షింపం దగు కాళిదాసుఁ గృతిలీలావ్యాసుఁ గీర్తించెదన్. 418

సీ. పడియలలోపలఁ బడి యలందురుఁ గాక
గండుమీనము లంబకముల సరియె?
పొదలు మాటుగ నేచి పొదలుట గనుఁగాక
యలరుగుత్తులు కుచావళుల సరియె?
గహనంబులోననగహన మై చనుఁ గాక
చమరవాలములు కేశములసరియె?
ఘనములయొద్ద నఘనము లై మనుఁ గాక
తళుకులు మించుగాత్రములసరియె?

గీ. కలువ లొండెను జక్రవాకంబు లొండెఁ
దేఁటు లొండెను బువ్వారుఁదీగె లొండెఁ
గాక యని ప్రస్తుతింప నాకాంచిలోన
సతులు విలసిల్లుదురు హేమలతలుఁబోలె. 419

చ. రసికత సోలిసోలి యనురాగరసంబునఁ దేలితేలి యా
కసములు మెట్టిమెట్టి తమకంబునఁ గాంతలఁ బట్టిపట్టి యా
దొసకులఁ జిక్కిచిక్కి కడుదూరముగాఁ జని తక్కితక్కి పై
కొస రెసఁగం జకోరికలు కోరిక లీరిక లొత్త మత్తిలున్. 420

సీ. రాలుకారాకులఁ గ్రాలుమాటాకులఁ
గలయ భూజము లెల్లఁ గానరాఁగ,
సతులడెందంబుల నతులమందంబుల
వికసనం బాత్మకు వ్రేఁగు గాఁగ,
బొలుచుదారకముల గెలుచుకోరకముల
విరవాదితీగెలు విఱ్ఱవీఁగఁ,

జంపకజాలంబు నింపక యోలంబు
గొని పవ్వులనె తేఁటికోలము లాఁగ,
గీ. నెంతయును వింత యిది యన నంతనంత
సంతతాక్రాంతమదననితాంతతాంత
కాంతకాంతాకదంబక స్వాంతములకు
సంతసము నింప వచ్చె వసంత మంత. 421

సీ. శబ్దశాసనకావ్యసంఘట్టనక్రమా
నందితబుధవర్యు నన్నపార్యు,
నుభయభాషారచనోన్నిద్రభద్రవ
చోరాజిఁ దిక్కనసోమయాజి,
లక్ష్యలక్షణకళాలంకారసౌభాగ్య
సత్కావ్యవిన్యాసుశంభుదాసు,
ఛందోనిబంధనచాతురీభాగేయ
వాగ్ధాము వేములవాడభీము,
గీ. రసికజనపద్మదిననాథు రంగనాథుఁ,
బ్రకటకృతికర్మనిస్తంద్రు భాస్కరేంద్రు
నమితరసభావు శ్రీత్రిపురారిదేవు
సూక్తిలిమిధాము నాచనసోముఁ దలఁతు. 422

సీ. శ్రుతులును నిర్జరస్థితులును మగిడింప
నిగిడింపఁ జాలునీనేర్పుకలిమి,
ధరణియు రిపుగర్వసరణియు ధరియింప
హరియింపఁ జాలునీయలవుకలిమి,
భ్రాత నర్థిలిఁ గన్నమాతను బాలింప
లాలింపఁ జాలునీలావుకలిమి,
గేహిని రవిసుతావాహిని సాధింప
భేదింపఁ జాలునీపేర్మికలిమి,

గీ. జనులఁ బాతకజనులను జరుప నురుప
నలరునీనేర్పుకలిమి చిహ్నములు నీకు
మత్స్యకూర్మమహీధరమనుజసింహ
ఖర్వరామత్రయీబుద్ధకల్కిగతులు. 423

## రామరాజు—ఎలుకుర్తి. (రామలింగశతకము.)

సీ. గంగాప్రవాహంబు కన్నెగేదఁగిరేకు
నమృతాంశురేఖ ముత్యాలసేస,
యురగేంద్రహారంబు కురువిందములపేరు
విసము కప్పురముతో పీడియంబు,
ప్రాఁతకంకటికాలు పంకసంజాతంబు
జింకపిల్లయు రాచచిలుకబోద,
యిభచర్మచేలంబు నింద్రగోపపుఁబట్టు
భూతిపుంజము నవ్యపుష్పరజము,
గీ. హేమగోత్రకోదండంబు నిక్షుధనువు
గలుగునర్ధనారీశ్వరాకారమునను
భువనజాలంబుభక్తులఁ బ్రోవుమయ్య!
రాజహంసరథాంగ! శ్రీరామలింగ! 424

## రామలింగయ్య.—తెనాలి. (కందర్పకేతువిలాసము.)

ఉ. అక్కమలాక్షిఁ గన్గొనినయప్పటినుండియు నేమి చెప్ప నా
కెక్కడఁ జూచిన న్మదనుఁ డెక్కడఁ జూచిన రోహిణీవిభుం
డెక్కడఁ జూచినం జిలుక లెక్కడఁ జూచినఁ గమ్మగాడ్పు లిం
కెక్కడ వెట్ట యోర్వఁగల నీవిరహానలతాపవేదనన్. 425

ఉ. కామిని చంద్రుఁ జూచి మదిఁ గందు సరోరుహగంధి మందిరా
రామముఁ జూచి మ్రానుపడు రాజనిభానన సారెకున్ శుక

స్తోమముఁ జూచి యేఁకరును దొయ్యాలి కోకిలఁ జూచి కంటఁ గెం
పౌమదలీలఁ దాల్చు మదనానలతాపవిషాదవేదనన్. 426

సీ. తారామనోరంజనారంభ మేదొడ్డు
శిలలు ద్రవింపంగఁ జేయు ననినఁ
జాకోరహర్షయోజనకేళి యేదొడ్డు
పేర్చి యంభోధు లుబ్బించు ననినఁ,
గుముదౌఘతాపోపశమకృత్య మేదొడ్డు
సృష్టియంతయుఁ జల్లసేయు ననిన,
వరనిశాకామినీవాల్లభ్య మేదొడ్డు
వర్ణింప సత్కళాపూర్ణుఁ డనినఁ,
గీ. దనకు సర్వజ్ఞశేఖరత్వంబు గలుగ
హితసుధాహారవితరణం బేమిదొడ్డు
ననఁగ విలసిల్లె హరిదంతహస్తిదంత
కాంతినిభకాంతిఁ జెలువారి కంజవైరి. 427

ఉ. వారిజ! మీన! కోక! యళివర్గ! సితచ్ఛద! సల్లతావనీ!
మీరుచిరాస్య మీనయన మీకుచ మీయలకాళి మీగతిన్
మీరమణాంగి మత్ప్రియ నమేయగతిన్ విరహాతురాననన్
మీరును మీరు మీరు మఱి మీరును మీరును మీరుఁ గానరే? 428

## రామలింగయ్య — తెనాలి. (హరిలీలావిలాసము.)

శా. ఆకరివేల్పుసామిచరణాబ్జములన్ జనియించినారు మం
దాకినితోడునీడ లయినారు నిజంబుగఁ గమ్మకట్టి దా
మై కమనీయకీర్తిమహిమాతిశయంబున మించినారు భ
ద్రాకృతు లద్రిధీరులు ప్రభౌద్రులు మాద్రులు శూద్రు లప్పురిన్.

ఉ. ఆలఘృతంబు వేఁడి యగునన్నము నుల్చినముద్దపప్పు క్రొం
దాలిపుకూర లప్పడము ద్రబ్బెడచారులు పానకంబులున్

మేలిమిపిండివంటయును మీఁగడతోడి దధిప్రకాండముల్
నాలుగుమూఁడుతోయముల నంజులు గంజదళాక్షి పెట్టఁగన్ 430

గీ. ఉడుపథం బనుములుదోసతోడిమయూడఁ
దామరసబంధుఁ డనుపండు తనకుఁ దానె
వికృతి గనుపింపఁ గనుపట్టువిత్తు లనఁగఁ
దనరె నెఱసంజఁ గెం పగుతారకములు, 431

ఉ. ఎంతయు రాజుతోడి పగ యేకొదవో? మధుపప్రసక్తి య
శ్రాంతముఁ గల్గుతమ్ములప్రచారము గాదని చూడ నోడి దే
శాంతర మేఁగె నాఁగ నపరాశఁ బతంగుఁడు దాఁగె నట్టి వృ
త్తాంత మెఱింగి సి గ్గొలసినట్టులు గందె సరోరుహంబులున్. 432

ఉ. ఏటిమహానుభావుఁ డిహిహీ జమదగ్నితనూజుఁ డేడుము
మ్మాటులఁ గాని శత్రుమదమర్దనదక్షుఁడు గాఁడు గోత్రమే
తూఁటుగఁ జేతఁ దల్లిమెడఁ ద్రుంచెఁ గదా యని యీసడింతు రా
గాటపుపంతగాండ్రు కులగణ్యు లగణ్యులు పుణ్యు లప్పరిన్. 433

ఉ. కాలధనంజయుండు తనుఁ గాచి దివాకరమత్స్యయంత్రమున్
గీలెడలించి సంధ్య యనుకృష్ణ నుదంచితరూపవిభ్రమ
శ్రీలలితాంగినిం దగ వరించి తమోమయధార్తరాష్ట్రభూ
పాలకసేన నేయుసితభల్లములో యనఁ బర్వెఁ దారకల్. 434

ఉ. చంగునఁ దాఁటు ధే యనిన సప్తసముద్రములైన వేగ వా
గెం గుదియింప నిల్చు నడుగెంటనె శస్త్రనిపాతధీరతన్
సంగరరంగవీథిఁ దనస్వామికి గెల్పు ఘటించునట్టియు
త్తుంగతురంగరత్నములు తొంటిహయాకృతిశార్ఙ్గిపుట్టువుల్. 435

గీ. భానుశశిమండలంబుల లోనడంచి
యిరులుపెనువానఁ గురియుచు నేపు చూపు
రాత్రివర్షర్తువునఁ బుట్టెఁ బ్రతిగ్రహాక
రములఁ బటుదీపవైడూర్యరత్నసమితి. 436

చ. తెలతెలవాఱ నొయ్య నరుదెంచు నిశాంతరతాంతతాంత లా
చెలువల కింపుగా మెలఁగుఁ జెక్కులఁ గూరినచూర్ణకుంతలా
వళి సరసంబుగా జడియు వాడినసెజ్జలమీఁది ప్రావిరుల్
దొలఁగఁగఁ జేయు నూడిగపుఁదొయ్యలులంబలె వేగుఁదెమ్మెరల్. 437

సీ. నీ ఠంకఁ దొడఁగె వెన్నెలమానికంబుల
వేఁడిరాతూపుల విడిసె వహ్ని,
కలఁగె జీవంజీవములనిండుమనములు
జక్కవపులుఁగులజాలి వదలెఁ,
గనుమూసెఁ గుముదకాననవిభావిభవంబు
శ్రీలక్ష్మి నిలిచె రాజీవపీఠి,
వాజువాఱఁగఁ జొచ్చె వరుణునిదిక్కున
నేర్పడి దీపించెఁ దూర్పువలను,
గీ. తార లుడివోయె వికసించెఁ దరుల విరులు
చంద్రికలు గందెఁ గొలఁకులు చాలఁ దేరె
దీపరుచి డాఁగెఁ దలసూపె రేపటెండ
చందురుఁడు వ్రాలెఁ బొడిచెఁ గంజాతహితుఁడు. 438

ఉ. పున్నమచందమామఁ బొరఁపుచ్చి సుధారస మొయ్యఁజిల్కుచున్
సన్నముగాఁగ నూరి ఘనసారమునం బ్రతిపాక మిచ్చి మీఁ
ద న్నెఱయంగ నల్కినవిధమ్మున వెన్నెల గాయ నప్పురిన్
సున్నపుమేడ లభ్రపదచుంబిశిరోగ్రహరాజి రాజిలున్. 439

క. పురనిధిరక్షకునై ఫణి
పురము వెడలి వెట్టివెట్టి పొంగారుఫణా
ధరపరివృఢుకరణి భయం
కర మగుఁ బ్రాకారపరిధి కడు నచ్చెరు వై. 440

సీ. మదభిన్నకటగళన్మౌక్తికంబులు తొట
తొట రాల మస్తవిధూననముల,

ఆనమత్కుతలంబు లగుపదక్రమముల
ఘణఘణంకృతి సాభిఘంట లులియఁ,
గీర్తిచంద్రికలయాకృతి దట్టి పై ధళ
ధళఁ బర్వ దంతకుంతములరుచులు,
పుష్కరప్రూత్కారముల నకాలపువాన
కారు లెల్లెడఁ దముతార కురియఁ,

గీ. దమకుఁ బరవాహినులలోను దఱియఁ జొచ్చి
క్రీడ లాడుట యుచితపుజాడ లనఁగఁ
జెరిఁగి సరయూజలంబుల సరసలీల
గ్రాలఁ జనుచుండు నప్పురి గంధకరులు. 440

సీ. ముదురుఁజీఁకటిమన్నెమూఁకకుఁ గైజీత
మొసఁగుకుంతలములయొప్పు వెలయఁ,
బండువెన్నెలరాజు బంటుగా నేలు చ
క్కనిమొగంబులనిక్కఁ గని భజింపఁ,
బసిఁడిగ్రేనిఁజేపట్టుకుంచము సేయు
జిగి మించుచన్నులబిగువు నిగుడ,
గబ్బియేనిఁకదొర గారాముగాఁగ మ
న్నించులేనడపుల నేర్పు మెఱయ,

గీ. నూరువులె గాదు రంభ మైయొఱపుఁ దమవ
శమ్ము గావింపఁ, బద నఖచయమె కాదు
విలసనముఁ దార పాటింప, వీటఁ బద్మ
పత్త్రనేత్రలు చాలఁ జూపట్టుచుంద్రు. 441

చ. యుగములు వేయు వోవు నొకయుద్దరువుల్ గణుతించు నంతకే
యుగములు లక్ష చెల్లుఁ బోరి నున్నధనంబు మితింప నమ్మహా
యుగశతకోటు లేఁగు నితరోన్నతవస్తువు లెన్నఁ గీస వె
ల్తిగ నలకాధినాథులుగదే పురిలో మనువైశ్యపుంగవుల్. 442

ఉ. రాసి సహస్రభానుఫణరత్నములెల్లను బోవఁదన్నుచున్
వాసరభోగిఁ గాలఫణివైరి కడున్ వడి నొక్కి నక్కఁగాఁ
జేసినఁ గ్రమ్ము తద్రుధిరశీకరపూరవిజృంభణం బనం
గా సముదగ్రతం బొలిచెఁ గ్రమ్మి జపోపమసాంధ్యరాగముల్. 443

సీ. వలమాన చంపకోత్పలమాలికాదిసం
గ్రథనచాతురి నెఱకవులఁ బోలి,
దళము గెలిచినమాత్రమున నూల్కొల్పునే
ర్పున యోధవీరులపోలుపుఁ దెలిపి,
ఖండితత్వమున రాగము గలపల్లవా
వలిఁ గోయుటల వేశ్యలవలపు నెఱపి,
పలుతావు లరసి యెత్తులు పచరించుపెం
పున జూదరుల తేవ పోడముఁ జేసి,

గీ. తమనిజాంగమరీచులు తత్తదన్య
పుష్పములసావి నిక్కంపుఁబువ్వు లనుర
పేరఁ బేర్కొనుపొరులఁ గేరికేరి
నవ్వెదురు పుష్పలావికానలినముఖులు. 444

సీ. వినుతమాణిక్యవందనమాలికాకాండ
కల్పితరోహితాకారరేఖ,
జాలకాననిర్యదాలోలవాసనా
గరుధూపపోషితకంధరాళి,
చంద్రశాలాతిగర్జన్మృదంగధ్వాన
విరచితపరిఘోషవిభవలహరి,
సంభోగసంరంభసమయావిచ్ఛిన్నము
క్తాహారమణికృతకరకనికర,

గీ. మదసమదభారమంథరమత్తకాశి
నీదృగంచలసంచితనిబిడచంచ

లాలతాతల్లజయు నై యిలావివిక్త
వర్ష యననొప్పుఁ గాకుత్స్థవంశ్యనగరి. 445

ఉ. వేదపురాణశాస్త్రములు వేడుకవిద్యలు, సర్వయజ్ఞసం
పాదనశక్తి నిత్యనిరపాయవిధిప్రతిపాలనంబు, దా
రాదిమతత్త్వముం గనుట హస్తగతామలకంబుఁ గంట, ధా
త్రీదివిజావతంసుల కరిందమ మప్పురిఁ గల్గువారికిన్. 446

చ. సరళదలత్సరోరుహసారపరాగపరంపరాపరి
స్ఫురితసువర్ణవర్ణమును బూరితదిఙ్ముఖహంసనాదమే
దురమును నై యగడ్త కనుదోయికిఁ బండువుసేయ మ్రోయుఁ ద
త్పురవరలక్ష్మి యెప్పుడును బూనెడుకాంచనకాంచియో యనన్. 447

చ. సరసులపొందు గల్గనఁగఁ జాలి బహూన్నతచారుశాఖలం
బెరిఁగి మహాద్విజావనమె ప్రేక్షి నిజాయతి గాఁ దనర్చి ని
ర్భరజనతాపసంహరణపాత్రము లయ్యె మహీజవాటికల్
పురివెలి నిల్చె మేటియు నపూజ్యుఁ డగున్ మధుపానుకూలతన్. 448

## వల్లభరాయఁడు—(వీథినాటకము).

సీ. చంద్రఖండములతో సరివచ్చు ననవచ్చు
విమలదంష్ట్రాప్రరోహములవానిఁ,
బవడంపుఁగొనలతోఁ బ్రతి వచ్చు ననవచ్చు
కుటిలకోమలజటాచ్ఛటలవాని,
నింద్రనీలములతో నెన వచ్చు ననవచ్చు
కమనీయతరదేహకాంతివాని,
నుడురాజరుచులతో నొఱ వచ్చు ననవచ్చు
చంచన్మదాట్టహాసములవాని,
గీ. సిగ్గుమాలినమొలవానిఁ జిఱుతవాని
నెల్లగాలంబు మలికినాఁ డేలువాని

నర్థి మోపూర నవతార మైనవాని
భైరవునిఁ గొల్వ వచ్చిరి భక్తవరులు. 449

వీరయ్య—పిల్లలమఱ్ఱి. (పురుషార్థసుధానిధి.)

సీ. కాశకర్పూరనీకాశఁగా భావింపఁ
గవితానిరూఢిఁ బ్రఖ్యాతి నెసఁగు,
యావకారుణదేహయష్టిఁ గాఁ జింతింప
మదకుంభియానల మరులుగొలుపు,
నీలజీమూతసన్నిభఁగా విలోకింప
సకలమాయాప్రపంచంబు నడచుఁ,
గనకచంపకధామగౌరిఁగా శీలింప
నంహస్సమూహంబు సంహరించు,
గీ. శంభుదేవి విశాలాక్షి సదనుకంప
యోగిజనసేవ్య యోగపయోదశంప
శ్రీకరకటాక్షలేశరక్షితనిలింప
ముజ్జగంబుల మొలపించుమూలదుంప. 450

సీ. భర్గభట్టారకుపర్యాయమూర్తికి
షాణ్మాతురునికూర్మిజనకునకును,
మేషరాజము నెక్కు మేటిరౌతున కమ
రాధీశుపొరుగుదిశాధిపతికి,
హరిణవాహనుని నెయ్యపుసంగడీనికి
సామిధేనీప్రియస్వాంతునకును,
యాయజూకులయిండ్లయనుఁగుఁజుట్టమునకు
స్వాహాస్వధాప్రాణవల్లభునకు,
గీ. దండములు వెట్టెదము మోడ్చెదము కరముల
సేవ యొనరించెదము మమ్ముఁ గావు ప్రోవు

యాగవేదికి విచ్చేయు మారగింపఁ
బ్రథమజన్మలయింటికల్పద్రుమంబ. 451

## వీరయ్య—పోతరాజు. (త్రిపురవిజయము.)

సీ. కపిలజటాజూటగంగాసముత్తుంగ
వీచీఘటలు మిన్ను వీఁకఁ దాఁకఁ,
బ్రబలబాహార్గళపరికంపితస్ఫార
ఢక్కాధ్వనిని దిశల్ పిక్కటిల్ల,
జ్వాలాకరాళభీషణశారదస్థూల
శూలయుద్ధప్రభల్ సూర్యుఁ బొదువఁ,
బ్రకటబంధురదీర్ఘపటువజ్రనిష్ఠుర
పదఘట్టనము లుర్వి యదర నొదవ,
గీ. విమలశార్దూలచర్మాంచలములు దూల
మహితమండనఫణిఫణామణులు గ్రాల
నసమరౌద్రరసావేశ మావహింప
నారభటి భూరితాండవం బాచరించె. 452

సీ. తమ్ముల బెదరించుతళుకువెన్నెలపాప
గన్నె గేదఁగి రేఁకు గారవింపఁ
బదినూఱుపడగలఁ బఱపైనపదకంబు
సవడిముత్తెపుబన్నసరముఁ బ్రోవ,
మిసమిస మన మించుభసితాంగరాగంబు
పరఁగుచందనచర్చఁ బరిఢవింప,
మెఱయుమువ్వన్నెలకఱపుట్టముకొంగు
చెఱఁగుల నునుపట్టుచేలఁ బెనుప,
గీ. మించి తలమీఁద నురముపై మేనఁ గట్టి
యీడుజోడుగ నుమతోడఁ గూడి జగము

లెల్ల రక్షించు నిను భజియింతు నెపుడు
భయపదురితలతాదాత్ర! ఫాలనేత్ర! 453

సీ. తల్లిదండ్రులపొందు దప్పి యొండెడ నార్యు
రువిదలయొద్దువ నెదిగినతఁడు,
కడు వడి బలుగొండఁ గాఁడిపాఱినమేటి
ఘనసాయకము కేలఁ గ్రాలునతఁడు,
కమియారఁగాఁ బాఁపకవణంబుఁ దిని యాడు
టెక్కులతురగంబు నెక్కినతఁడు,
భోగిపాన్పున నిద్ర భోగించుదేవునిఁ
దఱమినరక్కసు నుఱిచినతఁడు,

గీ. సవడిమోములఁ జతురత సమకొనంగ
జోడుమాటలు సరివడ నాడునతఁడు
దంతిముఖుకూర్మితమ్ముఁడై తనరునతఁడు
కదలె బలముల నడిపింపఁ గ్రౌంచవైరి. 454

సీ. శూలి కన్నులఁ గెంపు చూపిన రౌద్రంబు
పొదల ముందఱిదెసఁ బొడమినతని,
భువనభయంకరమూర్తి పెం పెసలార
శరభావతారతఁ బరఁగినతని,
జన్నంపుసిరి కొనసాఁగఁ జూచినతాతఁ
జేకొని తలవంపు చేసినతనిఁ,
దళతళ మని మించుదులకించుకైదువుల్
కరములు పదిరెంటఁ గలిగినతని,

గీ. సురలు నసురులుఁ బలుములుఁ జూచి బెదర
బిరుదుపెండెంబు డాకాలఁ బెట్టినతని
భద్రకాళి మహాశక్తిఁ బరమభక్తిఁ
బాయకుండెడు శ్రీవీరభద్రుఁ దలఁతు. 455

## శేషనాథుఁడు—(పర్వతపురాణము.)

ఉ. తత్తఱపాటుతో నిరులు తద్దయు మాన్పఁగఁ జాలు కన్ను న
వ్వొత్తున వేల్పుమూఁకలకు విందులు వెట్టెడుకన్నుదమ్మియుం
మొత్త మెలర్ప లచ్చికిని ముద్దుగఁ బుట్టినముద్దుపట్టి మే
నెత్తిలఁజూచుకన్నుగల యిట్టిఁడివేలుపుఁ గొల్తు నిచ్చలుం. 456

## శ్రీగిరన్న—చెనమల్లు. (శ్రీరంగమాహాత్మ్యము.)

క. కాలాగరుకుంకుమస
మ్మేళనబాలాకుచాగ్రమేదురపరిరం
భాలోలలీలచే హిమ
కాలముఁ గడపుదురు జనులు కౌతుకమతులై. 457

చ. తనువు నుదుగ్రజంబు భరితంబుగ నంతటఁ దూర్పుదిక్కునం
హిమకరజన్మవేళ నుదయించినపాండిమ మించి పాఱెఁ బ
శ్చిమమున కభ్రలక్ష్మి కుచసీమఁ గురంగమదం బలంది హా
రము లిడి తా దుకూలమున రక్షగఁ బయ్యెద గప్పుచొప్పునం. 458

సీ. దీపించు నేవేల్పుదివ్యాంగకంబులఁ
గాళీకుచాంగరాగంబు భూతి?
కొమరొందు నేవేల్పుగురుజటాభరసీమ
నమృతాంశుఖండంబు నభ్రగంగ?
కడు మించు నేవేల్పుగాత్రవల్లికచుట్టు
వ్యాఘ్రచర్మము వారణాజినంబు?
కర మొప్పు నేవేల్పుకంఠపీఠంబున
భుజగేంద్రహారంబు పునుకపేరు?

గీ. అట్టివేలుపు శంకరుం డాదిమూర్తి
వేదవేదాంతవేద్యుండు విశ్వభర్త

వికసితోజ్జ్వలవదనారవిందుఁ డగుచు
నుచిత రీతిఁ జేరోలగం బున్నయంత. 459

శా. సంతోషంబునఁబొంది యేలె విమలస్వాంతుꣳ మహాదానవ
ధ్వాంతవ్యూహవిదారణోజ్జ్వలవివస్వంతుꣳ యశఃపూరితా
శాంతుꣳ సాహసవంతు నిర్భరజయాయత్తైకవిశ్రాంతు ధీ
మంతుꣳ భర్మనగేంద్రకాంతుని హనూమంతుꣳ జవాత్యంతునిꣳ. 460

శ్రీనాథుఁడు—(వల్లభాభ్యుదయము.)

సీ. రజనీవధూకర్ణరజతతాటంకంబు
వలరాజుగవశోష్ణవారణంబు,
ప్రోషితయువతిహృత్పుటభేదదాత్రంబు
బహుచకోరకుటుంబపానపాత్ర,
మధుకైటభాసురమథనుదాఁపటికన్ను
చక్రవాకంబులచల్లచేఁపు,
దుగ్ధపాథోరాశితొలుచూలిసంతతి
రోహిణీదేవితారుణ్యఫలము,
గీ. చంద్రకాంతశిలానునిలక్ర్పీట[?]
నిర్జరాంధోవ్యథామోక్షనియమవైద్యుఁ
డంధకారచ్ఛటాహాలహాలహరుండు
చంద్రుఁ డొప్పారెఁ గాంతినిస్తంద్రుఁ డగుచు. 461

సర్వదేవుఁడు—(ఆదిపురాణము.)

మ. సరసీజాతవిరాగకారి పురయోషావక్త్రహృద్యాతిసుం
దరకాంతిꣳ దఱఁగించుఁ బో యని మదిం దర్కించి దోషాకరుꣳ
బుర ముద్దండకరంబు లెత్తి చఱవం బొత్తైనయ ట్లొప్పు ను
ద్ధురసౌధాగ్రనిబద్ధకేతువు మహాదోలాభిరామంబుగꣳ. 462

క. హరినీలమణివిరాజిత
సురుచిరగోపురము దగిలి చూచి తమిస్రా
కరుఁడు విధుంతుదమండల
పరిశంకం జేసి పురముపైఁ జన నోడున్. 463

## సర్వదేవుఁడు—(విరాటము.)

సీ. ఇక్షురసాబ్ధినీ రెట్టిదో యని మది
నూహించి యువ్విళులూరకుండ,
విరసంపుమదిమికిఁ బరిహారం బగురసా
యనముమీఁదికిఁ జిత్త మరుగకుండ,
దివిరి దేహము దిధించుసిద్ధరసంబు[?]
కందువ యచ్చోటి కందకుండ,
నాయువుఁ జిరతరస్థాయిగాఁ జేయుసు
ధారసంబున వేడ్క దగులకుండ,
గీ. నఖిలజనులకుఁ బంకేరుహాసనుండు
నేర్చి యన్నింటిరుచు లొడఁగూర్చి తెచ్చి
సంచితంబులుగా సంగ్రహించె ననఁగ
భరితజలము లై పురసరోవరము లొప్పు. 464

## సింగము—ఏచ్చూరి. (కువలయాశ్వచరిత్ర.)

శా. ఆదిబ్రహ్మముఖాళి చాలక విహారార్థప్రయత్నంబుతో
వేదంబుల్ భువి ధర్మపోషణకు నై విఖ్యాతిగాఁ బుట్టెనో
కాదే నిట్టి మహత్త్వ మన్యులయెడం గానంబు నాఁ బొల్తు రా
భూదేవోత్తము లప్పురంబున మహాపుణ్యప్రభావంబులన్. 465

క. గిటగిట నగునెన్నడుములు
పుటపుట నగుచన్నుఁగవలుఁ బున్నమనెలతోఁ

జిటచిట లాడెడు మొగములఁ
గటితటములయొప్పు శబరకాంతలకొప్పున్. 466

ఉ. గోపురగోపురప్రతిమగోపురముల్ చెలువొంద నప్పురిన్
మాపులు రేపు లంగనలు మంజులగీతవినోదకృత్యముల్
చూపఁగఁ గిన్నరాదు లవి చూచు నెపంబున వచ్చి నేర్తు రా
లాపవిశేషనర్తనవిలాసకలాపములన్ ముదంబునన్. 467

ఉ. చల్లనిపండువెన్నెలల సౌధతలోన్నతహేమవేదులం
దల్లన వల్లభుల్ గదిసినట్టిసుధాకరుఁ జూచి ప్రాణముల్
జల్లన రాహువుందలఁచి సయ్యనఁ బాపుదు రంకసంగతో
త్ఫుల్లనభూముఖంబులను బొల్పగుకస్తురిపత్రభంగముల్. 468

సీ. తనజన్మ మప్పులఁ దలమున్క లని రోసి
పులిన మీపాంకంబు బొందె నొక్కొ?
పరికింపఁ దనపట్టు తిరిగెడిపా టని
పెన్నిధిసుడి మూర్తి బెరసె నొక్కొ?
బ్రతు కెల్లగతి బట్టబయ లాయె నని చూచి
గగన మీపుట్టువుఁ గనియె నొక్కొ?
పని లేకపాసెడిపాపంబుఁ దలపోసి
జక్కవ లీరీతి కెక్కెనొక్కొ?

గీ. యనఁగ లలనజఘన నంబుజముఖినాభి
చామనడుము బాలచన్నుదోయి
మహితరుచులఁ దెగడి మానవపతికన్ను
దోయిపండు వగుచు దొరసె నంత. 469

సీ. తమచూపు లొరిగిఁ బాంథతతులపైఁ బూనిన
భావజుకరవాలభాతు లనఁగఁ,
దమకురుల్ యువమృగేంద్రములకై తీర్చిన
మరునసమానంపుటురు లనంగఁ,

దమహాసములు విటోత్కరమానములఁ బట్టు
వలరాజుపూవులవల లనంగఁ,
దమకాంతి పురుషులఁ దాపంబు నొందించు
రతిరాజుమోహనరస మనంగ,
గీ. జలజకాహళికదళికాపులినగహన
కోకబిసశంఖచంద్రాళికులముఁ దెగడు
పాదజంఘోరుకటిమధ్యపటుకుచోరు
బాహుగళవక్త్రకచములపఙ్క్యసతులు. 470
సీ. తిమిర మంతయుఁ బాసి దిక్కులు తెలివొందె
నమృతాంశువులు పెంచె నభ్రవీథిఁ,
గువలయానంద మై కోరిక లిగురొత్తె
విబుధులమదిలోన వెట్ట లాదవె,
నక్తంచరశ్రేణి నయ మెల్ల దిగజాఱెఁ
జిత్తజోల్లాసంబు చెలువుమిగిలె,
దివ్యనీరంబులతేట లల్లనఁ బర్వె
భువనాధిపతి వేడ్కఁ బొంగి పారలె,
గీ. దీపికాజాలమెల్లఁ జిత్రించినట్టి
రమణఁ దోఁపంగ దృక్చకోరములు మెచ్చ
నమితతేజోవిరాజమానాత్ముఁ డైన
పుత్త్రచంద్రుఁడు జననంబు వొందునపుడు. 471
క. నిరుపమధర్మస్థితిచే
వరపాతివ్రత్యనిరతివైభవమున న
ప్పురిపుణ్యకాంత లమరిరి
గిరిపత్పురివాణులెల్ల కీర్తితగతులన్. [?] 472
శా. ప్రాచీనంబులు రత్నకాంతులు లసత్ప్రాకారముల్ హేమముల్
సూచింపన్ ఘన వేదికుట్టిమము లాశభ్రాంశుకాంతంబు లై

యేచోటన్ వరరత్నజాలములచే నింపొంది సొంపొందుచున్
వాచాగోచర మై గృహంబు లమరున్ వస్తుప్రశస్తోన్నతిన్. 473

ఉ. మీఱినభద్రనాగములమీఁదికి దాఁటి తదీయకుంభముల్
చూఱలు వట్టి కేసరికిశోరనఖావళినుండి రాలి సొం
పారినమౌక్తికంబులు ప్రియంబున నేరి కిరాతబాలికల్
గీరనగింజ లాడుదురు కేళిఁ దలిర్పఁగఁ బక్కణంబులన్. 474

ఉ. వైరితమస్తమం బడఁగ వంశమహార్ణవ ముబ్బ బాంధవో
ద్ధారచకోరసంతతి ముదంబునఁ దేలఁగ నర్థివర్గస
త్కైరవజాత మెల్లను వికాసముఁ బొందఁగఁ బుత్రచంద్రజ
న్మారవచంద్రికానుభవ మబ్బినచిత్తము మిన్నుముట్టదే? 475

గీ. శేషఫణులకు మణు లైనఁ జేరి యమ్మఁ
గోరి రత్నాకరం బైన గుత్తగొనఁగఁ
జాలి వరవస్తుసంచయసమితి నొనరి
పరఁగుదురు వైశ్యవర్యు లప్పట్టణమున. 476

## సిద్ధనప్రెగడ—(శాకుంతలము.)

ఉ. నీరజమిత్రుతో బయల నిల్చి చలంబునఁ గిట్టి మైనయిం
బోరుట దుర్లభం బనుచు భూరితమఃపటలంబు లొక్కమై
నూరెలఁ గోటవట్టి పొడసూపఁగనొక్కొ యెదిర్చె నాఁగఁ బ్రా
కారనిబద్ధనీలమణికాంతిఁ గనుంగొన నొప్పు నెంతయున్. 477

## సూరయ్య—కంచిరాజు. (కన్నప్పచరిత.)

ఉ. కారణ మేమి? రక్కసు నఖంబుల వ్రచ్చితి నాఁడు నీకుఁ బెం
పారఁ గుఠార మబ్బదో? పురారివిరించులు చేరి యేటికిం
గోరునఁ బోవుసేఁతలకు గొడ్డలి యన్నఁ దొఱంగితో? వినం
గోరెద నన్నుయిందిరకుఁ గోర్కుల నిచ్చుముకుందుఁ గొల్చెదన్. 478

ఉ. కొమ్మను దొండమున్ కఠినకుంభయుగంబును నయ్యుమాకపో
లమ్ములచారుకాంతిఁ దొడలన్ వలిచన్నులఁ బోలెఁ, బుత్త్రకుం
డిమ్ములఁ దల్లిఁ బోలి జనియించిననంచితభాగ్యవంతుఁ డౌ
నమ్మ! యటంచు సిద్ధసతు లక్కునఁ జేర్చుగజాస్యుఁ గొల్చెదన్. 479

మ. తమసౌభాగ్యము లంగసంభవునిభద్రశ్రీలసేవింపఁగాఁ
దమదృగ్జాలము లాలతాంతశరకుంతశ్రేణిఁ బాలింపఁగాఁ
దమవృత్తస్తనభారముల్ మరునిచిత్తస్ఫూర్తిసూచింపఁగాఁ
దమకం బారఁగఁ జేరి చూచిరి పుళిందగ్రామణిన్ బ్రేముడిన్. 480

సీ. శ్రుతిసుధాత్మాభక్తసురజననీవధూ
మల్లశంకరధర్మమహితబుద్ధిఁ,
గగకూర్మకిటినరమృగకుబ్జరామరా
మానంతబుద్ధకల్క్యాహ్వయముల,
నముచిమందరకుదానవబలార్జునపంక్తి
ముఖముష్టికస్త్రీవిముక్తఖలులఁ,
దత్పుచ్ఛకర్పరదంష్ట్రాగ్రనఖపద
పరశుబాణహలాంగఖురపుటములఁ,

గీ. జెరివి తాల్చి యెత్తి చీరి బంధించి ని
ర్జించి యేసి యేర్చి చెఱిచి మట్టఁ
గడఁగుచున్నశౌరి కరుణావిధేయుఁడై
మనలఁ గోర్కు లిచ్చి మనుచుఁగాత. 481

## సూరయ్య—నూతనకవి. (ధనాభిరామము.)

చ. ఇరువదియాఱువీక్షణము లెన్నఁగ నాలుగువక్త్రచేష్ట లిం
పరుదుగ నేసుభ్రూనటన లర్వదినాలుగుదోర్విలాసముల్
సరసతఁ జూపి హంసవృషసామజవాయసశుద్ధసంగతుల్
పరువడి మట్టు నిల్పె సితపంకజలోచన పాడుచుండఁగన్. 482

## సోమయ్య—దామరాజు. (భరతము.)

ఉ. అంబరసీమఁ దారలు జటాటవిఁ జల్లెవిరుల్ భుజాంతరా
ళంబున హారసంతతు లిలాస్థలిఁ బూవులవర్షముల్ ప్రసూ
నంబులు సత్కృతాంజలి ననం దగి మౌక్తికతుల్యమౌళి గం
గాంబుకణంబు లుట్టిపడ నాడెడుశంభుఁడు మిమ్ముఁ బ్రోవుతన్. 483

చ. అడుగుల్ ముప్పదియాఱటన్ వెడలు పై హస్తత్రిషట్కంబుచే
నిడుపై యున్నతమై సమస్థలము నై నిర్మోకహస్తాంకమై
మృడ మిత్ర[?] పులందు వాకి లొక లై మించం గవాక్షంబు లిం
పడరన్ శాలను రాజు షడ్విధము నాట్యం బిట్టు సేయించుటన్. 484

ఉ. నందిమృదంగరావము ఘనస్తనితం బని మ్రోల నున్న యా
స్కందునివాహనం బగుశిఖండి యఖండితనృత్య మాడ భీ
తిం దనహస్తరంధ్రముగతిం జొరు నాభరణాహిరాజి వో
వం దల యూచువిఘ్నపతి భాసురఫూత్కృతి మమ్ముఁ బ్రోవుతన్. 485

సీ. ప్రాకారములయందుఁ బటుగోపురంబుల
దామరమ్యద్వారసీమలందు,
విపణిగృహంబుల వెలయు నాయుధహస్త
భటులను హి(తము)గాఁ బ్రౌఢి నిల్పి,
రక్షితం బొనరించి రాజబింబద్యుతుల్
మించికాయుచు నున్నమంచివేళ,
మహిమ నాప్తసుబంధుమధ్యస్థలమునందుఁ
జెలఁగి రత్నాసనాసీనుఁ డగుచు,
గీ. నర్తకేళిలాస్యనటనాగతులచేత
శాస్త్రసమ్మతముగ జనులకెల్ల
వేడ్క చూపి మఘవవిభవుఁడై కొలువుండ
వలయు విభుఁడు నిఖిలకలలు నెఱిఁగి. 486

సీ. మొదలిపుష్పాంజలి ముదమునఁ గావించి
కరబాళిమొగబాళిసరవులెత్తి,
యురుపృథుబాళము లొగిఁబిల్లమురువును
హస్తప్రకణము లే ననువుచఱచి,
కడకట్టుశబ్దంబు కడఁగి దరువును జిందు
బాగైనగీతప్రబంధములును,
కుండలిబహురూపచండలాస్యవిలాస
దేశిమార్గంబులతెరువు లెఱిఁగి,
గీ. నయము బిఱుసును, నరిగతుల్ కడిఁదిగాను?
తిరువుమురువును నిలుకడ తిన్న నగుచు,
పాత్రఁ గొనిపించఁ గొనఁగను బ్రౌఢియైన
వాఁడె నటుఁ డనఁబరఁగు నీవసుధయందు. 487

సోమయ—పెదపాటి. (అరుణాచలపురాణము.)

సీ. అంగయుక్తంబుగా నామ్నాయములు నాల్గు
చదువంగ నేరనిసద్ద్విజాతి,
బ్రాహ్మపాద్మాదిపురాణాగమేతిహా
సము లెఱుంగనిబ్రహ్మసంభవుండు,
భాట్టవైశేషికప్రాభాకరాదిశా
స్త్రము లాఱు చూడనిధరణిసురుఁడు,
స్వకులోచితము లైనసప్తతంతువులెల్లఁ
బార మెయ్దింపని బాడబుండు,
గీ. కావ్యనాటకలసదలంకారముఖ్య
విద్య లన్నియు నెఱుఁగనివిప్రవరుఁడు
పంచయజ్ఞములును లేనిబ్రాహ్మణుండు
వెదకిచూచినఁ బొడమండు వీటిలోన. 488

క. తఱుముదు రంతకునైనను
వెఱచఱవఁగ భద్రకరులవిఱుతురు హరి ను
క్కఱఁ బట్టి చట్ట లేరుదు
రుఱుకుదురు యుగాగ్నికైన నురుభటు లందున్. 489

ఉ. తారకజిచ్ఛిఖండి శివతాండవ మాడ నతండు మర్దళో
దారరవంబు మేఘనినదంబని చేరినఁ జూచి నాసికా
ద్వారబిలంబు జన్నిదపువ్యాళము చొచ్చినఁ దొండ మెత్తి ఘీం
కారము సేసి నవ్వువెనకయ్య కృతీశ్వరు మన్చుఁగావుతన్. 490

సీ. ప్రతిభావిలంఘితభారతబహుకథా
ఘట్టు నన్నయభట్టుఁ గడు భజించి,
యుభయభాషాప్రౌఢిమోద్యన్మహారాజ్య
భాజిఁ దిక్కనసోమయాజిఁ బొగడి,
వాక్ప్రతోషితదక్షవాటీమహాస్థాన
భీము వేములవాడభీముఁ గొలిచి,
భావబంధనిబంధపరమేశబిరుదప్ర
శర్మ నెఱ్ఱయశర్మ సన్నుతించి,
గీ. భారతీహారు భవదూరుఁ బ్రణుతి సేసి
సుకవికులసోము నాచనసోము నెన్ని,
నవ్యకవితాసనాథు శ్రీనాథుఁ దలఁచి
సరససకలాంధ్రకవుల కంజలి యొనర్చి. 491

ఉ. బంటుతనంబు వైభవము భాగ్యము తేజము చాలఁ గల్గ ము
క్కంటిని దమ్మికంటి నధికం బగుభక్తి భజించి కేలిమైఁ
గంటకులం జయించి కలకాలము నర్థులకోర్కిపంట లై
పంటలుఁ బాఁడియుం గలిగి పంటలు మీఱుదు రప్పురంబునన్. 492

సీ. భ్రమరకావళికప్పు ప్రసవగుచ్ఛభ్రము
ద్భ్రమరకావళికప్పు బాంధవింప,

కరములకెంపును గమనీయహల్లకో
త్కరములకెంపు సఖ్యంబు సేయ,
ముఖసౌరభములు నమోఘాతిముక్తక
ముఖసౌరభంబులు మొనసి బెరయ,
హాసవిస్ఫూర్తులు నతులవర్ణప్రతి
హాసవిస్ఫూర్తులు నన(గి పెన(గ,
గీ. సారము లగుతమ్ములవిలాసములు చూపి
వరుస( బువ్వులు జట్టికోవచ్చినట్టి
జనులమనసులు మును తారు జట్టికొండ్రు
పుష్పలావీవధూటు లప్పురమునందు. 493
క. రాజులు విక్రమోగ్రమృగరాజులు విశ్రుతదివ్యకాంతి రే
రాజులు రూపరేఖ రతిరాజులు మానగుణంబునందు రా
రాజులు దానశక్తి ధనరాజులు వైభవభోగవృద్ధి స్వా
రాజు లనంగ నొప్పుదురు రాజితతేజులు దత్పురంబున౯. 494
చ. వలు(దకుచంబులు౯ బవడవాతెఱలు౯ మెఱు(గారుమేనులు౯
బలుచనిచెక్కుటద్దములు( బద్మపుమోములు( గంబుకంఠముల్
కలువల( బోలుకన్నులు వికాసపునవ్వులు( జిల్కుపల్కులు౯
వలిరుల మించుపాదములు( దత్పురికాంతల కొప్పు నెంతయు౯. 495
సీ. విపణికోరోయన్న విబుధాచలం బైన(
దెమ్మన( దేనివైదేహికుండు,
పులిజున్ను వలె నన్న( బొరుగిల్లు సూపక
యాక్షణంబున నీనియర్యవరు(డు,
మహనీయకౌస్తుభమాణిక్యమున కైన
వెల(దెంచ నేరనివిష్వారుండు,
గురుతరహాటకకోటికి( బడిగల
కోటి యెత్తనివణిక్కుంజరుండు,

గీ. మందునకు నైన లేరు సమగ్రభోగ
భాగ్యసంక్రందనులు జగత్ప్రకటకీర్తు
లర్థిసంపత్ప్రదుల్ నిర్జితార్థపతులు
షట్క్షితో దారు లప్పూరివైశ్యు లెల్ల. 496

సీ. వ్యాసుని వాల్మీకి వరరుచి వామను
బాణు క్షేమేంద్రునిఁ బ్రవరసేనుఁ,
గర్ణామృతు మయూరుఁ గాలాంతకుఁ గళింగుఁ
గవిదైత్యు శివదాసుఁ గాళిదాసు,
భట్టారహరిచంద్రు భట్టనారాయణు
భట్టగోపాలుని భట్టబాణు,
భాసు భామహు సార్వభౌముని శివభద్రు
భారవి భవభూతి భర్తృహరిని,

గీ. రాజశేఖరుఁ జోరుఁ మురారిఁ గృష్ణ
మిశ్రు జయదేవు దండి సౌమిల్లు సోమ
చంద్రు దిఙ్నాగు విజయవిశాలదేవు
హర్షుఁ జిత్తపు శాతవాహను సుబంధు
మాఘు మల్హణు బిల్హణు మఱియుఁ గలుగు
ప్రథితగీర్వాణకవులనుఁ బ్రణతి సేసి. 497

సోమయ—పెదపాటి. (కేదారఖండము.)

ఉ. కన్నియ రూపుఁ గోరుఁ, గనకంబులుగోరును దల్లి, బుద్ధిసం
పన్నతఁ గోరుఁ దండ్రి, కులభవ్యతఁ గోరును బంధుకోటి, ప
క్వాన్నఫలాదిభక్షణము లన్యులు గోరుదు రిట్టు లిన్నియుఁ
బన్నుగ నొక్కచో నొదవె, భాగ్యము సేసితిఁ, గన్య నిచ్చెదన్. 498

సీ. కటుకటిస్కంధకుక్షిఘాలాస్యంబు
లాఱు నున్నతము లయ్యె ర్భకునకు,

లాజానుబాహునాసాక్షులు దీర్ఘముల్
హ్రస్వముల్ పృష్ఠ మేహనగళంబు,
అంగుళీజత్రుకేశాగ్రగుల్ఫములుసూ
క్ష్మము లధరోష్ఠనఖరదృగంత
తాలుజిహ్వాకరతలరేఖర లెన్నన
స్వరనాభిసత్త్వముల్ సద్గభీర
గీ. ములు, సెమర్పవు మృదువు లంఘ్రులు, కరములు
కఠినములు శంఖచక్రాంకకలితములును,
నైదురేఖలు చెలువొందునలికతలము,
లక్షణము లింత యొప్పారె నే యక్షయములు. 499

సీ. కెంజాయజడముడి కేశపాశంబును
బూపచందురుఁడును బూవుదండ,
యురగకుండలమును దరళతాటంకంబు
వనజాప్తుఁ డగుకన్ను వాలుఁగన్ను,
ముదురుపుర్కలపేరు ముత్యాలహారంబుఁ
గడుఁ గొంచె మగుచున్న ఘనకుచంబుఁ,
బులితోలు దుప్పటి వెలిపట్టు చీరయుఁ
బాఁపపెండెంబును బసిఁడియందె,
గీ. మృదువుఁ దెలుపును నగుభూతి మృగమదంబు
నింత యొప్పారె కుడివంక నెడమవంక
నిమ్మహాదైవమున కని యిచ్చ మెచ్చి,
యర్ధనారీశ్వరునిఁ గొల్చి రఖిలజనులు. 500

సీ. చరియించునారికి సంకల్పసిద్ధిగా
నిర్మించె నెవ్వాఁడు నిజవనంబు?
సార్వకాలిక ఫలసస్యంబుఁ గల్పించి
వరమునిశ్రేణి నెవ్వాఁడు ప్రోచెఁ?

జీఁకటితప్పు సేసిన నెవ్వఁ డోదవించె
నింద్రునితనువెల్ల హేయముగను?
నుర్వీసురశ్రేణి కొరిమ లేకుండంగఁ
బలికె నెవ్వఁడు ప్రతాపంబు మెఱసి?
గీ. యట్టిశ్రీవీరశైవాగమాదివేది
యైనగౌతమసంయమియాశ్రమంబు
పొంత నెంతయు నొప్పారి పొగడ నెగడు
ననఘమానస! శ్రీవైజయంతిపురము. 501
మ. పదలాలిత్యము వర్ణశుద్ధియును శబ్దస్థైర్యముఞ్ మంగళా
స్పదభావంబును రాజయోగ్యతయు దోషన్యూనరాహిత్యముఞ్
సదలంకారవిశేషముం గలిగి విశ్వప్రాణసౌభాగ్యసం
పద మై తేజియ పోలి క్రాలవలదా! పద్యంబుహృద్యస్థితిఞ్. 502
సీ. లలిఁ గావ్యనాటకాలంకారములు చూచి
శబ్దప్రపంచంబుజాడఁ దెలిసి,
వర్ణోద్భవవ్యక్తివర్గగ్రహోరమి
త్రస్నిగ్ధరూక్షచింతనము లెఱిఁగి,
గణరూపదేవతాగ్రహమైత్రినక్షత్ర
మాతృకాపూజాదిమార్గ మెఱిఁగి,
జల్లి విక్రియ కాకు పొల్లు వ్యర్థము గ్రామ్య
విరసంబు గ్రామ్యోక్తి పరిహరించి,
గీ. కవిత సెప్పినఁ దగుఁ గాక కవిసి నోరి
కొలఁదు లివ్వల నవ్వలఁ గూర్చి తెచ్చి
దిట్టకూళతనంబున వట్టిబిగిని
గావ్య మని చెప్ప మెత్తురే కవిజనములు. 503
సీ. వనితయూర్పులచేత వావిలి వికసించెఁ
బాటఁ బ్రేంకణము లేఁబరువ మయ్యె,

నాతుక చూఁచిన నలువొత్తెఁ దిలకంబు
గోమరారె మాటలఁ గొండగోఁగు,
సతిముఖరక్తిచే సంపంగె సొంపెక్కె
నవ్విన సురపొన్న మవ్వ మలరె,
నెలనాఁగకౌఁగిట నిగురొత్తెఁ గురవకం
బంటినఁ జెలువొందె నామ్రతరువు,
గీ. పొలఁతిపుక్కిటిమధువునఁ బొగడ వొలిచెఁ
గాంతపదసంగమున నశోకంబు విరిసెఁ
గాననములోన జాతి యొక్కటియె తక్క
భూజములఁ దీఁగెలునుఁ బూచి పురువులయ్యె. 504
సీ. వేదాదు లగుమహావిద్యలన్నియుఁ గూడి
మూర్తిమంతంబు లై మొనసి కొలువఁ,
క్రతుమరీచ్యంగిరఃకణ్వాదిసంయముల్
పలుమాఱుఁ గనుసన్నఁ బనులు సేయఁ,
సురసిద్ధకిన్నరగరుడవిద్యాధర
యక్షాదు లంతంత నభినుతింప,
నారదవిశ్వాసనత్కుమారాంగిర
శ్శతరుతు లుభయపార్శ్వముల మెఱయ,
గీ. భాషతోఁ గూడి యానందభరితుఁ డగుచు
సత్యలోకేశ్వరుం డందు సంస్తుతింప
నిమ్మహాసృష్టి కెల్లను నితఁడు కర్త
చూడుమిా! బ్రహ్మలోకంబు సుభగమూర్తి! 505
సీ. హరియురస్స్థలిఁ బోలెఁ గర మొప్పెఁ జూచితే
భాసురకమలాధివాస మగుచుఁ,
త్రిదివంబుఁబోలె నొప్పిద మయ్యెఁ జూచితే
మకరకచ్ఛపమహామహిమ గలిగి,

గగనంబువోలె నక్కజ మయ్యెఁ జూచితే
రాజహంసస్ఫూర్తి రమణఁ గలిగి,
యాశాతటమువోలె నసలారెఁ జూచితే
బంధూకకుసుమదవిభ్రమము గలిగి,
గీ. యతిమనోహరమందమారుతవిహార
లోలకల్లోలమాలికాందోళకేళి
కలితబహువిధఖగసముజ్జ్వలత గలిగి
యమరెఁ జూచితె యీసరోజాకరంబు. 506

## సోమయ — పెదపాటి. (త్రిపురవిజయము.)

సీ. భూరివిశ్వంభరా భూతంబు రథము, త
ద్రథమధ్యమునఁ బొల్చుకొండ విల్లు,
విల్లువెంబడిఁ దిర్గువెలుఁగులు చక్రముల్
చక్రారికులపతి చారునారి,
నారిఁ బట్టఁగఁ బాలు నాగరకపు గటి
గటిమీఁద విహరించుఘనశరంబు,
శరము నాభిని గన్న శతవృద్ధుసారథి
సారథిమాటలు సైంధవములు,
గీ. గాఁగ నేఁగి వేగ గడఁకతోఁ బురములు
గెల్చి వచ్చి గెలుపు గిరిజతోడఁ
జెలఁగి చెలఁగి చెప్పి చెలువొందుశంభుండు
గాచుఁగాత! మనలఁ గరుణతోడ. 507

## సోమయ — పెదపాటి. (శివజ్ఞానదీపిక.)

సీ. కవగూడి నడక సాఁగనిబండికండులు
దొమ్మిదితునుకలతోడుసు శేరు,

పెక్కు బ్రాహ్మణులచేఁ జిక్కినగుఱ్ఱమ్ము
చిలుకుట నఱిగినచివుకుటిరుసు,
బహుముఖవిభ్రాంతి బడలినసారథి
వినువీథి నఱిమిన వీఁగువిల్లు,
పదిబ్రద్ద లై యొడ్డువాసినబాణంబు
పార లెత్తిపోయిన బోలునారి,

గీ. పట్టఁ బస లేదు సాధనప్రకరశక్తి
విషమశబ్దంబు లైనట్టివిమతపురము
లెల్ల సాధించి గెల్చితి వేకహేల?
బాపు! త్రిపురాంతకేశ్వర! భక్తవరద! 508

సీ. బవరాన నూతుఁ డై పార్థున కాతండు
నచ్చినాఁ డీతండు మెచ్చినాఁడు,
చంచత్కృపామూర్తిఁ బంచాస్త్రు నాతండు
పెంచినాఁ డీతండు దొంచినాఁడు,
శేషపన్నగరాజు సెజ్జగా నాతండు
వ్రాల్చినాఁ డీతండు దాల్చినాఁడు,
హాలాహలముఁ జూచి యల్లంత నాతండు
చెంగినాఁ డీతండు మ్రింగినాఁడు,

గీ. చక్రి యాతండు వసుమతీచక్రి యితఁడు
నవనపరుఁ డాతఁ డీతఁడు హరణపరుఁడు
విశ్వమయుఁ డాతఁ డీతండు విశ్వనాథుఁ
డనుచు హరిహరనాథుల నభినుతింతు. 509

క. సుకవులు పలుకఁగఁ గోకిలు
లకవులు దా రఱతు రౌర! కొలఁకుల భ్రమర
ప్రకరము ఝుంకారింపఁగ
'బెకబెక' మన కేల మాను భేకము లవలక్. 510

## సోమేశ్వరుఁడు—పాలపర్తి.

సీ. తలకమ్మికొండయు విలుకమ్మికొండయుఁ
గడయును నడుముగాఁ గలుగు తేరు,
సరసిజముకుళంబు సద్వాక్యసకలంబు
మాతయు నా లగుమాతలియును,
మిన్నులఁ జనువాఁడు కన్నుల వినువాఁడు
నంకపర్యంకంబు లైనశరము,
చల్లనిపవనంబు నెల్లైనభువనంబు
మేపును మోపుగా మెలఁగునారి,
గీ. కాఁక కోర్చువిల్లు గజెగలగుఱ్ఱాలు
పగలు రేయుఁ దిరుగుబండికండ్లు
గలుగఁ బురజయంబుఁ గైకొన్ననినుఁ గొల్తు
చిరశుభాంక! సోమశేఖరాంక! 511
సీ. వింటిక్రిందటికొమ్ము వికలించి పెఱికిన
భూకాంతమను నాభి పొలుపు మిగిలె,
నమ్ముపుచ్చుకొనఁగ నమితతరంగముల్
పాలసంద్రంబునఁ బ్రజ్వరిల్లె,
బండికండులు రెండు పం డ్లిగిలించినఁ
గలువలు దామరల్ చెలిమి చేసె,
వాజులఁ గొనివచ్చి వరరథంబునఁ బూన్పఁ
జిచ్చుకు నాఁకలిచిచ్చు పుట్టె,
గీ. నారి సంధింపఁ గశ్యపునారి వడఁకెఁ
గోల సంధింప లచ్చికి గోల పుట్టె
విల్లుఁ డెగఁ బాపి పురములు ద్రెళ్ల నేసి
తెరిదివిలుకాఁడ వౌదు సోమశరభలింగ! 512

## హరిభట్టు. (ఉత్తరనృసింహపురాణము.)

సీ. మందారకుసుమంబుఁ జందురుండును గూడి
మౌళిభాగంబునఁ గీలుకొనఁగ,
ఫణిమండలంబును మణికుండలంబును
గండభాగంబునఁ గప్పుకొనఁగ,
వరచక్రశూలాబ్జవరదహస్తములందుఁ
గంకణభుజగకంకణము లమరఁ,
గనకకౌశేయంబు గజరాజచర్మంబు
మునుకొని కటిభాగమున నటింపఁ,
గీ. దిమిరమును జంద్రికయు జోక నమరినట్లు
పుండరీకోత్పలద్యుతు ల్పొదివినట్లు
నీలవజ్రంబు లొకచోట నిలిచినట్లు
హరిహరాకృతి త్రిభువనానంద మయ్యె. 513

## అన్నదానమహాత్త్వము.

గీ. ఆదిమూర్తి మహాలక్ష్మి యప్పురంబు
సొచ్చి నిల్చిన వారాశి చూడ వచ్చి
కోట సొర రాక కూఁతుపైఁ గూర్మిఁ జుట్టు
పాటియున్నటు లొప్పారి పరిఖ మెఱయు. 514

గీ. మహితసన్మార్గవర్తనమాన్యు లనఁగఁ
బొలుచునినరాజగురుక విబుధుల సైనఁ
దగులువడఁ జేయుపెంపునఁ దనరుపేటి
కొమ్మలను సాటి యై కోటకొమ్మ లమరు. 515

## ఇంద్రసేనము.

చ. పుడిసిటిలోన డొంకి కడుఁ బొల్పఱి యమ్మున నింకి చల్లినన్
గడపలఁ గాన వచ్చి వెసఁ గైకొని త్రచ్చిన రొల్లఁ జొచ్చి య
జ్జడనిధి భంగపడ్డఁ గని స్రష్ట యపాయము లేనివార్ధిఁ గాఁ
గడఁగి రొనర్చినో యన నగడ్త పొగడ్తల నొప్పు నప్పురిన్. 516

## కామందకము.

క. అరుణుండు కిరణము(ల)సం
చరణంబుల వాయ కెపుడు చరియించుగతిన్
జరజనులచేత నృపతియు
నురుగతి జగమెల్ల నెఱిఁగియుండఁగవలయున్. 517

## పంచతంత్రము.

గీ. అన్యదేశ మెల్ల నాత్మదేశంబ కా
తలచువాఁడు నెపుడు తలఁకు లేక
రమణ నేఁత యెల్ల రాజ్యంబు సేతగాఁ
దలఁచువాఁడు ప్రియుఁడు ధరణిపునకు. 518

చ. చెలువుగ దుష్కరంపుఁబని సేసియుఁ జేసితినాక, క్రూరతం
బలుమఱు వ్రేసినం గడవఁ బల్కిన నుల్లములోన నొందుగాఁ
దలఁపక, పల్కు చొప్పిదము తథ్యముగాఁ దగఁ బల్కి మోసలన్
బిలువక వచ్చియున్నతఁడు భృత్యుఁడు రాజున కెన్నిభంగులన్. 519

క. బలుకొఱడుపోలె నెండకుఁ
జలికిని వానకును నోర్చి జనపతి నెవ్వం
డలవడఁ గొలుచును వానికి
వలనొప్పఁగ సిరులు దాన వచ్చి వసించున్. 520

క. మానుగఁ బతి వనిచినఁ దన
చే నది గా దనక వేగ సేకొని యనలం
బైనఁ జొరవలయు నంబుధి
యైనను నీఁదంగవలయు నర్థిని భృత్యుల్. 521

## పురాతనచరిత్రము.

క. చీటికిమాటికి వెలువడి
హాటకమయవప్ర మెక్కి యహికన్యలు మి
న్నేట విహరింతు రనినను
గోటపాడువుఁ బరిఖలోఁతుఁ గొలఁదియె పొగడన్. 522

## రంగనాథశతకము.

సీ. కురులూ తుంపెస లాడఁ గ్రుమ్మడి యరవీడఁ
గుచకుంభయుగళంబు గునిసియాడఁ,
గటియుగంబు నటింపఁ గౌను కంపముఁ బెంప
సరు లురంబున గల్లు చౌకళింపఁ,
గనుజంకె లొఱపెక్క గగు రంగముల నిక్కఁ
గర్ణపత్రము లాటగతుల కెక్కఁ,
గంకణంబులు మ్రోయఁ గలనాద మెసపోయ
రశనాకలాపంబు రట్టుసేయ,
గీ. నటునిరీతి వీరభటునిచందంబునఁ
గమ్మవిలుతుకీలుబొమ్మ కరణి
నుపరిభాగకేలి నొప్పెఁదాఁ గావేరి
రంగవిభునిఁ గూడి రాజవదన. 523

# గ్రంథనామము, కర్తనామము, తెలియరానివి.



సీ. అఖిలలోకానందుఁ డగుచంద్రుఁ డెందేనిఁ
గలిగె నుజ్జ్వలఫేనకంబుమాడ్కి,
నైరావతాదిమహాకరు లెందేనిఁ
బ్రభవించె మకరశాబములపగిదిఁ,
గమనీయసురతరుసముదయం బెందేని
జనియించె శైవాలచయముభంగి,
భువనైకమాత మాధవుపత్ని యెందేనిఁ
బొడమె మాణిక్యంపుబొమ్మపోల్కి,
. నాదిమత్స్యకూర్మములు విహారలీలఁ
దనరు నెందేనిఁ బ్రకృతిసత్త్వములకరణి
నట్టియంభోధి యొప్పారు నద్భుతైక
సారమహనీయమహిమకు నాధార మగుచు. 524

అతిమాధుర్యమనోజ్ఞచూతఫల మాహారంబుగాఁ గల్గియుఁ
మతి గర్వింపక కోకిలంబు పలుకుఁ గుంజాప్తి, జంబాలమా
షితనీహారముఁ గ్రోలి భేక మఱచుఁ జృంభించి యాకర్ణ (న)
స్థితిఁ గాఠిన్యము దోఁపఁగా 'బెకబెక' స్ఫీతాకులారావముల్. 525

అనిలోద్ధూతపరాగరేఖలు సముద్యచ్చంచలాలీలఁగా,
ఘనమత్తాలిగభీరగానరవముల్ గర్జావిభూతిం దన
ర్ప, నమందంపుమరందబిందుతతి వర్షస్ఫూర్తి నొప్పారఁగాఁ
దనరెం గారుమొగిళ్లపెల్లున (ను) నుద్దంశోత్పల వ్రాతముల్. 526

అమరనాయకుకొలువుకూటమునయందుఁ
గరము విలసిల్లువెలిపట్టుఁ డెరయుపోలెఁ

జెలువమై తూర్పుదిక్కునఁ దెలుపు దోఁచెఁ
బ్రజలకెల్లను గన్నులపండు వగుచు. 527

గీ. అమరు లమృతాబ్ధిలోపలి యమృతరసము
వెండిచేరులఁ బటికంపుఁగుండఁ గట్టి
చేఁదుకొనియెదరో నాఁగ శీతరోచి
మెల్లమెల్లన రుచులతో మిన్ను బ్రాఁకె. 528

ఉ. అరయక మున్న పుష్పవతి యైనలతాసతిముట్టి యంబుజా
కరముల నీళ్లు లాడి మఱిఁ గ్రమ్మఱ ముట్టెదమొక్కె యన్యెఱం
బోరిఁ బురవీథులం దెరలఁబోవక మెల్లనఁ బోవునట్టిపై
పరిమళశైత్యమాంద్య సులభంబుగఁ బల్లఱు వీచుఁ దెమ్మెరల్. 529

శా. ఆనందాశ్రుల నగ్ని నిల్చె నొకొనా నల్లాడు దృగ్దీధితుల్
మానం బుష్పమధుప్రసంగము కడుఙ్ మత్తిల్లెనాఁ గ్రమ్ముడుల్
జానై క్రాలఁగ మంథరస్థితి నిజేచ్ఛన్ షోడశావస్థలున్
బూనం బొందఁగఁ దద్దయుప్పి రరుణాంభోజాక్షు లున్మత్తలై. 530

ఉ. ఆరయ జీవనం బమృత, మల్లుఁడు దేవర, సొమ్ము లన్నియున్
సారపురత్నముల్, కొడుకు చంద్రుఁడు, కూఁతురు లక్ష్మి, యాలు భా
గీరథి, తాసముద్రుఁ, డని కీర్తన సేయుదు రెల్లవారు నా
క్షీరపయోధి, నన్యులకుఁ జెల్లునె యిట్లు సమస్తభాగ్యముల్. 531

శా. ఆరాజాస్యలు గాంచి రయ్యెడ సముద్యల్లోలకల్లోలసం
చారోద్ధూతనవీనఫేనదరహాసస్ఫారమున్ నిర్జరా
హారశ్రీకరవారిపూరము ఖగవ్యాపారవిస్తారమున్
బారావారగభీర మున్నతమహాపారంబుఁ గాసారమున్. 532

చ. ఇరవున గోపురాగ్రముల నెత్తినకేతనవాతపూరణో
త్కరము వియన్నదీజలము గ్రాయుచు వాతహతిం దదంబుశీ
కరములఁ జల్లుటన్ జలదకాలము గాఁ గొని యాడు నెప్పుడున్
బురిని నెముల్ ప్రమోదగతి భూరిహిరణ్మయహర్మ్యవేదులన్. 533

ఉ. ఈఁకలు నల్లనైన వని యెంచి విశాలరసాలశాఖ యం
త్యైకముతోడ నెక్కి వికసించి ఫలంబులు నీవు మేయుచున్
గోకిలరీతి నుందు నను కొన్నను నంటివి కాక పాపపుం
గాకమ! నీకు నమ్మధురగానము గల్గునె యెన్ని వళ్కానన్? 534

గీ. ఉదయరాగ మించించుక యుజ్జగించి
నిండుచంద్రుండు కన్నులపండు వయ్యె
ధావనానంతరస్నిగ్ధదాక్షిణాత్య
రాజశుద్ధాంతదంతవజ్రముల కాంతి. 535

ఉ. ఏచి తలిర్చి గొప్ప లగు నెఱ్ఱనిపూవులతోడిబూరుగుల్
రాచిలు కర్థిఁ జేరి మధురంపుఫలంబుల నాస సేసినన్
జూచి నిరాశ యై చనిన చొప్పగు నల్పుల నాశ్రయించినన్
.. ... ... ... ... 536

గీ. కడలుఁ జేతు లార్చుచు ఫేనఘనతరాట్ట
హాసరుచితోఁ బ్రవాళజటాలి విచ్చి
... ... ... ...
... ... ... ... 537

సీ. కదళికాకాండయుగ్మముమీఁద నెట్లొకో
నిద్దంపుఁబులినంబు నిలవుకొనియె,
జలజాకరంబులో మొలచి యేగతి నొక్కొ
తోఁతెంచె మవ్వంపుధూమరేఖ?
బయలుపై నేమాడ్కిఁ బదిల మైనదియొక్కొ
కొమరారునవహేమకుంభయుగళి?
మొలకచందురునీఁద నిలిచి యేక్రియనొక్కొ
బలసి క్రాలెడు నోలి నలఁతియిరులు?

గీ. జగతి నరు దనఁ దొడలును జఘనతలము
నాభియును నారు నడుముఁ జన్గవయు నుదురు

నలకములయొప్పు వర్ణింప నలవియగునె
రాజబింబాస్యచెలువంబు రాజతనయ! 538

మ. కనియెన్ దుర్గమసానురింఖణతురంగగ్రావణానూరువున్
దిననాథద్యుతిపుంజఝంజనలసద్దీప్తిచ్ఛటాచారువున్
కనదభ్రంకషతుంగశృంగవిహరద్దాయన్మరుద్భీరువున్
దనుజారిస్థితి భద్రదారువును దద్వృందారువున్ మేరువున్. 539

మహాస్రగ్ధర. కని రుగ్రగ్రావనక్రగ్రహణఘుమఘుమా
కారకల్లోలడోలాం
చనబద్ధాందోళకేళీసరభసఘణాభృ
చ్చారుజూటాగ్రజాగ్ర
ద్ఘనరత్నోదంచదత్యుత్కటకుటిలమయూ
ఖచ్ఛటాటోపమిథ్యా
జనితౌర్వారంభశుంభత్సలిలనివహని
స్తంద్రు రత్నాకరేంద్రున్.

గీ. కన్నుఁగవఁ గాటుకయు బోటికచ్ఛడంబు
భూతి రుద్రాక్షమాల త్రిపుండ్రకములు
ధవళదంతవాటికాస్థాపుటములు
నంగవికృతియు నజ్జాలిభృంగిరటికి. 540

చ. కమలిని యించుకేని యొసఁగం గనుమాయదు లోన నవ్వెడిం
గుముదిని రాగపల్లవితకోమలశీతలధాముఁ డంబరాం
తముఁ గబళింపఁ జొచ్చె నని తాను నవాంగనవోలె సిగ్గునన్
శమితము సేసె నల్లన నిశాపతి ప్రొద్దను గేహదీపమున్ 541

చ. కలఁగినపూఁతయున్ నుదుటికస్తురి నంటినకుంతలంబులున్
బలసినయూర్పులున్ గలిగి పాన్పుఁ గరంబున నూఁది మూఁపునన్
దలకభరంబు పూని గవయం బొకచే నమరన్ రతాంతవే
ళల శయనంబు డిగ్గుసతులన్ వనజాక్షుఁడు పొందె నెలడియున్. 542

సీ. కలకంఠముపికీరకలకలధ్వనులతో
            బెడఁగుగా వెలిపీడు విడిసె మరుఁడు,
మరుధనుర్జ్యావల్లి మొరపంబుగతి లతా
            మంటపంబుల నించె మధురరవము,
మధుపరవోల్లసన్మంజరీమకరంద
            సురభిగంధంబులు నెరసె దిశల,
దిశలెల్లఁ దాన యై తిరిగె బంధుశ్రేణి
            కంపింప దక్షిణగంధవహుఁడు,
గీ. వనము లెల్లను గ్రొత్తజవ్వనముఁ దాల్చె
దళితహేమంతగర్వమై వెలసె నెండ
సతులహిందోళగానంబు లతిశయిల్లె
రాగకర మైననవవసంతాగమమున. 543
గీ. 'కాంత! నీమోముఁ బోలమిఁ గందె నిందుఁ
డీసువాఁ డని కినియకు మింక' ననుచుఁ
బ్రార్థనము సేయుచుఁ బ్రొక్కునట్టి యుడుగ
ణంబొకోనాఁగ సతిపాదనఖము లమరు. 544
చ. కుసుమశరాళి బ్యాసటము గొల్పినకైవడిఁ దమ్మితూపులం
గసిబిసి సేసి క్రాలుతెలిగన్నులఁ గజ్జల మిడ్డ బ్రహ్మ న
ల్వ్యాసఁగఁగ గండుమీల సృజియించుతఱిఁ ఋజురేఖ క్రొత్తయ
భ్యసనపు నీలినూ ల్మడఁచినట్లు మృగాక్షికి నొప్పు నెంతయుఁ. 545
సీ. కొండంతహేమకోదండంబు విలసద
            హీనగుణంబున నెక్కువెట్టి,
హరినీలమణికాంతి యగునమ్ముశరధిపాం
            దొడలించి వలచేత నేర్చిపట్టి,
స్వరముల సకలించువాయసంబుల గుణా
            ధారభూతం బగుతీరఁ బూన్చి,

నలుదిక్కులును జూడ్కు లొలయంగ సకలంబుఁ
గనువాని సారథిగా నొనర్చి,
గీ. కడఁగి రథచక్రములు తనకన్ను లట్లు
యేమఱక యేఁగఁ ద్రిపురంబు లేర్చి సకల
లోకములను నెమ్మిఁ బ్రోచుపినాకపాణి
మనలఁ గరుణావిధేయుఁ డై మనుచుఁగాత! 546
మ. క్షయకాలంబున సీధుసాగరరసాస్వాదాతిరేకంబునన్
నయనాబ్జంబులు ఘూర్ణితంబులుగ సంధ్యాకాళరాత్రీకర
ద్వయతాళానుగతిం బ్రమోదమున మత్తల్లీమహానృత్యముల్
ప్రియ మొప్పారఁగఁ జేయుభైరవుఁడు గల్పించున్ మహైశ్వర్యముల్.
సీ. గండపాళికలును గన్నులుఁ దెలుపెక్కెఁ
దోరంబు లయ్యెఁ బెందొడలు నడుము,
గతియును దీపనస్థితియు మాంద్యముఁ దాల్చెఁ
బృథులత మించె నాభియును బిఱుఁదుఁ,
జనుముక్కులును నారుఁ జాల నీలిమ నొప్పె
సన్నంబు లయ్యె వాచవులుఁ దనువుఁ,
గోర్కులు నూర్పులుఁ గొనలు సాగఁగఁ జొచ్చెఁ
దలనూపె నిదురయు నలసతయును,
గీ. సిగ్గువదలెఁ బుట్టెఁ జిట్టుము లుప్పొంగె
వింతకాంతి యొకలింత లడరె
నర్కవంశతిలక మైనకుశధ్వజు
నువిద కపుడు గర్భ మొదవుటయును. 548
గీ. గజ్జపరిద్రొక్కెఁ జూపె భాగడవిధంబు
గీతమున కాడెఁ జేసె సంకీర్తనంబు
పాడె సూళాదిగీతప్రబంధవితతి
భృంగి పంచాంగకం బైనపేరణమున. 549

సీ. గొజ్జంగివిరులపైఁ గుప్పించుఁ గుప్పించి
కన్నెగేదఁగులపై గంతుగొనును,
వకుళగుచ్ఛములపై వర్తించు వర్తించి
పున్నాగతతులపైఁ బూన్కి నెఱపు,
గురువెంచపొదలపైఁ గ్రుమ్మఱుఁ గ్రుమ్మఱి
విరవాదిలతలపై విశ్రమించు,
మల్లికావలులపై మసలాడు మసలాడి
సురపొన్నతరులపైఁ బొరలు వెట్టు,
గీ. ననుదినము నిట్లు పుష్పవాసనలఁ దేలి
యంగజాభంగరతులందు నసఁగి పెనఁగి
యలసిపడియున్న జనముల యలఁతమాన్చు
మలసి యప్పురిఁ బ్రాభాతమారుతంబు. 550
మ. గ్రహాయుక్తం బయి ఫేనతారకలచేఁ గన్పట్టి మందాకినీ
సహితం బై ధ్రువలక్ష్మిచే నమరుచున్ సర్వాతిరిక్తంబు నై
బహుభూతంబులఁ దాన లోఁగొనుచు శబ్దస్థాన మై యద్భుతా
వహ మై విష్ణుపదత్వ మేర్పడఁగ నవ్వారాశి యొప్పుం దగన్. 551
సీ. చందనం బలఁదినసౌభాగ్యలీల మైఁ
బూసినకస్తూరిపూఁతతోడ,
వికలి యై విరిసిననఖరేఖవ్రణముతో
వీఁగాడుకుచముల వ్రేఁగుతోడఁ,
జుంబించి విడిచిన బింబాధరంబుతో
మూలవదలుపుష్పమాలతోడ,
నన్నువనడుము దా నసి యాడుచుండంగ
వదలినగనయంబు నదిమికొనుచుఁ,
గీ. దొడలు నడుగులుఁ దడఁబడఁ ద్రొక్కికొనుచును
దలపు దెఱచియొక్కతయు లతాంగి

సురతసుఖము లెల్ల సుభగున కొప్పించి
మారుతార్థి యగుచు మగుడి వెడలె. 552

ఉ. చుక్కలనెయ్యపుందగవు సూచిన యామినిపూర్తి సూచినన్
జక్కన నాథు దీనతకుఁ జాలక ము న్కడు నస్తమించె న
మ్మక్కా! శిలావిశేషముగదా! శశియశ్మము నీలరోచి గా
దొక్కొ కలంక నొల్లనని యోర్చెఁ దదీయవియోగదుఃఖమున్? 553

గీ. తనరి రాగిల్లి ముక్తుఁ డై తరతరంబ
నిర్మలత్వంబుఁ బొందుచు నీరజారి
పరమయోగియుఁ బోలె సత్పథమునందు
నడవఁ గాఁ జొచ్చెఁ గువలయానంద మెసఁగ. 554

సీ. తమకు ముంచఱ నింకఁ దలవంపు లౌ నని
నాతిచన్మొక్కలు నల్లనయ్యెఁ,
దనయాపవార్థ మింతటఁ దీఱునో యని
పల్లవాధరమోము తెల్లవాఱెఁ,
దనయులు లే రని తరుణి రోసినమాడ్కి
నింతి కెంతయు నోకిలింత లొదవెఁ,
దనవంశ మెల్ల వర్ధన మొందు తెఱఁగునఁ
బొలఁతి నెన్నడు నంతఁ బొదలఁ దొడఁగె,

గీ. నడపు జడ నయ్యె వెడనిద్ర దొడఁకఁ జొచ్చె
దప్పి మోమునఁ జాలఁగ నుప్పతిల్లె
జెలువ యొప్పారె నాగర్భచిహ్నలందుఁ
బేద పెన్నిధిఁ గాంచినప్రియము దోఁప. 555

సీ. తస్కరశత్రుభూధవసర్పవృశ్చిక
శార్దూలభల్లూకసలిలపవన
వహ్నినవగ్రహవారణవిషరోగ
దివిజాంతకాసురవరమహాఘ

శాకినీబ్రహ్మరాక్షసభూతబేతాళ
కూశ్మాండధారిణీక్రూరశస్త్ర
దారిద్ర్యదుర్భిక్షదారుణదుస్స్వప్న
దుశ్శకునోత్పాతదుష్టమృత్యు
గీ. ఘోరసంసారభవభయాపారదుఃఖ
సమితి నిర్జించి రక్షింపఁ జాలు నీదు
భవ్యపంచాక్షరీమంత్రపఠనశక్తి
భానుశతకోటిసంకాశ! పాణికేశ! 556
సీ. తిమిరభూతముసోఁకు దెలియ జగత్త్రయీ
లలన దాల్చినరక్తతిలక మనఁగ,
సఖ్యంబునకు నిశాశబరి యిచ్చినఁ బ్రాచి
పాటించు గురివెందబంతి యనఁగఁ,
దోయధి వెడ గ్రుంకఁ దోఁచుపురందర
కుంభినీ సిందూరకుంభ మనఁగఁ,
గులిశాయుధుని పెద్దకొలువునఁ జెన్నొంద
దీపించు మాణిక్యదీప మనఁగఁ,
గీ. కుముదినీరాగరససిద్ధగుటిక యనఁగఁ
గాముజనరంజనౌషధికబళ మనఁగఁ
బొడుపుఁగెంపున బింబంబు పొలుపు మిగులఁ
జంద్రుఁ డుదయించెఁ గాంతినిస్తంద్రుఁ డగుచు. 557
సీ. తుహినధాత్రీధరోత్తుంగగాత్రస్ఫూర్తిఁ
బరిపూర్ణచంద్రికాప్రభలు మాయఁ,
గళితబంధురతరస్కంధఘంటాధ్వని
నదరి దిశావలి యెదురు మ్రోయఁ,
బలిచండనిష్ఠురపటుపాదఖురహతిఁ
బటపటి యై మహీభాగ మగల,

వరభోగభోగీంద్ర వాలవాతోద్ధతిఁ,
జెదరి ధారాధరశ్రేణు లవియ,

గీ. వర్ధితాయతశృంగతీవ్రక్షతములఁ
బెల్లుకొని పద్మజాండంబు బిల్లు లొలయఁ
జండగతి వచ్చుకైలాసశైల మనఁగ
నెసఁగు పడివాగెతో వృషభేంద్రుఁ డమరె. 558

చ. ద్విగుణసరోజ మయ్యె సుదతీజనచారుముఖవ్రజంబుచేఁ
ద్రిగుణితమీన మయ్యె యువతీజనలోచనపంక్తిచేఁ జతు
ష్ప్రగుణితకోక మయ్యె రుచిరప్రమదాసనరాజిచే నదం
బగణితషట్పదప్రకర మయ్యె సతీకుటిలాలకాళిచేన్. 559

చ. నెఱఁకులయందుఁ గ్రిక్కిఱిసి నిండినపొంపిరి నిక్కుపట్లు ద
గ్గఱుటయు నూరడించి తమకంబున నెవ్వరికన్న వేడ్కఁ ద
త్తఱ వెస మీఁచి పట్టుకొనుతొలము లొండొరుఁ జుట్టుముట్టి త
మ్మెఱుఁగని సంగమక్రియ మహీతలనాథుఁడు రాజపుత్రియున్. 560

గీ. పదియుఁ బదియు నింకఁబదియేను బదియేను
నిరువదేను నూటయిరువదేను
నూఱు నూఱు నూఱును న్నూఱు నన్నూఱు
తలలవాఁడు నిన్ను ధన్యుఁ జేయు. 561

చ. పరమవివేకసాగరుఁడు పంకజసంభవసంభవుండు ధా
మరహితవహ్నితుల్యుఁ డసమానతపోనిధి విష్ణుభక్తిత
త్పరుఁ డఘదూరుఁ డాద్యుఁడు కృపారసచిత్తుఁడు దివ్యబోధసు
స్థిరుఁ డగునవ్వసిష్ఠుఁ డరుదెంచె దిలీపనృపాలుపాలికిన్. 562

చ. పలుకులయాస వాయపు నెపం బిడిపల్కు సఖీజనంబుతోఁ
బలికినమాత్రఁ జూడ్కులకు బ్రాఁతిగ వెన్నెలఁ బుక్కిలించిన
ట్లలువులవెల్గు గాంత దశనాంశువిభాతికి వజ్రదాడిమీ
ఫలనవబీజమౌక్తికవిభాతికి రా జనుమాట పూజయే? 563

సీ. పలుకుల నెడలజ్జ నెలితి సేయుచు నొయ్యఁ
బలికించి చూడ్కికిఁ బట్టుకొలిపి,
చెంతకు నెఱయుని చెయ్వులఁ బుయిలోటు
సహలించి వేడ్కలఁ గడకుఁ దెచ్చి,
నెపమునఁ జోఁక స్వాత్త్వికంపములు మాన్చి
డాసి వంచించి సొం దాసపఱచి,
యుపగూహనములకు నొఱ పిచ్చి పురికొల్పి
చుంబనంబులఁ జవి చూపి రేచి,
గీ, మూరి బోయినమవ్వంపుఁగూరి మొసఁగఁ
గామ్యు దనకంటెఁ జెయ్వులఁ గడవఁగఁ బఱప
బాలనవసంగమంబున నోలలార్చె
రాజనందనుఁ డారతిరాజు పోలె. 564
సీ. పసిఁడిక్రొమ్మొగులలోఁ బ్రభవించి యచలిత
శ్రీమించుచంచలరేఖ యైన,
వరసుధారససరోవరములో జనియించి
యనిశంబు నలరెడువనజ మైన,
నిక్షురసాబ్ధిలో నెలసి మార్దవమున
నతిశయిల్లుప్రవాళలతిక యైనఁ,
బరిపూర్ణచంద్రబింబం బనుకరసాన
నొరసినసురవాఁడిశరము లైనఁ,
గీ. బోల్ప నొకకొంత పొసఁగినఁ బొసఁగుఁగాక
ముదితనెమ్మేని మెఱుఁగును మోముచెలువు
నధరమును గటాక్షములసోయగము నందు
దొరయు నన నెందు నొండువస్తువులు గలవె? 565
సీ. పాటించు నెయ్యది బహుళనిర్మలధర్మ
గంభీర మగుమూర్తిగౌరవంబుఁ,

గావించు నెయ్యది కాంతిమై దిశలకు
వాడని చంద్రికావైభవంబు,
గర్జించు నెయ్యది ఖణిలుఖణిల్లున
ఘోరదైతేయులగుండె లడల,
మెచ్చించు నెయ్యది మీనకేతనవైరి
వాహ్యాళికావల్గువల్గనముల,
గీ. నది రయంబున నవ్విభునగ్రవీథి
నిర్ఝరాఘాటి నొప్పఁ బ్రాదుర్భవించెఁ
బృథులపదపాతనిర్ఘాతభీతపన్న
గేశ్వరం బైన శ్రీవృషభేశ్వరంబు. 566

ఉ. పీడనతాడనగ్రహణభేదములన్ బహుబంధబంధన
క్రీడల హాస్యలీలఁ గిలకించితముఖ్యవిలాసలక్ష్మికిన్
జాడలు దీయు నేర్పుల రసంబుల భావములం బ్రగల్భుఁడై
ప్రౌఢలఁ బొంది శ్రీవిభుఁ డపూర్వసుఖంబులఁ జొక్కఁ జేయుచున్.

ఉ. పీనసరోగి నిన్నుఁ దిలపిష్టసమానము చేసినంత నే
వానివివేకహీనతకు వందుర నేల కురంగనాభమా!
మానవతీకపోలకుచమండలమండితచిత్రపత్రికా
నూనవితానవాసనల నుండుట లోకము నిన్నెఱుంగదే! 568

చ. పురవనదౌత్యపానములు భూధరనాయకవిప్రలంభముల్
శరధియుఁ బెండ్లి యుద్ధము విచారము యానము పుత్రసంభవం
బిరవుగఁ జంద్రసూర్యు లుదయించుటయున్ జలకేళియున్ ఋతుల్,
సురతముఁ జెప్పఁగావలయు సొంపుగ సత్కృతులందు నేర్పునన్. 569

ఉ. ప్రేమముతోఁ జకోరశిశుబృందము ముక్కుల కెక్కకుండ జ్యో
త్స్నామృతధార వంచుటకు నై యుడురాట్కులశీముఖంబునన్
యామవతీవిలాసవతి యడ్డము వెట్టినహస్తమో యనం
గా మెఱసెన్ బరిస్ఫురితకజ్జలదీధితిచిహ్న మయ్యెడన్. 570

సీ. బడబానలం బనుఫాలేక్షణముచేత
నక్రాదిఫణిభూషణములచేతఁ,
బవడంబు లనియెడుబహుజటావలిచేత
నాతతఫేనవిభూతిచేతఁ
బ్రకటబుద్బుదచయస్ఫటికదామంబుచే
శుక్తిఖండార్ధేందుశోభచేత,
భాసురభంగకపాలమాలికలచేఁ
గమనీయమాధుర్యకలనచేతఁ,
గీ. దుహినకుధరసుతావాసమహిమచేతఁ
దనదుగంగాధరత్వంబు తథ్య మనఁగ
శౌరి కేప్రొద్దు సంతోషకారి యగుచు
నొప్పు నొప్పులకుప్ప నా నప్పయోధి. 571
ఉ. బాలముఖేందుబింబరుచి పద్మనిభాననయానలీల నీ
లాలకచన్నుదోయి రుచిరాంగిమనోజ్ఞవిలాసహాసముల్
లోలకురంగలోచనవిలోకనసంపద నెట్టుపోల్చినన్
బోలినఁ బోలు నాగతముఁ బోలఁగ నీత్రయి నొండు గల్గునే? 572
శా. బేటంబై ధృతి పల్లటిల్లఁదొడఁగెన్ బ్రేమంబువర్తిల్లె నా
రాటం బుజ్జన మయ్యె లజ్జ యెసఁగెన్ రాగంబు వాటిల్లెఁ బు
ల్లోటం బుత్కట మయ్యెఁ గంపములపై నుప్పొంగెఁ బ్రస్వేద మ
జ్జోటిం జెప్పఁగ విన్నమాత్రఁ బతికిన్ సూనాస్త్రబేటంబునన్. 573
సీ. భసితంబు వేదోక్తపరనిరూపం బగు
భసితంబు మునిజనప్రాణపదము,
భసితంబు సర్వేశుభక్తి కాధారంబు
భసితంబు సకలశుభప్రదంబు,
భసితంబు దుర్దోషపటలానిలం బగు
భసితంబు లోకైకపావనంబు,

భసితంబు భవరోగభంజనౌషధ మగు
భసితంబు ప్రత్యక్షభర్గమూర్తి,
గీ. భసిత మనవరతాశేషభయహరంబు
భసిత మసమసుజ్ఞానవైభవకరంబు
భసిత మాభరణము యోగివిసరమునకు
భసితమహిమ వర్ణింపఁగ బ్రహ్మతరమె? 574
సీ. మొగమును మొగమును ముచ్చట లాడంగ
నగవును నగవును నవ్వియాడ,
మోవియు మోవియు ముద్దులు గురియంగఁ
జూపును జూపును దీపులాడ,
నొడలును నొడలును నొక్కటి యై యుండఁ
బులకలు పులకలుఁ గలయఁబడఁగఁ,
దొడలును దొడలును దొడరి పెనంగఁగ
నడుగులు నడుగులు నదిమికొనఁగ,
గీ. వరుసఁ గలయంపిఁ జేతులు సరసమాడ,
నితరకరములు పైనొప్ప రతుల యెడల
సరస శయనించి పరిరంభసంభ్రమముల
ప్రేతలును దాను సుఖియించె విశ్వవిభుఁడు. 575
సీ. రాజకదంబవిరాజితం బగుఁ గాని
కంటకపార్థివోత్కరము గాదు,
పద్మాలయాతిశోభన మనం జనుఁ గాని
కుముదోదయాతిసంకులము గాదు,
స్నిగ్ధసువర్ణప్రసిద్ధాత్మ మగుఁ గాని
వరచిత్రవర్ణసంకరము గాదు,
పరమౌషధిప్రభాభాసురం బగుఁ గాని
దుస్తృణోద్యోతవిద్రుతము గాదు,

గీ. వరకులంబును సత్సరోవరకులంబు
చెలువ మగుహర్మ్యకులము సుక్షేత్రకులము
పోల నన్నింటికిలో దాని( బోలియున్న(
బ్రస్తుతం బగునోషధిప్రస్థపురము. 576

ఉ. రాజితతేజు( డైనదినరాజు తిరోహితు( డైనపిమ్మటన్
రా జుదయాద్రిపీఠము తిరంబుగ నెక్కెడుసందుకట్టునన్
భ్రాజితసత్పథంబులకు బాధ యొనర్చుచు జారచోరసం
పూజిత మై తమంబు గడు( బొంగె నధర్మముతోటి జోటియై. 577

ఉ. లేమికి లేఁత కౌను ప్రతి లేమి కుదాహరణంబు చూపు మా
ర్లేమికి మచ్చుచూడ్కులగు లేమివిలాసము వల్లిచిత్రమం
దామర కేకులుం గలకతంబున( బోల్ప( దలంచి లోకు లా
నామము లెన్న వాతెఱవ నాలుక యాడునె మై వడంకదే. 578

క. లోకమువిరహులకును శశి
భీకరు( డగు టరుదె? సురలు పీ(కుకతిన(గా?
నాకాశపిండ మై తిరి
గేకుటిలాత్మునకు నేడ కృప మది( దల(పన్. 579

సీ. విటసేన పై దండువెడలినవల కేని
గొల్లైనపై హేమకుంభ మన(గ(,
గాముకధృతివల్లికలు ద్రుంప నెత్తిన
శంబరాంతకుచేతిచక్ర మన(గ.
మరుఁడు పాంథశ్రేణిమానాటవులు గాల్ప(
గూర్చిననిప్పులకుప్ప యన(గ,
విరహిమృగంబుల వే(టాడ మదనుండు
దెచ్చినమోహనదీప మన(గ,
గీ. పీ(కునునుపు గలిగి వృత్త మై యరుణ మై
కాంతితో( జకోరగణము లుబ్బ(

బోదుపుఁగొండచక్కఁ బొడిచె రాకాచంద్ర
మండలంబు గగనమండనంబు. 580

చ. విరహులకెల్ల సంధ్యవతి వేడుక జోతము సెప్పవచ్చుచో
నిరతముతోడ నక్షతలు నించి తగన్ గరపంకజంబునన్
మురియుచుఁ బట్టినా మెఱుఁగుముత్తెపుఁజిప్పన నొప్పెఁ జూడ్కికిన్
శరనిధిపుత్త్రునిన్ విదియచంద్రునిఁ గంటిరె పశ్చిమంబునన్. 581

సీ. విషమాస్త్రునకు వేఱ విండులు గలవెట్టు
పొలఁతుక నెలవంక బొమలు గాక,
యంగజునకు వేఱ యమ్ములు గలవెట్టు
తనుమధ్యలోలనేత్రములె కాక,
శంబరారికి వేఱ చక్రంబు గలదెట్టు
బింబోష్ఠిపృథుజఘనంబ కాక,
చిత్తజునకు వేఱ చిగురెల్లి గలదెట్టు
ధవళాక్షి యధరపల్లవము కాక,
గీ. కాయజునకు వేఱ కవదొనల్ గలవెట్టు
తోయజాస్యపిన్నతొడలు కాక
భావజునకు వేఱ పాశంబు గలదెట్టు
తరుణికేల కాక ధరణినాథ! 582

సీ. వెన్నెలపుఱుఁగులవెన్నెలపులుగంబు
చెఱకుసింగిణికాని చెలిమికాఁడు,
వేయికన్నులవానివీటిపొత్తులమేఁత
జోడువాయనివారిచొక్కుమందు,
కలువచుట్టంబు చుక్కలకెల్ల మనుభాఁతి
వేడుకకాంద్రచేవెన్నతఱటు,
నబ్బుమూఁకలకెల్ల నబ్బాచిపెనువేల్పు
తలపూవు చేకొమ్మవలపులాఁడు,

గీ. కలిమిముద్దియసైదోడు కడలిపట్టి
జక్కవలమిత్తి తామరచల్లఁజంపు
దొంగలకు గొంగ యలప్రొద్దుసంగడీఁడు
పొడిచెఁ బున్నమ రేయేఁడు పొడుపుఁగొండ. 583

చ. వెలయుకళాఢ్యుఁడైనశశి వేడుకఁ జేయురతోత్సవంబునన్,
దలితరుచిస్ఫురద్గగనలక్ష్మి మనోహరహారమౌక్తికం
బులక్రియ నున్నతారకలు పూర్వసురాధిపుభాగ్యచిహ్నముల్
తొలఁగినమాడ్కి దృష్టిపథదూరము లయ్యెఁ గ్రమక్రమంబునన్. 584

చ. వెలువెలఁబారె దీపములు వెన్నెల వెల్లువ డొంకఁబారె న
త్తలచులజోకలెల్ల దిగఁబారె రథాంగము లించువేడ్కలన్
గలగొనఁబారెఁ దుమ్మెదలు కంజవనంబులు చేరఁ బారెఁ దా
రలరుచి మాఁగువారె సురరాజదిగంతము తెల్లవాఱఁగన్. 585

చ. వెలువెలఁబారెఁ దూర్పు ననవిల్లు మనోభవుఁ డెక్కు డించెఁ దా
రలపొది విచ్చఁజొచ్చె ననురక్తిఁ జెలంగె రథాంగదంపతుల్
జలజము లుల్లసిల్లె విలసద్గతి వీచెఁ బ్రభాతవాయువుల్
కలకల పల్కెఁ బక్షులు వికాసము కల్వలఁ బాసె నయ్యెడన్. 586

మ. సరి నుప్పొంగుచు నాహిను ల్బెరయఁగాఁ జక్రచ్ఛటాకుంతభీ
కర మై పోటును బాటునుం గలిగి సంగ్రామంబునుం బోలె నె
వ్వరికిం జొచ్చి మెలంగరాని ఘనసత్త్వప్రౌఢి శోభిల్లుచున్
ధరణీభృన్నికరంబు రాయ నమరెం దత్తత్ప్రదేశంబులన్. 587

సీ. సురలోనఁ దన సాపుఁ జూచి యెప్పుడు పొత్తు
నను వచ్చితే యని నవ్వువారు,
అన్నినస్సైన నిట్లాడుమా నీ వని
నీడకుఁ గఱపుచు నాడువారుఁ,
జిలుకపలుకు విని యెలుఁగు నూపఁగ నేల
వలతేని ర మ్మని పిలుచువారు,

ముఖసౌరభమునకు మొరయుతుమ్మెద ప్రమోఁత
వించుఁ దోడన దాళగించువారు,

గీ. జాడ మునుకొని వెడమాట లాడువారుఁ
జేయి తాళంబు లొండొరు వ్రేయువారు
నైరి కాదంబరీపానహర్షమున మ
నంబు లలరంగ ముదితేందుబింబముఖులు. 588

గీ. హారిమందసమీరవిహారలీల
వెలయుపుష్పాళ్లలో నలినికర మడరఁ
బొలుచుకెందమ్మికొలఁకులు పుష్పసాయ
కప్రతాపానలంబులగను లనంగ. 589

## 'రామా! రాజచూడామణీ' యను మకుటముగల పద్యములు.

శా. అజ్ఞానప్రబలాంధకార తరణోద్యద్భానుతేజోనిధుల్
ప్రజ్ఞాపావనపుణ్యసద్గుణపయఃప్రస్ఫీతభాగీరథుల్
విజ్ఞానోజ్జ్వలచంద్రికామృతకరుల్ వీక్షింపఁగా నొప్పు బ్ర
హ్మజ్ఞాను ల్భవదీయసేవకులు రామా! రాజచూడామణీ! 590

శా. కంథాధారులు చర్మధారణపరుల్ కాపాలికుల్ దుష్క్రియా
పాంసు ల్నిమ్ము భజింపనేరక వృథాపాషండు లైనారు స
ద్గ్రంథార్థాప్రతిమానవాదనులు [?] సత్కావ్యప్రవీణుల్ మహా
మాంధాతుల్ భవదీయసేవకులు రామా! రాజచూడామణీ! 591

మ. కనకంబుల్ వెదచల్లువారు భయముంగైకొంచుమేనేదువా
రనురాగంబునఁ గామినీమణులతో నానందముం బొందువా
రనుపాలించినపుత్త్రపౌత్త్రతతులన్ హర్షించువా రెల్ల ము
న్ననసారన్ నినుఁగొల్చినారు రఘురామా! రాజచూడామణీ! 592

శా. చంకం గొల్లఁడు మేఁకపిల్ల నిడి తచ్ఛాయాకృతుల్ నీటిలోఁ
శంకం గన్గొని నూతఁ బడ్డగతి శాస్త్రంబు ల్వితర్కించి హృ
త్పంకేజంబున నిన్నుఁ గానక ఘనస్తాపంబున న్మూఢులై
మంకుల్ గొందఱు గాధఁ బవ్వగురు రామా! రాజచూడామణీ! 593

మ. తినదే చెట్టులయాకు మేఁక, గుహఁగొందిన్ పాము నిద్రింపదే,
వనవాసంబునఁ బక్షులున్ మృగములున్ వర్తింపవే, నీటిలోఁ,
మునుఁగం జూడవె మత్స్యకచ్ఛపములున్, మోక్షార్థులై ముక్తికిన్
మనసే మూలము నీదుభక్తికిని రామా! రాజచూడామణీ! 594

మ. పరమార్థజ్ఞుఁడు సర్వభూతచయమున్ బ్రహ్మస్వరూపంబు గాఁ,
బరకాంతామణిఁ దల్లిగా నహితునిన్ బ్రాణోక్తబంధుండు గాఁ,
బరికించున్ సమలోష్టకాంచనమతిన్ భావింపఁ డాత్మన్ జరా
మరణక్లేశభయంబు నొంది రఘురామా రాజచూడామణీ! 595

మ. బుధధాత్రీజవికాసముల్ గుణలతాభోగప్రియావాసముల్
మధురస్త్రీసుఖహాసముల్ పికవచో మాధుర్యవిన్యాసముల్
విధురప్రాయతుషారభాసములు విద్వాడ్భాతిసంత్రాసముల్
మధుమాసంబులు నీవిలాసములు రామా! రాజచూడామణీ! 596

మ. రణరంగంబున వజ్రకాయమన సంరక్షించు సంసారదా
రుణబేతాళభయంబు పాఱనణఁచున్ రోగాగ్నిసంతాపమున్
క్షణమాత్రంబునఁ బాయఁ జేయవె భవత్కల్యాణనామావళుల్
మణిమంత్రౌషధసేవ పుణ్యులకు రామా! రాజచూడామణీ. 597

# అనుబంధము.

సీ. శ్రీకర నవపుండరీకసంపదలకుఁ
గవ యైన నేత్రయుగ్మంబుతోడ,
శంఖశార్ఙ్గ స్ఫురచ్చక్రగదాశోభి
తము లైనహస్తపద్మములతోడ,
నూర్జిత మకుటకేయూరకౌస్తుభచారు
రమణీయమణిభూషణములతోడఁ,
బదియాఱు వన్నెలపస మించుతళుకుల
వల నైనపసిఁడిదువ్వలువతోడ,
గీ. నిరతమును గూర్మి మీఱి పేరురమునందుఁ
గాఁపురం బున్నదుగ్ధాబ్ధికన్యతోడ
శ్రీజగన్నాథుఁ డెలమి నాశ్రితనిధాన
మర్థిఁ గల నాకుఁ బ్రత్యక్ష మైనఁ జూచి.

సీ. నీలాచలాగ్ర సన్నిహితనిత్యనివాస!
వాసవార్చితదివ్యవస్తునిరత!
రతగోపకన్యకాచతురతాతత్పర!
పరతత్త్వవాసనాప్రకటసార!
సారసోద్భవనుత! శయనపారావార!
వారణోద్ధరదయావరవిశేష!
శేషాహితల్ప! సుస్థిరసచ్చిదానంద!
నందవ్రజస్ఫుటోన్నతవిహార!
గీ. హారకేయూరమకుటమంజీరవిసర
సరసభూషణభూషితస్ఫారరుచిర!

చిరదయాలోల! రక్షణస్నేహవిజయ!
జయ జగన్నాథ! దేవతాసార్వభౌమ! 2

గీ. అనుచు వినుతించునాదు నెమ్మనము నెలఁగ
ననఘుఁ డాద్యుండు పురుషోత్తమాఖ్యపురపు
శ్రీజగన్నాయకుఁడు సమాశ్రితనిధాన
మాదరంబున ని ట్లని యానతిచ్చె. 3

ఉ. ఆరయ రామ ప్రెగ్గడకులాగ్రణిగంగయమంత్రిజగ్గ! మా
పేరిటివాఁడ, చెప్పుడును ప్రేమ ఘనం బగు మాకు నీపయిన్,
గారవలీల నీవు సమకట్టినమేలిమికావ్యసార మిం
పారఁగ మత్సమర్పణము సన్మహాకీర్తిగఁ జేయు నావుడున్ 4

వ. మనమునఁ బ్రమోదాయత్తుండ నై యిట్లని వితర్కించితి. 5

చ. జననుతు లౌకవీశ్వరులసత్కృతిసారము కావ్యసారవ
ర్ణన మని చేసి నీలగిరినాథునికర్పణసేయుటొప్పుఁ జ
క్కనిపదియాఱువన్నెకనకంబున వాసన కమ్మకస్తురిన్,
గనదురుకాంతియున్, జెఱకునన్ ఫల మబ్బుట భాగ్యమేకదా! 6

వ. అని కృతనిశ్చయుండనై జగన్నాథదేవకరుణాసుధాసారంబునఁ గా
వ్యసారం బొనరింపఁ బ్రారంభించి మదీయవంశావతారం బభి
వర్ణించెద. 7

సీ. తనప్రభుత్వము దేవతాప్రభుత్వమున కం
తయు నొప్పవేయునేత్రములవానిఁ,
దనలావునను భూతధాత్రీతలంబెల్లఁ
దలఁ బూనుకొనువేయుఁదలలవానిఁ,
దన పేరుఁ దడవినజనులపాపౌఘముల్
మర్దించువేయునామములవానిఁ,
దనమూర్తి త్రిభువనతమస మూల సనంగఁ
దఱిమెడువేయుఁబాదములవానిఁ,

సారోదారుఁడు తిమ్మమంత్రి గనియెన్ సత్పుత్రునిన్ వేంకనన్
గారా మొప్పఁగఁ గొండమంత్రిమణి నాగంగయ్యచాణార్యులన్. 15

వ. తదనుజుండు. 16

గీ. లలితభరద్వాజగోత్రుఁ డౌ వెలఁగలేటి
కొండనామాత్యశేఖరుకూర్మిపుత్త్రి
వసుధ రామాంబఁ బెండ్లియై వల్లమంత్రి
మదనసమమూర్తి సింగనామాత్యుఁ గనియె. 17

సీ. శాశ్వతవిక్రమైశ్వర్యసంపదలందుఁ
గపికేతు వృషకేతు గరుడకేతు,
భుజబలకారుణ్య భూరిప్రతిజ్ఞల
బలరాము రఘురాముఁ బశురాము,
సత్కార్యవితరణ సౌందర్యములయందుఁ
బాణుఁ బన్నగబాణుఁ బ్రసవబాణు,
ఘనతరమానసకాంతిపెన్నిధులందు
రారాజు ద్విజరాజు రాజరాజు,

గీ. సాటిసేయంగఁ దగుఁ జతుర్జలధివేష్టి
తావనీచక్రరాజసభాంతరముల
రమ్యతరభాగ్యగుణశాలి రామప్రెగడ
మంత్రిగంగయవల్ల నామాత్యవరుని. 18

వ. తదనుసంభవుండు. 19

సీ. శ్రీపెదపాటిపురీ బాలగోపాల
కృష్ణప్రసాదితశ్రీల వెలసి,
ఘనవైష్ణవమతజ్ఞ కందాళతిరుమలా
చార్యకృపాకటాక్షమున నలరి,

కావ్యలక్షణలక్ష్యగణితాదిసత్కళా
ప్రజ్ఞావిశేషవైభవము గలిగి,
రాజవిద్వత్సభారసికబాంధవమాన
నీయధర్మాచారనియతి మెఱసి,
గీ. మల్లప్రెగ్గడవీరనామాత్యపుత్రి
రాను నభిరామగుణధామ రామనాము
కామినీమణిఁ బెండ్లియై ఘనగృహస్థ
మహిమఁ జెలువొందుజగ్గనమంత్రివరుఁడ. 20

## షష్ఠ్యంతములు.

క. శ్రీరమణీరమణునకును
నారదశుకజనకసనకనలినాసనహృ
న్నీరజనిరతోపాసన
కారణపదకమలయుగళకలితాకృతికిన్. 21

... ... ... ... ...

వ. ఏను విన్నవింపం బూనినప్రబంధరత్నాకరంబునకు వర్ణనాక్రమం బెట్టి
దనిన నారాయణస్తుతియు, శంకరప్రభావంబును, త్రిపురవిజయాభిరామం
బును, నర్ధనారీశ్వరంబును, హరిహరాత్మకంబును, బ్రహ్మస్తుతియుఁ, ద్రిమూర్తి
స్తుతియు, లక్ష్మీగౌరీసరస్వతీప్రభావంబును, నష్టదిక్పాలకాదిదేవతాప్రార్థనం
బును, వినాయకషణ్ముఖమైలారగుణోత్కర్షయుఁ, జంద్రాదిత్యులప్రభావంబును,
వైనతేయశేషవ్యాసవాల్మీకసుకవిప్రశంసయుఁ గవిత్వలక్షణంబును, కుకవినిరసనం
బును, మన్మథవిభ్రమంబును, బురవర్ణనయుఁ, బ్రాకారపరిఖాప్రాసాద ధ్వజ
సాలభంజికాగోపురదేవాలయ గృహవిలసనంబును, బ్రహ్మక్షత్రియవైశ్యశూద్ర
జాతివిస్తారంబును, విపణివిభ్రమంబును, బుష్పలావికాభిరామంబును, వారాంగ
నావర్ణనయుఁ, బామరభామినీచతురతయుఁ, జెంచెతల యొప్పును, బుణ్యాంగ
నాజనవిశేషంబును, నుద్యానవనసరోవరచయసుభగంబును, మలయమారుతం

బును, గజాశ్వపదాతివర్గవిలసితంబును, (1 ఆ.) నాయకోత్కర్షయు, సభావర్ణనయు, నృత్తగీతవాద్యసాహిత్యసమంజసంబును, నాశీర్వాదంబును, నీరాజనవిధానంబును, ఛప్పన్నదేశంబులనామంబులును, రాజ్యపరిపాలనంబును, స్త్రీవర్ణనయు, నవలోకనంబులును, నన్యోన్యవీక్షణంబును, దశావస్థలును, స్త్రీ పురుషవిరహంబులును, విరహభ్రాంతియు, శిశిరోపచారంబులును, సఖీవాక్యంబులును, మన్మథచంద్రాదిప్రార్థనంబులును, దద్దూషణంబులును, వైవాహిక పతివ్రతాలక్షణంబులును, నభ్యంగవిధియును, సూపకారవిరాజితంబులును, విషనిర్విషవిశేషంబులును, భోజనమజ్జనతాంబూలాదులును, కేళీగృహంబులును, సురతప్రకారంబును, సురతాంత్యక్రమంబును, సంతానవాంఛయు, గర్భలక్షణంబును, బుత్త్రోదయంబును, బాలెంతలక్షణంబును, బాలక్రీడయు, శైశవంబును, యౌవనప్రాదుర్భావంబును, సాముద్రికంబును, (2 ఆ.) రాజనీతియు, సేవకనీతియు, లోకనీతియు, సుజనప్రవర్తనంబును, గుజనవ్యాప్తియు, నన్యాపదేశంబులును, సూర్యాస్తమానంబును, సాంధ్యరాగంబును, సాయంకాల సమీరణంబును, దీపకళికావిధానంబును, విదియచందురునిచందంబును, దారకావర్ణనంబును, జక్రవాకవియోగంబును, విటవిడంబనలక్షణశృంగారంబులును, విటలక్షణంబును, వేశ్యాలక్షణంబును, గుటీవేశ్యాచేష్టలును, వేశ్యామాతృప్రగల్భంబులును, భద్ర దత్తక కూచిమార పాంచాల లక్షణంబులును, జిత్తిని హస్తినీశంఖినీపద్మినీజాతిప్రకారంబును, బాలాయౌవనాప్రౌఢాలోలాలక్షణంబులును, గూట ప్రకారంబును, రతివిశేషంబును, రతివర్ణనంబును, గళాస్థానవిశేషంబులును, బ్రణయకలహంబును, నందుఁ గూర్మిగలుగుటయు, నంధకారంబులును, నిశవిడంబంబును, జారసంచార లక్షణంబులును, జంద్రోదయంబును, జంద్రకిరణలాంఛన చంద్రికావిభ్రమంబులును, జకోరికావిభ్రమంబును, జకోరికావిహారంబును, వేగుఁజుక్కపొడుచుటయును, గుక్కుటారవంబును, జంద్రతారకాస్తమానంబులును, బ్రత్యూషంబును, బ్రభాతమారుతంబును, నరుణోదయంబును, బ్రభాతరాగోదయంబును, (మూఁడవయాశ్వాసము) మధ్యాహ్నసూర్యవిడంబంబును, గ్రీష్మ

వర్షాశరద్హేమంతశిశిరవసంతర్తువర్ణనంబులును, వనవిహారంబులును, దశదోహదంబులును, నవకోకిలకీరహంసవిరావసంచారలక్షణంబులును, జలకేళియు, వస్త్రాభరణవర్ణనంబును, మధుపాన సిద్ధపురుషప్రభావంబును, యోగినీప్రభావంబును, ద్యూతలక్షణంబును, మృగయావినోదంబులును, మృగలక్షణంబులును, సముద్రవర్ణనంబును, దల్లంఘనవిధంబును, సేతుబంధంబును, నదీవర్ణనంబును, పుణ్యక్షేత్రప్రభావంబును, వ్రతమాహాత్మ్యంబును, గిరివర్ణనంబును, నారదాగస్త్యాదిమహర్షిప్రభావంబులును, వైరాగ్యయోగతపోలక్షణంబులును, తపోవిఘ్నంబును, దేవతాప్రత్యక్షంబును, దండయాత్రయు, శంఖభేరీరవంబులును, గుణధ్వనియు, రథాస్త్రవేగంబులును, బాణపాతంబును, ప్రతిజ్ఞయు, వీరాలాపంబులును, దూతవాక్యంబులును, హీనాధిక్యంబులును, రణప్రకారంబును, మల్లయుద్ధంబును, రణభయంబును, రణాంత్యంబును, లోభదైన్యగుణంబులును, మనోవ్యధయు, ధనికదారిద్ర్యక్షుధార్తికలక్షణంబులును, రోదనంబును, శకునంబును, స్వప్నఫలంబును, దిగ్విజయంబును, ధర్మోపదేశంబును, శృంగారంబును, భావవిస్తారంబును, గీర్తియు, భూభరణంబును, గాంభీర్యధైర్యగుణంబులును, దానవిశేషంబులును, ఘాటీచాటుధారావిశేషంబులును, బరోక్షంబును, గల్పితకల్పవల్లియుఁ, జక్రికానాగ పుష్ప ఖడ్గ గోమూత్రికా మురజాదిబంధంబులును, పాదగోపన పాదభ్రమక పంచవిధవృత్త చతుర్విధగర్భకందవృత్త పంచపాదవృత్తంబులును, నిరోష్ఠ్యంబును, ద్వ్యక్షరియును, నవరసోత్పత్తియు ననువర్ణనంబులుం గలుగఁ గవీంద్ర



కావ్యనామంబులతో వివరించెద.

---

ఈ పద్యములను గ్రంథమునఁ జేర్చుకొనుఁడు.

సర్వజ్ఞ—మలయమారుతము. షష్ఠస్కంధము.

సీ. పోఁడిమీఱఁగనున్న పుడుతు జక్కవ లింక
నక్కట వెగ సెగాఁ గాడకున్నె,
సరిగాని వెంతయుఁ జలుల లోఁ బడనున్న
గిరులెల్ల నీఁకఁ బెచ్చు పెరుఁగకున్నె,
పగిలి లోఁగరఁగెడు బంగారు కుండలు
తలకెక్కి యటమీఁదఁ జెలఁగ కున్నె,
కలఁగినమాలూర ఫలము లింకిటమీఁద
గిట్టితి దీవులఁ బెట్టకున్నె,
గీ. సదు...గ మైన సున్నతిఁ బాయవలసె
నక్కటా! మాకు నని యవి యాత్మఁగుంద
మునుపు చింతాంధకారంబు మొనసె ననఁగ
నలిన లోచన చను మొనల్ నల్లనయ్యె.[?]

(నైషధమందలిదిగా నీపద్యము నాం.సా.గ్రంథసంధాత యుదాహరించినాఁడు. నైషధమునఁ గానరాదు.)

సీ. మించి కన్నులఁ గోరగించురాజాన్నంబు
లోలుప యించుకలేని యొలుపుఁ బప్పు,
అభినవసంతప్త హైయంగవీనంబుఁ
బరువంపు రుచి నొప్పు పాయసములు,
నేతను మిరియాల నెనసిన కూరలు
ఖండశర్కరతోడఁ బిండివంట,
గ్రొజ్జుగాఁ గాఁచిన గోక్షీరపూరంబుఁ
బనసరంభాచూతఫలచయంబు,

గీ. ద్రాక్షపండులు ఖర్జూర మాక్షికములు
బహుసుగంధిరసావళు ల్పానకములు
పెక్కువిధములపచ్చళ్లు పెరుగునుజ్జి
గయును వడ్డించి రెంతయుఁ గ్రమముతోడ.

ఈ క్రింది పద్యము భాస్కరునిదిగా ఆం. సా, చే
నుదాహృతము.

సీ. తొలిపల్కు మునికోలఁ దోఁచువారువములు
వారువములఁ గన్నసారథియును,
సారథిఁగన్న యాస్త్రము నస్త్రమును మోచు
గరి గరితోడఁ దొడరెడునారి,
నారిమీఁదటి తేరు తేరిమీఁదటి విల్లు
నావిల్లు పైపట్ల నరుగు రథము,
మెఱుఁగుఁజిప్పలజోడు మెయిజోడుపై గతుల్
గతులపై విజ్జోడుకండ్లు గండ్ల,
గీ. సరివెలుఁగుచున్న ములికియు సంఘటించి
విషమలక్ష్యము ల్సమదృష్టి విఱుగనేసి
జయముచేకొన్న విలుకాఁడు చక్రవర్తి
కరుణావళుకొత్త మనలను గాచుఁ గాత.

తిక్కన—విజయసేనము.

సీ. పద్మంబులును పద్మరాగప్రతి
బింబములును తగ బెరసి మెఱయఁ,
గల్లోలములును రంగన్మకరాయిత
తుండములును నటు తొట్రుపడఁగ,
బిసములు విహారణరసనమాగతరసా
తలనాగశిశువులు చెలిమిసేయఁ,

జక్రయుగ్మంబులు జలకేళిలోలని
తంబినీ స్తనములు తడఁబడంగ,

గీ. సొంపు మీఱినట్టి పెంపును గంభీర
తయును బరపు (బోవు) వేడ్కఁ దగిలి జనులు
సంస్తుతింప నఖిల సన్నివేశస్థితి
నప్పురంబు పరిఖ యతిశయిల్లు.

చ. తరుణుల వీఁగుఁజన్నుఁగవతాఁకున మన్మథచక్రవాకబం
ధురగతిలీలఁ గామినుల తోరపుటూరుల ఘట్టనంబులన్
కరివరహస్తకాండపటుఘట్టనలన్ బరిఖాతరంగముల్
దిరుగుడువడ్డతీరములఁ దెట్టువుగట్టు సరోజరేణువుల్.

## పోతరాజు—బేతాళ పంచవింశతి.

క. ధరమిన్ను దఱిఁగివైచిన
కరణిఁ దటాకంబు లెల్లకాలమునందున్
బరిపూర్ణము లైయుండును
బురికి నవగ్రహభయంబు పొరయక యుండన్.

## వసంత విలాసము—సోముఁడు.

శా. ప్రాలేయప్రతిసీరసేనఁబఱపెన్ బైపై వసంతం బిలన్
గాలోన్మీలితకోరకోదరపరాగప్రౌఢకోపాగ్నియై
హాలాపానవిహారపారమహిళాహంకార దోస్సారమై
హేలాపల్లవహేతిఖండితమహాహేమంత సామంతమై.

## అనిరుద్ధచరిత్రము—(భావన) పెమ్మన.

గీ. పూని తిమిరారు లందఱు పొడిచిరేని
పంకమగ్నరత్నంబులభాతి నించు

మినుకు మినుకని యంతన పొనుఁగు వడరె
యనఁ బటుధ్వాంతజృంభణ మగ్గలించె.

## కళావతీశతకము—కసవరాజు.

క. ఆకంజానన యుపరతి
కాకాశము నడఁకెఁ దార లటునిటువడియెన్
బోకైన(గి)రులు గదలెను
భీకర మగుతమము చంద్రబింబముఁ గప్పెన్.

## చౌడన (గంగరాజు)—నంద(న)చరిత్ర.

శా. సారాచారవిచారు నుత్తమకులున్ సౌజన్యధన్యున్ గృపా
పారున్ శూరు వికారదూరు ననఘున్ గంభీరు ధీరున్ మహో
దారున్ భవ్యు సమస్తకార్యవిదు నాప్తప్రాప్తు సర్వేంగితా
కారజ్ఞున్ హితు మంత్రిఁ జేసి పతి సౌఖ్యం బందుచుండం దగున్.

## పెమ్మన (భావన)—అనిరుద్ధ చరిత్రము.

గీ. పొదలి యొండొండ దివియును భువియు దెసలుఁ
బొదివి కొనియెడి చీఁకటి ప్రోవువలన
మిక్కుటంబుగఁ గాటుక గ్రుక్కినట్టి
కరపటం బన జగదండఖండ మమరె.

---

## పెదపాటి జగన్నాథ కవిమాత్రమే యుదాహరించిన కవులు, కావ్యములు.

1. అప్పన్న—చారుచర్య; 2. ఎఱ్ఱయ (సూచిరాజు)—కొక్కోకము, సకల పురాణసారము; 3. ఎఱ్ఱాప్రెగడ(పెదపాటి)—కుమారనైషధము, మల్హణ చరిత్రము; 4. కేతన (మూలఘటిక)—ఆంధ్రభాషాభూషణము, దశకుమార చరత్రము;* 5. కొండయ (బొడ్డపాటి)—చాటువు; 6. కొమ్మయ్య (నిశ్శం

కుని)—శివలీలావిలాసము; 7. గౌరనకవి-నవగ్రహస్తవము; 8. చంద్రమౌళి—హరిశ్చంద్రకథ; 9. చౌడయ్య (గంగరాజు)—సాముద్రికశాస్త్రము; 10. త్రిపురాంతకుఁడు (గాలిపాటి)—తారావళి; 11. తిమ్మయ్య (ముక్కు)—పారిజాతాపహరణము;* 12. దుగ్గన (దగ్గుబల్లి)—నాసికేతోపాఖ్యానము; 13. ధర్మయ (చరిగొండ)—చిత్రభారతము;* 14. నరసింహభట్టు (అయమూరి)—షోడశరాజచరిత్ర; 15. నన్నిచోడుఁడు—కళావిలాసము, కుమారసంభవము;* 16. పెద్దన్న (పిన్నకోల)—కావ్యాలంకారసంగ్రహము;* 17. పేరయ్య (బొడ్డపాటి)—అనంతమహత్త్వము, చాటువు, పద్మినీవల్లభము, మంగళగిరివిలాసము, శంకరవిజయము, సూర్యశతకము; 18. పోలమరాజు—పర్వతపురాణము; 19. బసువన్న (అంగర)—ఇందుమతీకల్యాణము; 20. బసువయ్య (తులసి)—సావిత్రికథ; 21. మల్లయ్య (నంది)—మదనసేనము; 22 మల్లయ (నంది), సింగయ (ఘంట)—ప్రబోధచంద్రోదయము;* 23. మల్లయ (సంపూరి)—హరిదత్తోపాఖ్యానము; 24. మల్లయ (ప్రౌఢకవి)—రుక్మాంగదము;* 25. మల్లయ (మద్దికాయల)—రేవతీపరిణయము; 26. మల్లయ (మాదయగారి)—రాజశేఖరచరిత్ర;* 27. మల్లుభట్టు (ఘటసాసి)—జలపాలి మహత్త్వము; 28. మాధవుఁడు (ఫణిధవు)—ప్రద్యుమ్నవిజయము; 29 ముత్తరాజు (నెల్లూరి)—పద్మావతీకల్యాణము; 30. రామరాజు (ఎలకుర్తి)—రామలింగశతకము; 31. రామలింగయ్య (తెనాలి)—కందర్పకేతువిలాసము, హరిలీలావిలాసము; 32. వల్లభరాయుఁడు—వీథినాటకము; 33. శేషనాథుఁడు—పర్వతపురాణము; 34. శ్రీనాథుఁడు—వల్లభాభ్యుదయము; 35. సర్వన్న (మలయమారుతము)—షష్ఠస్కంధము;(చూ.అనుబంధము పే. 182) 36. సింగయ (ఏర్చూరి)—కువలయాశ్వచరిత్ర, భాగవతము (షష్ఠస్కంధము),* 37. సింగయ (మడికి)—వాసిష్ఠము;* 38. సూరయ్య (కంచిరాజు)—కన్నప్పచరిత; 39. సూరయ్య (నూతనకవి)—ధనాభిరామము;* 40. సోమయ్య (దామరాజు)—భరతము; 41. సోమయ్య (పెదపాటి)—అరుణాచలపురాణము, శివజ్ఞానదీపిక; 42. సోమేశ్వరుఁడు

(పాలపట్టి);† 43. సాళ్వభట్టు—ఉత్తరనృసింహపురాణము, కామందకము, నీతిసారము, పంచతంత్రము.

---

## ఆంధ్రసాహిత్యపరిషద్గ్రంథ సంధాత మాత్రమే యుదాహరించిన కవులు, కావ్యములు.

1. అహోబలాచార్యులు—భారతము; 2. అనంతుఁడు—ఛందస్సు, 3. అన్నమరాజు (కానుకొలను)—అమరుకము; 4. అన్నమయ్యంగారు (తాళ్లపాక)—తిరువేంకటేశ్వరశతకము; 5. ఎఱ్ఱాప్రెగడ—హరివంశము;* 6. కేతన—కువలయాశ్వచరిత్ర; 7. కొమ్మయ (నిశ్శంకుని)—వీరమాహేశ్వరము; 8. గంగాధరుఁడు (కాకమ్రాని)—శాలభారతము; 9. గణపయ (రాయసం)—సౌగంధికాపహరణము; 10. చిన్నయ(చందలూరి)—నాసికేతోపాఖ్యానము; 11. తిప్పరాజు (పిడిపెల్ల)—కాంచీమాహాత్మ్యము; 12. తిమ్మయ (సంటముక్కల)—శైవాచారసంగ్రహము; 13. దుగ్గన (దగ్గుబల్లి)—శివకాంచీమాహాత్మ్యము; 14. దేచిరాజు—రావరది; 15. దేవరాజభట్టు—హరిశ్చంద్రకథ; 16. నాగనాథుఁడు (పశుపతి)—శ్రీవిష్ణుపురాణము; 17. పద్మకవి—జినేంద్రపురాణము; 18. పెద్దన్న (అల్లసాని)—మనుచరిత్రము;* 19. పోతరాజు—బేతాళపంచవింశతి; 20. భీమన్న,‡ 21. మారన—మార్కండేయపురాణము;* 22. ముద్దమరాజు (రెడ్డిపల్లె) అష్టమహిషీకల్యాణము; 23. రామయ్య (వాసిరాజు)—బృహన్నారదీయము; 24. రామయ్య (ఆంధ్రకవి)—విష్ణుకాంచీమాహాత్మ్యము; 25. వీరయ్య (పోతరాజు)—త్రిపురవిజయము; 26. వీరయ్య (పిల్లలమఱ్ఱి)-పురుషార్థసుధానిధి, శాకుంతలము.* 16. శ్రీగిరన్న (చెనమల్లు)—శ్రీరంగమాహ

---

† ఈ కవి యుదాహరించిన పద్య మేగ్రంథములోనిదో?

‡ పద్యసంఖ్య 481 జగన్నాథకవి కంచిరాజు సూరయ్యదిగా నుదహరించినాఁడు. "భీమకవి దశావతారపద్య" మని ఆం. సా. ప. గ్రంథసంధా

త్స్యము; 28. సర్వదేవుఁడు—ఆదిపురాణము, విరాటము; 29. సిద్ధనప్రెగడ—శాకుంతలము; 30. సోమయ (పెదపాటి)—త్రిపురవిజయము; 31. సోముఁడు—వసంతవిలాసము (అనుబంధము చూ. 184 పే.); ఇంద్రసేనము, పురాతనచరిత్రము, రంగనాథశతకము.

---

## ఇరువురు నుదాహరించిన కవులు కావ్యములు.

1. అమరేశ్వరుఁడు (చిమ్మపూఁడి—విక్రమసేనము. (11,12,13,14, 15,16,17,19,20, 21,23,24,25, 27,28,29,30, 31,32,33,34,35,36,37,38, 39,40,41,42,45,46,47,48,49,51,52,53,55,56,57,58,59,60,61,62—అం) (18,26,43,44,50,54-జ.) (22,63—ఇ); 2. ఎఱ్ఱాప్రెగడ—నృసింహపురాణము.* 3. కసవరాజు (తెల్లపూఁడి)—కళావతీశతకము. (93—అం.) (చూ. 185 పే. అను II.-జ.)(94-ఇ.); 4. కేతనప్రెగడ (భాస్కరుని)—కాదంబరి. (96-జ.) (97-ఇ); 5. గంగరాజు (చిరుమూరి)—కుశలవోపాఖ్యానము. (116-అం.) (117-జ.); 6. చౌడయ్య (గంగరాజు)—నందనచరిత్ర. (147, 148,149,150,151-అం.) (145. 146-జ.); 7. జక్కన్న (పేరమరాజు)—విక్రమార్కచరిత్ర;* 8. తిక్కన—విజయసేనము. (153,157,-అం) (152,154,155,156,158,159,160-జ.);-ఉత్తరరామాయణము;* 9. త్రిపురాంతకుఁడు (రావిపాటి)—అంబికాశతకము. (168,169-అం.) (170-జ.); ఉదాహరణము (171-ఇ.) 10. నన్నయ్య—భారతము.* 11. పెద్దిరాజు (పొన్నాడ)—ప్రద్యుమ్నచరిత్ర. (206-అం.) (189,190,191,192,193, 194,195,196,197,198,199, 201,202,203,204,205,207,208,209, 210-జ.) (200-ఇ.); 12. పెమ్మన (భావన)—అనిరుద్ధచరిత్ర. (211 మొ॥ 221 వఱకు, 223-224, 226-229, 231-236, 238-244, 246-262, 265-273-అం.) (222,230,245,-జ.) (225,237, 263,264-ఇ.) 13. పోతరాజు (బమ్మెర)—భాగవతము;* 14. భాస్కరుఁడు—రామాయణము;* 15.

భైరవుఁడు (పోతరాజు)—శ్రీరంగమాహాత్మ్యము;* 17. ముమ్మయ (జైతరాజు)—విష్ణుకథానిధానము. (365,368,369, 371,372,373,375,377, 377 (a), 379,380,381,385,387,388,389,391,392,393,398,402,403, 405—ఆం.) (367,374,376,378,382,383,390,394,395,396,399,400, 401,404,406-జ.) (366,370,384,388,397-ఇ.); 18. రంగనాథుఁడు (408-ఆం.) (407,409-జ); 19. వీరయ్య (పిల్లలమఱ్ఱి)—శాకుంతలము;* 20. సింగయ (మడికి)—పద్మపురాణము;* 21. సోమయ (పెదపాటి)—కేదారఖండము; (499,500,501,504,505,506-ఆం.) (499,502,503. జ.); 22. సోముఁడు (నాచిరాజు)—ఉత్తరహరివంశము.* గ్రంథనామము కర్తృనామము తెలియరానివి. (524,527-533,535,538-549,551,552,554,-560,562-567,569,571-578,580-583,585,587-597—ఆం.) (525,526, 534,536,550,553,561,568,570,579,584.586. జ.)

111-వ ప. నిశ్శంకుని కొమ్మయ శివలీలావిలాసములోనిది.

203-వ ప. ఘణిధవు మాధవుని ప్రద్యుమ్నవిజయములోనిది.

218-వ ప. పోతరాజు భైరవుని శ్రీరంగమాహాత్మ్యములో నున్నది.

269-వ ప. శ్రీనాథుని కాశీఖండములోనిది.

302-వ ప. నీతిసారములోనిది. (ఈ నీతిసారము బద్దెభూపాలునిదిగా ముద్రించుట పొరఁబాటు.)

576-వ ప. నన్నిచోడని కుమారసంభవములోనిది.

---

*ఈగుర్తు గల గ్రంథములన్నియు ముద్రితములు.

ఆం.= ఆంధ్రసాహిత్య పరిషద్గ్రంథ సంఘాతచే నుదాహృతములు.

జ. = జగన్నాథకవిచే నుదాహృతములు.

ఇ. = ఇర్వురచే నుదాహృతములు.

దీనిని పీఠిక xiii-వ పుట 3-వ బంతితోఁ జేర్చి

చదువునది:—

కవిగారు కుమారసంభవము రెండవభాగపుఁ బీఠికలో నిట్లు వ్రాసినారు. "కుమారసంభవ ప్రతులలో నొకటి నాకు నైజాము రాజ్యమునఁ బ్రాచీనశాసన శోధనార్థము పోవుచుండఁగాఁ గర్ణాటదేశమునందే లభించెను. తక్కినవి రెండును ఆంధ్రద్రవిడదేశమునందే యగపడెను" ద్రవిడకర్ణాటదేశములందు మూఁడుప్రతులు దొరకినను నన్నిటిలోఁ బెక్కులు గ్రంథపాతములుండుట వింతగానున్నది. ఆ మూఁడుప్రతులు నొక్కమాతృకకే పుత్త్రికలా యేమి? కాకున్నచో నవి పాఠభేదములు లేకయు సమానగ్రంథపాతములు గలిగియు నుండుట వింతగాదా? పట్టికలో ముఖ్యపాఠభేదములని వారు చూపినవి ప్రాయికముగా ముద్రణము సర్వానుగుణముగాఁ జేయఁబడిన సంస్కారములకు వ్రాఁతప్రతిలో నున్న తప్పుపాఠములుగా గోచరించుచున్నవి. కుమారసంభవప్రతులయొక్కయుఁ బాఠములయొక్కయు రహస్యము లింకను బయల్పడవలసియే యున్నవి.



# అచ్చుతప్పులును, అర్థానుగుణముగాఁ జేయఁబడిన సవరణలు.

---

పీఠిక

| పద్యసంఖ్య. | పాదసంఖ్య. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| x | 7 | వర్తన [?] ము | వర్తన క్రమము |
| ,, | 8 | బేహారు | బేహార |
| xvi | 10 | బేతాళపంచవింశతి | (బేతాళపంచవింశతి) |
| xxiv | 15 | వర్ధిల్లెఁడు | వర్ధిల్లుత |
| 1 | 4 | యుష్ణీషంబుగ | యుష్ణీషంబున |
| 16 | 5 | ముడిఁగొమ్ముల | ముదికొమ్ముల |
| 21 | 8 | చెట్టుప | చెట్టువ |
| ,, | 10 | తెల్లఁబెలయ | తెల్లబెరయ |
| 23 | 1 | కేలి దెప్పము . . . గ్రాతి | కేలిఁ దెప్పము . . . క్రాలి |
| ,, | 5 | ముత్తలాడుచు | ముద్దులాడుచు |
| 24 | 2 | భాత | భాతి |
| ,, | 3 | యామములుఁ | యామలును |
| 26 | 2 | జయించి | జయించె |
| 28 | 10 | పినిచేఁ | పిరిచే |
| 31 | 1 | తరులు | తఱులు |
| ,, | 2 | విడిసిన నఱవ | విడిలిన నఱువ |
| 32 | 4 | వేడ్కఁబనుపు | వేడ్కపనుపు |
| 33 | 7 | పరమాణువునఁ | పరమాణువులఁ |
| ,, | 10 | నపహాసించుఁదరుణి | నపహాసించి తరుణి |
| 35 | 10 | నినిరంజనౌషధి | జనరంజనౌషధీ |
| 39 | 10 | కదల్లి | కడలి |
| 45 | 2 | తుదల | తుదలు |
| 46 | 3 | మఱిఁగింపఁ | సురిఁగింపఁ |
| 48 | 4 | ద్వాను | ధ్వాను |

| పద్యసంఖ్య. | పాదసంఖ్య. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 50 | 3 | శాలగ | శాలను |
| 55 | 7 | యవ్వీఁగుఁ | నెవ్వీఁగుఁ |
| 62 | 5 | సుభగుల | సొబగుల |
| 68 | 2 | తెలుపైన | తెలివైన |
| 70 | 9 | తొడవుతోడ | పొడవుతోడ |
| 71 | 5 | చిన్హా | చిహ్న |
| 72 | 2 | గుణ | గణ |
| 73 | 8 | కనుమ | కనును |
| ,, | 10 | చమిరి | జమిరి |
| 75 | 2 | చన్ను | జన్ను |
| 76 | 9 | బండిఁదెచ్చి | పడసి తెచ్చి |
| 79 | 3 | యయ్యెను | యమ్యెను |
| ,, | 4 | సంపద దెలియన్ | సంపదఁ దెలియున్ |
| 80 | 11 | మేర్పరచి | మేర్పఱిచి |
| 81 | 6 | వేనీళ్లు | వెన్నెళ్లు |
| 83 | 1 | సోర | సొత్ర |
| ,, | 2 | బానా | భాగా |
| ,, | 8 | పొగవు | పొగుపు |
| 84 | 9 | కాఖ్య | కార్థ |
| 85 | 6 | దుర్విధ | దుర్వ్యథా |
| 86 | 11 | నవి | నది |
| 87 | 11 | నలుఁడు | నలుండు |
| 88 | 5 | వల్లికను | వల్లికిని |
| ,, | 11 | పడెనో | పడనో |
| 91 | 2 | నొందవు | గుంపవు |
| ,, | 3 | సంఘుములం | సంఘుములుం |
| 97 | 3 | తెరిగినఁ | తెఱిఁగినఁ |
| ,, | 9 | శయత్వంబును | శీతలత్వంబుఁ |

| పద్యసంఖ్య. | పాదసంఖ్య. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 98 | 1 | మయ్యు్యనుదేరు | మయ్యు్యను తేరు |
| ,, | 2 | ల్మాటున | ల్మాటును |
| ,, | 4 | బట్టవె | (బట్టులె |
| 100 | 3 | ముఖంబున | ముఖంబునన్ |
| 101 | 3 | చుండఁగ [?]...బల్లెరము | చుండఁగఁ . . . పల్లెరము |
| 102 | 9 | గొనిపాయ | గొనఁబాయ |
| 103 | 1 | దీర | దీఱ |
| 104 | 4 | వర్ణ | నీయ |
| 105 | 6 | వసి | సని |
| 113 | 3 | స్త్రీలను | స్త్రీలకు |
| ,, | 8 | పగకు | పల్లె |
| 118 | 1,2 | ఖామ్యదత్తవహ్ని | తోడ ఖామ్యహుతవహ్ని |
| 119 | 2 | నిథి | నిధి |
| 120 | 3 | లోద్ధత | లోత్థిత |
| 121 | 4 | చంద్రా | జంద్రా |
| 123 | 7 | ప్రౌఢిఁగోమల | ప్రౌఢికోమల |
| ,, | 4 | పరిబాణు | పరమాణు |
| 126 | 2 | నురుచున్ . . . శతన్ | నురువున్ . . . తలిన్ |
| 128 | 1 | మార్తాండుఁడు | మార్తాండును |
| 131 | 2 | సర్గ | వర్య |
| 133 | 4 | గపియున్నలిం | గపి యున్నవిం |
| 135 | 3 | జే | రే |
| 137 | 9 | మధిత | మథిత |
| 139 | 5 | కబరిభారంబునఁ | కబరీభరంబునఁ |
| 144 | 2 | వలంద | వలఁద |
| 149 | 1 | వాక్కలిమి [?] | వాకలిమి |
| ,, | 4 | యుపర | యుదయ |
| 151 | 1 | వేలుపు . . . లెల్లఁగాఁ | వేల్పును . . . తెల్లతా |

| పద్యసంఖ్య. | పాదసంఖ్య. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 151 | 2 | క్రే | క్రేఁ |
| ,, | 3 | బలికింపుచు | బలికించుచు |
| 152 | 5 | నెట్టిమాన్యుల | నేవదాన్యుల |
| 155 | 4 | దాల్చె | దార్చె |
| 159 | 5 | శ్రేష్ఠి | సృష్టి |
| 166 | 1 | సైరభ | సైరిభ |
| 169 | 2 | జాడగ | జాడగఁ |
| 171 | 1 | బాఁపట | బాపట |
| ,, | 4 | సుతాది | సుతాస |
| 172 | 3 | నిర్వాణ | నిర్వాహ |
| 177 | 1 | క్షోణి | క్షోణీ |
| ,, | 7 | హారి | హార |
| ,, | 8 | వితతులు | వితతులై |
| ,, | 11 | నర్జున . . . ద్ధ [?] | నర్జునాయిత . . . ద్వ్యధికబద్ధ |
| 178 | 1 | మడరించె | మెఱమించె |
| 179 | 4 | వితత | వితతి |
| 181 | 3 | శర్వరి . . . నాఁగడి | శర్వరిఁ, . . . నాఱడి |
| 182 | 4 | ఘూర్ణైక | ఘుర్ణైక |
| 185 | 2 | పట్టును | పట్టను |
| ,, | 3 | జేగిలు . . . సమర్ప | జెంగిలు . . . సెమర్ప |
| ,, | 4 | జిడిముడి | జిడిముడిఁ |
| 186 | 10 | కండయుతని | కందమతని |
| 189 | 4 | వ్రాలె | గ్రాలె |
| ,, | 6 | వోలిసె | పోలిచె |
| ,, | 7 | కుంభములకు | కుంభములకుఁ |
| 191 | 2 | నోఁచివురు | నోఁచి మరు |
| 193 | 6 | బాడిదెఱిచి | బాహుసఱిచి |
| ,, | 7 | మద్యా | మఘ్యా |

| పద్యసంఖ్య. | పాదసంఖ్య. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 195 | 3 | పాటించి | బాటించి |
| 196 | 11 | గంభీర | గాంభీర్య |
| 199 | 4 | నేద్యంకంబు | వేద్యంకంబు |
| 200 | 3 | చరమా | జరమా |
| 201 | 10 | రమణి | రమణ |
| 204 | 7 | జిత్ర . . . లై | జిత్రసుధాస్త్రరాస్తీర్ణులై |
| ,, | 9 | కడు | గడు |
| 209 | 1 | నారు | నాఱు |
| ,, | 3 | బెరిగి | బెరిఁగి |
| 215 | 1 | వతంస | వసంత |
| 218 | 1 | నివము | నిమురు |
| 219 | 10 | జంతులు మోద | జంతుప్రమోద |
| 220 | 1 | ఉచ్చైశ్రవంబును | ఉచ్చైశ్శ్రవంబును |
| ,, | 7 | పట్టణ | పట్టంపు |
| 221 | 3 | జరి | జడి |
| 222 | 8 | బోలుపు | పోలుపు |
| 224 | 6 | బెరిము | బెరిమె |
| 225 | 4 | జిలుకల | జిలుకుల |
| 230 | 5 | సత్రాణుఁ | సప్రాణుఁ |
| ,, | 10 | గా లెంత | కాలెంత |
| 234 | 4 | మలయాద్రి | వలయాద్రి |
| 237 | 2 | గన్నులునుఁ . . . చూచి | గన్నులును . . . ఁజూచి |
| 249 | 2 | ల్కామలిన | ల్తమిగొనె |
| 251 | 4 | లు, ర్యెలలుగఁ | లు, య్యెలలుగఁ |
| 259 | 4 | పరి | పర |
| 263 | 1 | బెడఁగొందు | బొగడ్గొందు |
| 266 | 2 | తనిఁగమ్మ | తనిగమ్మ |
| ,, | 4 | వలిఁదేనియ | వలిదేనియ |

| పద్యసంఖ్య. | పాదసంఖ్య. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 276 | 3 | వీధి | వీథి |
| 283 | 3 | బొడ్ట సాటి | బొడ్డ సాటి |
| 285 | 3 | లంచు | లంచుఁ |
| 286 | 3 | గల్లని | గట్టని |
| 289 | 3 | నారి | నాత్రి |
| 290 | 5 | స్థలీ | స్థలి |
| ,, | 6 | స [?] జ | సరిఁబ |
| 307 | | అంగప | అంగర |
| 318 | 3 | ముంగర | ముంగఱ |
| 340 | 10 | బాగున | బాగునఁ |
| 341 | 3 | పులుగులు | పులుఁగులు |
| 351 | 6 | వోయిన | వోయినఁ |
| 368 | 2 | వలుద | వలుఁద |
| 370 | 2 | నూ | నూఁ |
| 375 | 7 | కటాక్షంబు ల | కటాక్షంబుల |
| 380 | 2 | చెక్కులఁజిఱు | చెక్కులుచిఱు |
| 381 | 3 | మంథర | మంథర |
| 446 | 4 | మప్పురి | మన్పురి |
| 464 | 5 | దేహము దిద్దించు | దేహమ్ము వేధించు |
| 465 | | సింగము | సింగయ |
| 500 | 6 | చున్న | చన్ను |
| 537 | 3 | ......... | యూర్వశిఖి ఫాలలోచనమ నఁగసింధు,వమరుఁబాండవ మాడెడు హరునిఁ బోలి. |
| 558 | 10 | బిల్లు | బెల్లు |
| 565 | 1 | క్రొమ్మొగులలో | క్రొమ్మొగులులో |
| 592 | 1 | వారు . . . మేవేదు | వార . . . మేలందు |

Printed at the Sadananda Nilaya Press, Choolai, Madras.—1918,